# అవతారిక

ఆంధ్రసాహిత్యంలో గతదశాబ్దిని వేమన (పరిశోధనా) దశాబ్దిగా పేర్కొనక తప్పదు. వేమన మథనంలో వెలువడిన రచనాబాహుళ్యం, దృష్టి వైవిధ్యం, వివాదగాఢతా విస్తృతులు, సవాళ్ళసభలు-పురస్కారసభలు,విగ్రహ ప్రతిష్ఠలు, సరికొత్త చలనచిత్ర నిర్మాణాలు నభూతోనభవిష్యతిగా సాగిన దశాబ్దమది.

దానంతటికీ 1981-మే 30, 31 తేదీలలో విజయవాడలో వేమన వికాసకేంద్రం నిర్వహించిన వేమన సాంస్కృతికోత్సవాలు వేమన విజయభేరిని ఆంధ్ర నలుదిక్కులా మార్మ్రోయజేసింది. సభల ముగింపుగా "విశ్వదాభి రామ వినురవేమ-వేమన అంతరాంతరాల్లోకి...." అనే త్రిపురనేని పరిశోధనా విష్కరణతో, అయావిష్కారమీవేదిక మీదే మ్రోగిన వివాద డమరువు ఆ దశాబ్ది చివరంటా మ్రోగింది. ఇంకా అది ఆగలేదేమో! కాని వేమనగూర్చి ఆవరకున్న అవగాహన సమూలంగా మారిపోయింది. వేమనపోలికలేనిప్రజ్ఞ అవిష్కృతమై స్థానిక వ్యక్తిత్వంనుండి సముత్తాలంగా ఎదిగిపోయి విశ్వవేదిక నధిరోహించగలదిగా నిరూఢమయింది.

కాని మన సమాజాన్ని పట్టి పీడించుతున్న కులపిశాచి చెలరేగియున్న నేటి కాలాన యీ కులనిర్మూలకుని విషయమైన పరిశోధననుకూడ పీడించి, కొన్ని ఉపరిశోధనల్లను కూడ చేయించి అపరిశుభ్రపు వ్రాతలు వ్రాయించింది. కొన్ని కొత్త బొమ్మలను అవాంతరంగా సృష్టించింది. కొన్ని అవరకటి చిన్న బొమ్మల్ని గాలి ఊది చాలా పెద్ద బొమ్మలుగా బూరటించి వేమన కెదురెత్తుగా నిలబెట్టి, వేమన సముత్తాల విగ్రహాన్ని కుదించి కుంచించేపనికి పురికొల్పింది. కర్షకవృత్తినుండి వెలువడిన మహాపురుషులకు చేవృత్తికారబోధకులకు భేదము కల్పించే బెడ్డధోరణిని తెచ్చిపెట్టింది. అదే "తెలుగులో తొలిసమాజకవులు" అనే వైయాసకీయం ఆంధ్రసారస్వత పరిషత్ సంకలితంగా వెలుగుచూచింది,

ఏమంతగా పరిగణన పొందలేకపోయింది. ఐనా వేమన పరిశోధనలో అవాంఛనీయ ధోరణిని తార్కాణించింది.

యువకు లోకరిని మనసు విరిచి నిరాసక్తులను గావించినట్లుంది,

విజయవాడ వేమన సాంస్కృతికోత్సవాల అనంతరం వెలువడి భిన్న దృష్టి వహించిన రచనలను సమీక్షిస్తూ "ఐదేళ్ళ వేమన పరిశోధన- ఒక పేర మాపరిశీలన" అనేరచనలను, ఇతరుల రచనలను సంకలితంచేసి 1986 నాటికే అచ్చుపూర్తిచేసి, పీఠికవ్రాసే తీరికలేక ప్రక్కనబెట్టి యుంచగా 1989 నాటికి అనగా మావిశ్వదారాభిమ-వినురవేమ రచనకెనిమిదేళ్ళపిదప "నాథయోగి మన వేమన" అనే రచన ఒకటి వచ్చింది. అది వేమనను ఆధునికయుగానికి సందర్భించని కేవల యోగపురుషునిగా చెప్పే ఆకరము మాలిన రచన కావటాన దాని సమీక్షను కూడా అ వెంటనే చాలవరకు వ్రాసి పూరబెట్టివుంచాను. ఇంతలో 1992 లోకి వచ్చేశాము. ఇకనిప్పుడు కర్నూలుజిల్లా తెలుగు రచయితల సంఘం ఆధ్వర్యంలో జూన్ 29, 30, 1992 కర్నూల్లో జరిగిన సభలో వేమనపై వక్తగా పిలిచిన సందర్భంలో పదేళ్ళ వేమన పరిశోధనపై వ్యాఖ్యగా సమీక్షగా వుండేటట్టు యీ ప్రచురణ తెస్తున్నాము.

నాగార్జునుని రత్నావళి యిటీవల సంపూర్ణంగా దొరికిందని చెప్పవచ్చు. టిబెటన్నుండి సంస్కృతంలోకి అనూదితమై లభిస్తున్నది. ఆవరకు మున్నూట అరవై శ్లోక సంఖ్య దొరకగా యిప్పటికి పంచవింశతిగా సంపూర్ణంగా లభ్యమయింది. వేమన సాంఘికార్థికదృష్టి నాగర్జునదృష్టితో సంవదిస్తున్న సంగతిని యింకెంతగానో చెప్పుకోవీలౌతున్నది. సుహృల్లేఖ-రత్నావళి రచనలు వేమన విచారధారతో ఎంత పోలికగలవో చెప్పడమే ఇక తరువాయి. అనతికాలంలో ఆపని చేయజూస్తున్నాము. నా పారిశ్రామిక జీవితంతో సారస్వతపరిశ్రమను జోడించడం కష్టతరమైన పని అయిందని రచనలో ముద్రణలో అది ప్రతిఫలిస్తున్నదని గమనింప నా మనవి.

ఇట్లు,
త్రిపురనేని

26-6-1992, మద్రాసు.

# పోలికలేని ప్రజ్ఞ

వేమన భావభాండార బీగాన్నిదీసి, సాచ్చి, శోధించి, అందలివస్తుజాతాన్ని అంతనీ గుర్తించి, జాబితావేసి, దేనికిదానికిగా వెలకట్టి, అన్నింటి వెలలు వెరశి అతడింత ధనవంతుడని మదంపు ఒకటి ఒకపాటిగా వేయుటకు ఒకకొలికిరాక, తేలక ఆలస్యమగుచుండగావేమనను పలువురింటిలో వారితోను, ఇరుగుపొరుగు వారితోను, దూరదూరాలవారితోను పోలికజేసి చెప్పసాగించారు. ఎప్పటినుంచో చెప్పుకున్నారు. మన పొరుగువారే ఇందులో మనకన్న ముందున్నారు. మనలో గడుసరి పండితులు కొందరు ఏగంటివారితోను, ఇటీవల వేమనను అచ్చు వేయించిన ఒక ముత్యాల నారసింహయోగి యనేవానితోను కడకు పోలిక బెట్టటం ఉచితమనుకొన్నవారు అనుకొని అట్లేచేయగా, దక్షిణభారత పటంపై ఆయనను నిలపటానికి బలవంతపు పోలికలు తెచ్చి చూపించటానికి దిగినవారు దిగినారు. బలవంతపు పోలికలనగా తమిళుల తిరువళ్ళువరు, అవ్వయారు, అరుణగిరి-మహారాష్ట్రుల తుకారాములతోతెచ్చిన పోలికలని తాత్పర్యం.వల్లువరు వేమనలొక రాశివారు - ఒక ధోరణివారు-ఒక కోవలేనివారు - అసలు కానేకారు. అర్థవంతాలు ప్రబలాలు ప్రధానాలైన పోలికలు వారిద్దరకు శూన్యం. వారివారి ప్రత్యేకతలు సరిపోలేవికావు. ఎవరి ధోరణి వారిది, ఎవరిగొప్ప వారిది. అంతే. కాని విశ్వవిద్యాలయాల పరిశోధనలోకూడ వల్లువరు వేమనల సాదృశ్యం బలాత్కారంగా సాగిపోతున్నది. దురదృష్టం. తక్కినవారితో పోలికమాట చెప్పనక్కరలేదు. నిజమైన సహజమైన పోలిక కర్నాటక సర్వజ్ఞ మూర్తితోనేయని చెప్పాలి. ఆ పోలిక పర్వమేదో కర్నాటక జానపదులే చెప్పు కొన్నారు. 'సర్వజ్ఞ వేమన సంవాదం అనే గాథొకటి సృష్టించుకొన్నారు.

దక్షిణ భారత రంగంమీదికి వేమననుదెచ్చే పాట్లు ఇలా ఉండగా ఇంతలో తెలుగుదేశంలో హిందీపరిచయం పాండిత్యం పెరిగి పెంపొందటంతో వేమన కబీరు బాయవాడని హిందిలో వ్రాయసాగారు, పరిశోధక పట్టాలు

పొందగలిగారు. కబీరు వేమనలకు ప్రధాన ధోరణుల్లో పోలికలు నిజంగా ఉన్నాయి. స్థూలదృష్టికే అవి తగులుతాయి. కబీరు ననుసరించిన ఇతర ఔత్తరాహులతో భావ సారూప్యం వుంది. అదెంత జేసినారో తెలియదు.

ఆపైన భారతీయ సంస్కృతి పరిశోధక వ్యాఖ్యాతలు ఆ సంస్కృతిలో వివిధ భాషా ప్రాంతాల భాగస్వామ్యాన్ని అజదీసికొని, పాళ్ళు నిర్ణయించి ఆంగ్లంలో వ్రాసిన నవీనదృష్టులు ఉన్నారు. వారి రచనలవలన వేమన పేరు అఖిలభారతపట్టికలకెక్కి ప్రచారాన్ని కొంతగడించుకొంది. ఆఆచార్యవ్యాఖ్యాతలు వారుగా వేమనను అనువాదంలో చదువుకొని తమంత సొంతంగా అభిప్రాయ మేర్పరచుకొన్నారేగాని, వారు చదువుకొనుటకు ఉన్నంతలో మన మదింపులు వారిముందు లేకపోయాయి అయినా వారివారి పరిమితుల్లో వారు చేయగలిగింది చేశారు. అలా చేసినవారు కొందరు మనవారికన్న మిక్కిలి వెమన్నను మన్నన చేశారు కూడ. ఇదిగో, ఆచార్య జైనయకుమార్ సర్కారు మాట.

'His [Vemana's] place in Hindu Positivism is of the same rank as that of Kabir, Chaitanya and others, if not even higher.

[Positive Background of Hindu Sociology

ఇంత వ్రాసినప్పటికీ – ఇవి చెదురు మదురు వ్రాతలే అని చెప్పవలసి నప్పటికి – వేమనలోతు వారి రచనల్లో ఆకళించుకోలేదని చెప్పక తప్పదు.

భక్తి ఉద్యమం ఒకటి మధ్యయుగ భారతంలో తలయెత్తిందని, అసలు భాషా ప్రాంతాలలో భిన్న శతాబ్దాలలో వ్యక్తమైందని, అదోమార్మిక విప్లవం అని [Mystic Revolution], దైవాన్ని మతాన్ని మతానుభవాన్ని ప్రజల పర మొనర్చిందని, కులంపై తిరగబడిందని, దైవం ముందు అందర్నీ సమానుల్ని చేసిందని, అది [Bhakti Egalitarianism] అనీ, సాంఘిక ఆర్థికవ్యవస్థలో మార్పు రాని, రాజాలని పరిస్థితుల్లో అది ఛాయా విప్లవం అని [Mirror Revolution in the absence ofa fundamental change of th Indian Social Economy] తీర్మానం జేసిన ధూర్జటిప్రసాద్ రచనలున్నాయి. వళ్ళువరునుకూడ ఈ మార్మికుల్లో, భక్తుల్లోచేర్చి మధ్యయుగం మాటెత్తేవారున్నారు! బసవన్న, జ్ఞానదేవ్, నామదేవ్, తుకారామ్, రామానంద్, కబీరు, దాదూ, నానక్, లాల్‌దాస్, రాయ

దాస్ చైతన్యుల్ని వీరు పట్టికచేసి చూపుతున్నారు. ఆ జాబితా చివర వేమన పేరు మనంగా చేర్చటానికి, జాబితానడుమ వారి సరసన ఎక్కడనో చేర్చి, వారు చేసిన మదింపుతో మనమేకీభవించడంతో మనం పరిమితం కారాదనుకుంటాను. కబీరు బాయలోవాడు వేమనయన్నప్పుడుగూడ ఆకబీరుని మనంగా మదింపు చేయవలసి ఉంటుంది. అంతపని ఇప్పుడిందు తలపెట్టకుండానే, ఉత్తరాది వారు తదితరులు వారి వారి భక్త సంస్కర్తల్నిగూర్చి యిచ్చిన వివరణలను మదింపులనుబట్టి, వేమనను వారిపాటివానిగానో, దిగువవానిగానో ఆయా జాబితా లలో ఆయా ఉద్యమాల చట్రాల లోపల బిగించడాన్ని ఇంచుక పరిశీలిద్దాం.

కబీరులోగాని, ఇంకా ఇతర మార్మికులు భక్తులు మరెవ్వరిలోగాని మనుష్య జీవితపు ప్రాథమిక విషయమైన ఆర్థిక విచారణకోసం వెయ్యి దివిటీలు వేసి వెదకినా కానరాదని– అది వేమన వాక్కునిలోనే కానవస్తుందని ముందే గ్రహించవలసియుంది.

వీరికి సాంఘిక 'తిరుగుబాటుదారు'లని [Social Rebels] నవీనులిప్పుడు నామకరణం జేసినంతమాత్రాన వీరేదో అనేకానేక అగాధ సాంఘిక సమస్యా విచారకులని మనం అనుకోనక్కరలేదు. వీరి "సాంఘిక తిరుగుబాటు"అన్నది కుల వ్యవస్థను కూలద్రోయడానికే అంతకుమిగిలితే హిందూ ఇస్లాం సామరస్య సమానతల్ని చెప్పటానికే పరిమితంగాని, మరే యితరమైన సంఘ సమస్యా వివేచనాన్ని పరిష్కారాన్ని వీరివద్ద ఆనవాలుకైనాచూడలేము.

హిందూ–ఇస్లాం సామరస్య సమన్వయ సహనాలన్న విషయం ఎలాగూ మత విషయమే. ఇక కుల సమస్య స్వచ్ఛంగా నూటికినూరుపాళ్ళు సాంఘిక సమస్యకాదని చెప్పవలసియుంది. మధ్య యుగంలో మరిమరీ మతం పాలెక్కు వగా గల సమస్య. ఆధ్యాత్మ తత్వాన్నుండి మతాచార విశ్వాస కర్మకాండల నుండి భారతదేశ కులవర్గ వ్యవస్థకు పునాదులుపడి పదిలమైయుందిగదా! కన్యాశుల్కంవలె, స్త్రీ పునర్వివాహంవలె, వేశ్యా వ్యవస్థవలె, బాల్య వివాహం వలె, స్త్రీ విద్యవలె కులసమస్య ఒక సాంఘిక సమస్య మాత్రమేకాదు. ఇంతకు చెప్పవచ్చిందేమనగా, వీరిని సాంఘిక తిరుగుబాటుదార్లనిపించిన సమస్యలు

భక్తి ఉద్యమాల్లో మత పరిధిలోనివి గాకుండా సాంఘికాలుగా విడబడ్డవి కావనడమే.

ఆ మాట అట్లుండగా, కుల సమస్యనైనా కూలంకషంగా నలుకోణాల నుండి వేమన చర్చించినంత సూక్ష్మాతి సూక్ష్మంగా వీరెవ్వరూ చర్చించి ఎరుగరంటే నివ్వెరపోనక్కరలేదు. ఆహార నియమాల్ని నిషేధాలనుబట్టి, అనులోమ విలోమ వివాహాల స్థితినిబట్టి, కామాతిరేక విషయాలనుబట్టి, ఆచార విశ్వాసాల్ని బట్టి వేమనజేసిన కులవ్యత్యాస విచారంలోతులువైశాల్యమూ వీరివద్దలభించవు. ఇందులోఆ విషయంలో చూపిన పాటికేవీరెవ్వరికన్నా వేమన ఎంతోసునిశిత వీక్ష గలవాడని రూఢీవేయజాలియుంటుంది. ఆపైన ఈడుజోడుగాని పెళ్ళిళ్ళు వద్దని పెళ్ళికిద్దరి సమ్మతి ప్రేమాయుండాలనీ, యుక్తవయస్సు సంకల్పంలేని పెళ్ళిళ్ళుసుగాదనీ, పడుపువృత్తిలో జొనుపరాదనీ హత్యా మరణశిక్షలసంగతిలోనూ మానవునిలో ఆకలికిపైన మానాభిమానాలమాట, మనుష్యుని వ్యక్తిత్వంమాట, వావివరుసలు నీతి నియమాలు దైవనిర్ణయాలుగాక మనుష్యులేర్పరచుకొన్నవనే మాటవరకుగల సాంఘిక సమస్యలనుగూర్చి అతడి వివేచనం వీరెవ్వరిలోనూ లేదు.

జ్ఞానదేవ చైతన్యులు తత్త్వవ్యాఖ్యాతలు, తత్త్వశాఖా సంప్రదాయ ప్రవర్తకులు గావచ్చును. సహజశూన్యతవరకు కబీరు చేరుకోవచ్చు. తక్కుంగల వారెందరో అతని శూనీ సహజనుచ్చరింపవచ్చు. కానీ వేమన ఎరుకకెక్కినన్ని, సాధనచేసినన్ని తత్త్వ సిద్ధాంతాలు శిక్షణలు వారెవ్వరు ఎరుగరని మాత్రం విన్నవించవలసియుంది. కబీరిందులో విగ్రహాల్ని విసరివేయించి రామ నామజపమొకదాన్ని విధించి, తనరాముడు అయోధ్యారాముడు, రాజారాముడు, నరరూపరాముడు కానేకాడనీ – ఆత్మారాముడనీ, సహజశూన్యతకు కేవలం సంకేతమాత్రుడనీ మతాలవారి బాహ్యాచారమైన నామరూప సంకేత శకలాల్ని పట్టుకొని వ్రేలాడుచుండగా, వ్యవస్థాగతమైన మతంతో నిమిత్తంలేని అధ్యాత్మికతను మతాల బాహ్య సంజ్ఞావశేష నిశ్శేషంగా చెప్పి పరిణతుడైన తార్కికావధి వేమన.

ఇంత వేమనను యోచనాపరుడు [Thinker] అనటానికి వెనుకాడవలసిందేముంది? కాని ఒకందుకు ఉండవచ్చునేమో. నవీనార్థంలోయోచనాపరుడు

కార్యశీలి కాకపోయినచేత, అట్టిదోషం అంటుకోకూడదనే జాగరూకతచేత వేను కాడటమేగానీ, యోచనాపరుడతడు కాకపోయినప్పుడు మరెవ్వరు కాగలరు? వేమన ఆర్థిక పునర్వ్యవస్థీకరణ మొదలు తత్త్వసారమ్యంవరకు చింతనతోపాటు ఆచరణ శీలి.

ఇక అతన్ని ఒక ప్రవక్త అంటామా? ప్రవక్తఅనేవాడు ఉన్నపరిస్థితితో తృప్తిపడక, లోపమని తానసుకొన్నదానిని దిద్దటానికొక పరిష్కారాన్ని చెప్పి, దాని సాధనకై ప్రచారం ప్రయత్నం చేయునన్నంతవరకు వేమన ప్రవక్తయే. కానీ తన పరిష్కారమేపరిష్కారం, మరొకమాట లేదనే నిర్ధారణాబుద్ధి, అసహనం ప్రవక్తల సొత్తుగా ఉంది. వారు పరిమిత విచారకులు విచారాన్ని కట్టిపెట్టి కార్యరంగంలో దిగినవారు దిగిన పిమ్మట వారిదిక మూసిన మనస్సు. ఇకనది తెరచుకోదు. వేమనదట్టి మూసిన మనస్సుగాదు. అందుకే అతనియం దింత పరిణామ వికాసాలున్నాయి. ప్రయోగమాతని ఊపిరి. మతరాహిత్యం ఒక విధంగా అతనిలో పిడివాద రాహిత్యం. 'నమ్మినమ్మకుండ నయమెల్ల కద్దురా?' అన్నదతనిమాట.

తాత్త్వికునిగా [Philosopher] మాత్రం జెప్పుకొన్నచో భారతీయ తాత్త్వికునకున్న కీర్తినిబట్టి కేవలం దాన్ని అన్వేషిస్తూ ఇహాన్నీ అలక్ష్యం చేసినవానిగా లోకజీవనరీతుల చింతలేనివానిగా జెప్పినట్టు కాకపోతే ప్రాపంచిక జీవితాన్ని మార్చుటే తాత్త్వికుని సమస్యయని తెలిసిన తాత్త్వికుడనవలసి వుంది.

సాంఘిక జీవనంలో ఐహికతత్త్వాన్ని [Secularist] పూర్వ భారతంలో తొట్టతొలుతను తుట్టతుదను జెప్పిన ఏకైకమహాపురుషునిగా చూపుదామంటే భౌతికవాదిని గావించినట్టు అపార్థం రాకుంటే, ఐహికతత్త్వాన్నీ జెప్పుటకు ఆధ్యాత్మికత అడ్డుగాకపోయినచో (కాదు-పశ్చిమ దేశాల్లోకాలేదు; అమెరికా సెక్యులర్ రాజ్యాంగమే ఆధ్యాత్మికులిచ్చింది. కడపటికి మన మహాత్మంగాంధీయే రాజ్య వ్యవహారంలో రాజకీయంలోమతం వద్దన్నాడు. మతం వ్యక్తిగతం అన్నాడు. * వేమన అట్టివానిగా చెప్పటానికి సంకోచంలేదు.

కవిగా అతనికీర్తికేతనం ఎగురవేద్దామంటే కవిత కేవలం అలౌకికానందానుభవ నిషానేదో సమకూర్చునదని కాకుండా, తేజస్వంతం చేతనామయం ఐన విశిష్టానందంతో ఆలోచనామృతం అవుతుందంటేనే అతన్ని కవిశబ్దవాచ్యుని గావింపవచ్చు.

---

* ఐహికతత్త్వము-గాంధీజీ దృక్పథం రచయిత రేడియో ప్రసంగము (20-1-1970)

అతడిక తిరుగుబాటుదారని [Rebel] తీర్మానిద్దాం. అన్నబో వున్న వ్యవస్థపై ఎంతో అతడు నిజంగా విరుచుకు పడినా అక్షరాల తిరుగుబాటే చేసినా ప్రత్యామ్నాయ ప్రతిపాదనం లేనివాడనే అర్థం అనర్థం అంటుకొంటుం దనే శంకచేత కాదనవలసియుంటుంది.

అతడు సంస్కర్తా-విప్లవ కర్తా అంటే విప్లవ కర్తఅనే అసందిగ్ధంగా చెప్పవలసియుంది. కానీ మరో ప్రపంచ రూపకికల్పన [UTOPIA] జేసినవాడు కాదు. మరో ప్రపంచ రూపకల్పన భారతీయ సంస్కృతిలోనేలేదు. స్వర్గ రాజ్యం బంగారుకాలం భారతదేశంలో గతమందేగాని భవిష్య విషయంకాదు. యూరపులో ప్లేటో మొదలు మార్క్సువరకు మరో ప్రపంచ రూప శిల్పకులే. అట్టిస్వాప్నికుడు కాకుండా జీవిత యధార్థాన్ని వ్యక్తులు, సంఘం ఎలా నిరం తరం మలచవలెనో చెప్పినవాడు

నాస్తికుడని చెపుదామంటే భౌతికవాది అని అనుకొంటారనిగాని వేద ప్రామాణ్యం అంగీకరించనివాడు (నాస్తికోవేద నిందకః) త్రిమూర్తులవంటి ఈశ్వరతత్త్వాన్ని కాదన్నవాడు, శంకరాదుల చైతన్య స్వరూపమైన బ్రహ్మాన్ని దాటినవాడు అవటంచేత భారతీయసంప్రధాయంలో అందుకు అభ్యంతరంలేదు.

హేతువాది [Rationalist] అని చెపితే మార్మికానుభవాన్ని తిరస్కరించి నట్లు కాకపోతే, భౌతి కవాదులు కానివారు, ఆధ్యాత్మికులైనవారుకూడా ప్రశస్తమైన ప్రచండమైన హేతువాదులు కాగలరని ఒప్పుకొంటే అతడు నిస్సం కోచంగా హేతువాది. అట్టి అవకాశానికితడొక ప్రబలోదాహరణం.

మానవతావాదియని నిర్వచించదలిస్తే దానికున్న అతి నవీనార్థానికున్న అన్ని కోణాలూకూడ అతనియందున్నవ్న తిరుగులేకుండా చెప్పుకోవచ్చు.

ఆయా అపార్థాలు కలగకుండా ఆయాపేర్లన్నీ అన్వయించే మహాపురుషు డతడు. నార్లవారన్నట్లు అతనిది నిజమైన అరుదైన ప్రజ్ఞ [TRUE AND RARE GENIUS] అసలిన్ని కోణాలుగల ప్రజ్ఞమరెక్కడాలేదేమో! లేకపోతే అదొక పోలికలేని ప్రజ్ఞ.

వేమననుగూర్చి పాశ్చాత్యుల రచనలన్నింటినీ శ్రమపడి సేకరించి వెలుగు లోకి దెచ్చిన నార్లవారు బయటి ప్రపంచానికి చూపి, చెప్పదగిన పూర్వకవి తెలుగువారిలో ఒకే ఒక్కడున్నాడు – అతడు వేమన [There is, I believe, only one old Telugu poet who could and should be presented to the wider world nda he is Vemana] అని అన్నమాట తిరుగులేనిమాట. వేమన తెలుగువారి విశ్వకవి. భారతీయుల విశ్వకవి.

— : సమాప్తము : —

# విశ్వదాభిరామ విశ్వరూపం

అపండితుడుగా కానవచ్చిన వేమన తన ఆట వెలదికి తలకట్టుగా కూర్చిన మకుటానికి అర్థనిర్ణయం మనపండిత షరాబులకు వల్లదప్పిన విషయమై వుండి పోయింది. ఎందరో ప్రయత్నించారు; పాండిత్యమంతా వెచ్చించి చాలా అర్థాలు తీశారు. ఏ సంస్కృతాంధ్రలాక్షణిక మహాకవి పద్యపంక్తికీ చెప్పనన్ని అర్థాలు ప్రయాసపడి సాధించి యిచ్చారు.

'విశ్వదాభిరామ వినురవేమ' అన్నదే మకుటంగా తీసుకొని చెప్పిన ఆ అర్థాలు లెక్కకిప్పటికి అష్టాదశ సంఖ్యను దాటిపోయినవి. యీ మకుటానికి పాఠ భేదాలు మరో అయిదున్నాయి:

'విశ్వతాభిరామ వినురవేమ' -'విశ్వతోభిఽరామ వినురవేమ'— 'విశ్వ థాభిరామ వినురవేమ' - విశ్వధాభిరామ వినురవేమ 'విశ్వదాభిరామ వివరి వేమ' అంటూ కొన్ని వ్రాతప్రతుల్లో -చిన్న ప్రతుల్లో- కనిపించుతున్నాయి. ఇందులో 'విశ్యతాభిరామ వినురవేమ' అన్నది విశ్వదాభిరామ కన్నకూడా బాగున్నదని గ్రహించి అర్థం చెప్పినవారున్నారు. రాళ్ళపల్లివారు. కాని తక్కిన నాలుగూ అర్థవంతాలని, వ్యాకరణ శుద్ధాలనీ వారెవ్వరూ భావించలేదను కొంటాను. వాని కేమైన అర్థగతి కలిగించవచ్చు నను కొంటే మాత్రం అర్థం చెప్పకుండా వదిలేవారు కారనుకొంటాను. అర్థవైచిత్రిని సాధించటం మన పండితులకొక వినోదంగదా; వినోదమయితేనేమి? మనంకూడా వినో దించుదాం. వాటికీ అర్థం రాబట్టుదాం-ఆ చోద్యమూ చూద్దాంమరి.

మున్ముందుగా 'విశ్వదాభిరామ వినురవేమ'కు చెప్పిన అర్థజాలాన్ని వేడుకగా చూడవచ్చు.

1) Listen O Vema! Dear to the Lord of all.
సర్వేశ్వరునకిష్టుడైనవాడా! వేమా! వినుము. [సి. పి. బ్రౌన్]

2) O Vemana! the beloved of the gods.
దేవానాం ప్రియుడా! వేమా! విను.
దేవతలకు ఇష్టుడైనవాడా! వేమా! విను. [పిశుపాటి కృష్ణమూర్తి]

3) విశ్వమునిచ్చు భగవంతునికి యిష్టుడైనవాడా! వేమా! వినుము.
[వంగూరి సుబ్బారావు]

4) విశ్వమును సంహరించునట్టి, అనగా, విశ్వలయకారుడైనట్టి శివునికి ప్రీతిపాత్రుడా! వేమా! వినుము. [పానుగంటివారు]

5) విశ్వమును అనగా అందరను ద అనగా ఖండించినవాడు, అనగా విమర్శించినవాడై అందరికీ వడ్డించుటచే ప్రీతిగూర్చువాడా! వేమా! వినుము. [రాళ్ళపల్లివారు[

6) విశ్వమును అనగా సమస్తమును, అనగా, అన్నిటికంటే గొప్పదైన జ్ఞానమునిచ్చుటచేత ఇష్టుడైనవాడా! వేమా! వినుము.
[మహా మహోపాధ్యాయ, అచంట సాంఖ్యాయనశర్మ]

7) విశ్వమును అనగా ప్రపంచమును త్యజించుటచేత ఇష్టుడైనవాడు! సన్యసించుటచేత ఇష్టుడైనవాడా! వేమా! వినుము.

8) విశ్వమును సమస్తమును ఇచ్చి వేయుటచేత ఇష్టుడైనవాడా! వేమా విను. [విమర్శకాగ్రేసర, బండారు తమ్మయ్య]

9) విశ్వదుడనగా బ్రహ్మ - అతనికి ఇష్టుడైనవాడా! అనగా బ్రాహ్మణుడా!వేమా! వినుము. [టేకుమళ్ళ కామేశ్వరరావు]

10) విశ్వదయను వేశ్యయందు ఇష్టుడైనవాడా! వేమా! వినుము.
[పురాణపండ మల్లయ్యశాస్త్రి]

11) విశ్వదుడు విశ్వకర్మ అయిన అభిరామయ్యా! వేమా! వినుము.

12) విశ్వదుడు అనగా సర్వస్వమును ఇచ్చివేసిన, త్యాగముచేసిన అభిరామయ్యా! వేమా! వినుము.

13) విశ్వదుడు అనగా సర్వస్వమును త్యాగముజేసిన అభిరామయ్యా! వేమనను వినుము. [డా॥ సి. వి. రామచంద్రరావు]

14) వేశ్య అయిన విశ్వదా! విశ్వకర్మకులజుడైన అభిరామయ్యా! వేమా! వినుము.

15) Hark O Vema! Delighter of the world!
విశ్వాభిరాముడైన వేమా వినుము. [నార్లవారు - 1967]

16) విశ్వదునకు విశ్వకర్మకు యిష్టుడైనవాడా! అనగా విశ్వబ్రాహ్మణుడా! వేమా! వినుము.

17) విశ్వదునియందు అనగా విశ్వబ్రాహ్మణులందు ప్రీతిగలవాడా! వేమా! వినుము.

18) విశ్వదులకు విశ్వబ్రాహ్మణులకు యిష్టుడైనవాడా! వేమా! వినుము.
ఇక పాఠభేదాలకు చెప్పకోగలిగిన అర్థాలు:

19) విశ్వద అనే సమస్తపదం సంస్కృత మహాభారతంలోవున్న శివసహస్రనామావళిని చవుదుతున్నప్పుడు వేమనకు స్ఫురించిందట.

సర్వకాల ప్రసాదశ్చ సుబలోబలరూపభృత్

సర్వకామ వరదైశ్చ సర్వదస్సర్వతోముఖం! అనే నామావళిపంక్తులలో సర్వదః అనేపదం శివపర్యాయంగా ప్రయుక్తమై యుండటం గమనించి తన కవితకు మకుటంకోసం వెదకులాడుతున్న వేమన్న వెంటనే "సర్వదాభిరామ చదువువేమ"యని కూర్చుకొన్నాడని, ఆ తర్వాత తానాశుకవినని జ్ఞాపకంవచ్చి "విశ్వదాభిరామ వినురవేమ"యని మార్చుకొని స్థిరపరచుకొన్నాడని కొత్తగా ఒక కట్టుకథ కూర్చారు. [ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి]

అర్థము పానుగంటి వారిచ్చిన యర్థము కాకుండా, సమస్తమును ఇచ్చిన వాడు శివుడని మహాభారతవాణి రూఢి అర్థంచేసిందని చెప్పారు.అయితే అభిరామ శబ్దాన్ని అరామశబ్ద పర్యాయమని, తిక్కనగారి శివారామతను విశ్వదాభి రామతగా అనగలిపి వున్నారు.

ఈ అనగలుపు వేమన నాథమతస్థుడనటానికి నిరూపణ! ఈ నాథమతార్థ వ్యాయామంసంగతి కొర్లపాటి వేమనాథీయం అనే వ్యాసంలో సవివరంగా చూడవచ్చు.

20) విశ్వతాభిరామ అనగా సమస్తమును తానే అనుభావమువలన బుద్ధివలన ప్రీతిపాత్రుడా! వేమా! వినుము. [రాళ్ళపల్లివారు - 1917]

21) విశ్వథాభిరామా అనగా విశ్వకళ్యాణమందు యిష్టుడైనవాడా!వేమా! వినుము.

22) విశ్వధాభిరామా అయితే అన్నివిధములచేతను ప్రీతిపాత్రుడైనవాడా! వేమా! వినుము.

23) విశ్వతోఽభిరామ అనగా సమస్తత్వముచేత, లేక ప్రపంచ స్వభావ మునందు ప్రీతిపాత్రుడైనవాడా! వేమా! వినుము.

24) విశ్వతాభిరామ! వివరి! వేమా! విశ్వతాబుద్ధిచేత యిష్టుడైనవాడా! జ్ఞానీ వేమా! [తెలుగులో వివరి అనగా జ్ఞాని]

ఇందులో విశ్వతాభిరామ బాగున్నదని మెచ్చుకొని నచ్చినదని మొదట 1917లో జెప్పి తుదకు 1918లో రాళ్ళపల్లి వదులుకొన్నామన్నారు.

ఇంత చిన్న పంక్తికి ఇన్నిన్ని అర్థాలు, పెద్ద పెద్దఅర్థాలు విన్యసించిన వేమనం ఏ భాషలోనైనా వున్నదా అన్నప్రశ్న తప్పక కలగవలసినప్రశ్న. ఉందో లేదో నాకుమట్టుకు తెలియదు. నాకుతెలిసిందల్లా ఒక్కటే - 'తత్త్వమసి' అన్న మహావాక్యానికైనా ఇన్ని అర్థాలు వినిపించలేదు.

ఇలా అష్టాదశార్థాలు చెప్పకోగలిగినప్పటికీ, ఇందులో ఏ వొక్కటీ వేమన జీవిత దశలన్నింటనూ వర్తించేఅర్థం, చెల్లేఅర్థం కాకపోతున్నది. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారన్నట్టు "వేమన స్వచ్ఛందచారిగను, సంసారిగను ఉన్నప్పుడు వ్రాసినవని ఊహింపవలసిన అనేక పద్యములున్నవి." అప్పుడుకూడ ఇదే మకుటంతో వ్రాశాడు. "సానిదానిపొందు సౌభాగ్యభాగ్యంబు....కూడునీళ్ళు బాసి గుళ్ళపంచలబడునట్టువ్రాసె బ్రహ్మయతులనొసట, తోయజాక్షి జేర దోషం బుగలదొకో," "తుంటవింటివాని తూపుల ఘాతకు, మింటిమంటినడుమ మిడుక దరమె, ఇంటియాలి విడిచి ఎట్లుండవచ్చురా విశ్వ..........."యన్నటువంటివి అనేకం వున్నాయి. ఇంకా బూతులున్నాయి, బ్రౌన్ 150 బూతుపద్యాలను ల్యాటిన్ చేసి దాచి వుంచాడు.

అట్టిదశలో దేవునికి ప్రీతిపాత్రుడైనవాడని,సర్వం ఇచ్చినవాడని, త్యజించినవాడని, దాతయని, బ్రహ్మకు ఇష్టుడు బ్రాహ్మణుడని అంటేను అందరిని విమర్శించినవాడని, సర్వంతానైవున్నానన్న భావంగలవాడని - అన్నివిధాలా ప్రీతిపాత్రుడని- వివరియని మనం మన అర్థాలు చేసి చెప్పడం అసందర్భం గాదా! అవి నిజమైన అర్థాలు ఎలాగవుతాయి!

అందుచేతనే "సహజమైనయర్థము దీనికిదివరకు లభింపలేదు. ఇక ముందు లభించునను యాశయును నాకులేదు. దీనికర్థమే లేదనుకొని యింతటితో నూ ర కుం డు ట మే లు – తం దా న తా న" వంటి వూతపదము అని 1928లో రా ళ్ళ ప ల్లి వా రు తేల్చి చె ప్పా రు. వారు చెప్పినప్పటికింకా ఇన్ని అర్థాలులేవు. అన్నీ అప్పటికి ఏడు కాబోలు ఉన్నవి. కాని వారుచెప్పినట్లు ఊరుకోలేక, వారి ఆక్షేపణను మనసులో బెట్టుకొనక మన పండితులిన్ని అర్థాలు తయారుచేశారు. అవన్నీ రాళ్ళపల్లిప్రశ్నకు ఆహారమైపోతున్నాయి! అందులో కొన్నితప్పులు. అర్థాలే తప్పులు. కొన్ని ఏకవచన క్రియావాచకము వినురవేమ ఉన్నదనే స్ఫురణ లేకుండ తననూ వేశ్యనూ - తననూ అభిరామయ్యనూ- తననూవారిద్దరిని - సంబోధించుకొంటూ చెప్పినట్లు అర్థాలు చెప్పారు.తననూ ఇతరులనూ పేరుపెట్టిపిలిచి 'వినరా' అని అంటారా? "వినుడు" "వినుము" వంటి బహువచన క్రియారూపాలు వాడుతారు గదా అనైనా ఆలోచించకుండా అర్థనిర్ణయం చేశారు. అభిరామయ్యా వేమన్నను వినరా అనికూడా

అర్థంచెప్పారు. అప్పడు 'విశ్వదాభిరామ వినురవేము' అనాలిగాని 'వినురవేమ' అని అనరాదనీ, అనేవాడుకాడని గమనించడం లేదు. 'వినుర' అనే ఏకవచన క్రియారూపం ఆత్మసంబోధననేగాని తనతోకలిపి అన్యసంబోధనను అనుమతించదుగదా! అనగా విశ్వద అనే వేశ్యనూ, అభిరామయ్యఅనే నగరువిశ్వబ్రాహ్మణుణ్ణి చొప్పించడానికి అనుమతించదు.

"విశ్వతాభిరామ వివరివేమ" అన్నపాఠంలో అసలు క్రియలేదు. కాని అక్కడ 'విశ్వదాభిరామ' కాకపోయింది. దానితో ఇక్కడకూడ'అభిరామ' శబ్దం నామవాచకమేకాకుండా పోతున్నది. దీనివల్ల అభిరామయ్యకు క్రియావాచక బాధలేనప్పుడుకూడ చోటులేకుండాపోతున్నది.

'విశ్వదాభిరామ వినుతవేమ' అని-"విశ్వదాభిరామ వివరివేమ" అని గనక వున్నట్లయితేనో, 'విశ్వదాభిరాము వినురవేమ' లేక 'విశ్వదాభిరామ వినురవేము'ణ్ణి అనిగాని వున్నట్లయితేనో అవిరామయ్యకు అవకాశం వుంటుంది. కాని అటువంటిపాఠాలు లేవుగదా! ఉన్నప్పటికీ మొదటిబాధ వుండనేవుంటుంది. కట్టుకథ ప్రకారంకూడావేశ్యాసాంగత్యం వదిలేసినతర్వాతే, వైరాగ్యం ఏర్పడిన తరువాతనే వేమనకు నగరుకంసాలి అభిరామయ్య తటస్థపడ్డాడు. అందుచేత, వైరాగ్యములోకూడా వేమన వేశ్యను ఇంద్రియలోలత్వాన్ని మరవలేదనవలసి వుంటుంది. ఇది అసంగతం.

ఈ అష్టాదశార్థాలు ఇలా పనికిరాకుండా పోగా, రాళ్ళపల్లి వారన్నట్టు దీనికి అర్థమేలేదని ఊరుకోవడమేనా? ఇంకేమైన దారివుందా అంటే వుందనుకొన్నాను. అయితే దానికిదారి నిఘంటువులదారికాదు-తత్త్వసిద్ధాంతాల దారేదారి –అని, విశ్వాన్ని, విశ్వదృశ్యాన్ని వివరించిన దారేదారి అని భావించాను.

తత్వ సిద్ధాంతాలనగానే కంగారుపడనక్కరలేదు.గహనమైన చర్చచెయ్యకుండానే, ఈ దేశంలో సర్వ సామాన్యంగా తెలిసినపాటి కొద్దిపాటి తత్వంతోనే సరిపెట్టుకొని వేమనమకుటానికి సహజమైన- సులభమైన- ఇంద్రియలోలత, ఇంద్రియజయము కల రెండు దశలకు కూడా వర్తించే - అర్థం,

అర్థాలు చెప్పుకోవచ్చు. గాఢమైన గహనమైన సూక్ష్మమైన చర్చజేసి ఇంకా లోలోతులంటే అర్థాలుసైతం సుసంగతంగా చెప్పుకోవచ్చును.

సులభసులభంగా చెప్పుకోచూద్దాం. మనస్సు, మాయ, అవిద్య, ప్రకృతి అన్నమాటలు తత్వవిషయంగా ప్రాథమికమైన సంగతులుగదా. ఈనాలుగూ విశ్వరచనకు కారణాలేమరి! మనసు గారడీయే విశ్వదృశ్యం అంటారుగదా వేదాంతులు. అంతే. ఈనాలుగింటినీ విశ్వదాలుగా చెప్పుకోవచ్చు. ఇంక కొంచెందూరం వెళ్ళితే, విశ్వం విశ్వదృశ్యం పంచేంద్రియాలకల్పనగా, శబ్దస్ప ర్శరూపరసగంధాలనే పంచతన్మాత్రల పరిణామశిల్పంగా, భూమ్యాకాశాగ్ని వాయుర్జలాలు అనే పంచభూతాల లీలగా చెప్పుకోవడం భారతదేశంలో బహు సామాన్యమైన విషయం. పంచేంద్రియాలు, పంచభూతాలు, పంచతన్మాత్రలు అన్నవి కూడావిశ్వదాలే ఇలా విశ్వదాలు ఏడుగా తేలుతున్నాయి.

* ఇక అభిరామ శబ్దవిషయం. ఇదేదో గూఢమైన మారుమూల శబ్దంకాదు పట్టాభిరామ, మునిజనమనోభిరామ, నయనాభిరామ, లోకాభిరామ వంటి సమాసాల ద్వారా రామకథలో రామభక్తిలో అందరూ ఎప్పుడూ వింటుండే శబ్దమే. క్రీడాభిరామం ప్రేమాభిరామం, రసికజనమనోభిరామం వంటి కావ్య నామాలు బాగా ప్రచారసులభాలు. విశ్వదాభిరామలో అభిరామ శబ్దం కష్టమైన శబ్దంకాదు-విశ్వం కష్టమైన మాటకాదు. 'ద'అన్నదికూడా కష్టమైనమాటకాదు. కాని విశ్వద అన్నది సమస్తపదమై అసలు కష్టమయినదని, అందులోనూ విశ్వం అన్న శబ్దమొకటే అతని మకుటంలోని కంతటికీ అసలు క్లిష్టగ్రంధి తత్వసంధి అని వేమన స్వయంగా చెప్పుకొని వున్నాడు, అతడు విశ్వం ఎలా ఏర్పడుతుందో చెప్పుకోవలసివచ్చిందిగాని అభిరామ శబ్దవిషయం చెప్పుకోవల సిరాలేదు. నిజానికి విశ్వద అన్న చిన్నిసమాసంలోకూడా అర్థకాఠిన్యం ఏమీలేదు. విశ్వశిల్పానికి భగవంతునికన్నా వేరే దిగువనగల కారణాలకై

---

* అభిరామయ్య అనే పేరింతవరకు ఎక్కడాలేదు, సహజమైనది కాదు అన్నారు. కాని అభిరామయ్య, అభిరామాంబిక అనేపేర్లు చరిత్రలో శాసనాల్లో వున్నాయి. ఐనా, వేమన మకుటంలో అభిరామయ్యకు స్థానం దొరకదు.

ఇతరమైన కారణాలకై తత్త్వవిజ్ఞానపు ప్రాథమిక పాఠాలవేపుకు దృష్టిని మళ్ళించకపోవడముతోనే కష్టమంతా వచ్చిపడింది. ఇక యీ విశ్వదములందు అభిరాముడు, అభిరాముడు అనడంచేత విశ్వదాభిరామ అంటే యీ ఏడింటి చేత ఏర్పడే అర్థాలు ; ఇవిగో

1. మనోభిరామా (మనోరంజన్ : చిత్తరంజన్)
2. మాయావినోదీ!
3. అవిద్యారతుడా!
4. ప్రకృతి మోహితుడా!
5. ఇంద్రియాభిరతుడా ! (ఇంద్రియా రామా !)
6. పంచభూతారాధకుడా !
7. పంచతన్మాత్రానుమోదీ !

ఇవన్నీ ఇంద్రియవశుడై సానివాడలో ఉన్నప్పుడూ సంసారిగా ఉన్నప్పుడూ, ఇదే మకుటంతో ఇవే అర్థాలతో దాపరికం లేకుండా తన స్థితిని తాను చాటి చెప్పుకుంటూ బూతు పద్యాలను సైతం బాహాటంగా చెప్పి ఉన్నాడు. అది అతని భోగపరత్వ దశను నిరూపించేదిగా వుండిపోతుంది.

ఆ తర్వాత ఇంద్రియాలను నిగ్రహించుకొని, సంసారాన్ని దిగవిడిచి, యోగియై జ్ఞానియై నీతినీ, లోకరీతినీ, తత్వాన్నీ, సత్యాన్నీ, యోగానుభవాన్నీ-యోగిమానుల మోసాన్నీ – ఒక్కమాటలో జ్ఞాన విజ్ఞానాలను లోకానికి ఉపదేశించడం కొరకు ఇంకా తాను మనోగత ప్రాణిగానే, ఇంద్రియోపస్థితుడుగానే ప్రకృతి వశుడుగానే, మాయా ప్రశ్రితుడుగానే అవిద్యాభిరతుడుగానే పంచభూత మితుడుగానే పంచతన్మాత్రాదృతుడుగానే ఇంకా ఎక్కడో అంతరాంతరాల్లో మిగిలి ఉన్నందుకు తన్ను తాను మందలించుకుంటూ, బుద్ధి గరపుకొంటున్నట్టుగా జీవితాంతమూ అవే అక్షరాలు అవేర్థాలుగల మకుటంతోనే ఆత్మ సంబోధనాత్మకంగా లోకోపదేశము చేశాడని చెప్పుకొంటే సరిపోతున్నది. వేమన జీవిత సర్వ దశలతోనూ సందర్భించుతూ సహజమైన అర్థంగలదౌతున్నది అని నాకు తోచింది.

నాకు తోచడమేకాదు. వేమన యీ అర్థాలు కొన్నింటిని స్వయంగా చెప్పు కొనటం కనిపించింది. మన పండిత ప్రకాండులవంటివారే వేమనది కాపుకవిత్వం అని యీసడిస్తూ మకుటం అర్థరహితం అన్నారు—దానితో అనుచరులు తికమక పడ్డారు. అడిగారు. అతడు అర్థవివరణం చేశాడు. అదంతా అచ్చులోనేవుంది. తాటాకులు వెదకనక్కరలేదు-చదివిన చదువు నర్థంచేసుకోవాలి, చదువుకొక తీరుండాలి. అంతే. ఇక ఇదిగో వేమనను వినండి.

విశ్వమనగనేమొ వివరించి చూడుడీ
విశ్వమైదుచేత వెలయుచుండు
విశ్వము మదిలోన వెదకి వీక్షింపుడీ, విశ్వ.........

పంచభూతములును పరగ నింద్రియములు
సంచరించినప్డె జగతి గలుగు
సంచరింపకున్న జగమెట్లు కలుగురా విశ్వ.........

విశ్వము అయిదుచేత వెలయుననగా పంచభూతములచేత పంచేంద్రియములచేత వెలయుచుండునని రెండో పద్యంద్వారా వివరణ యిస్తున్నాడు. ఇంకా విశ్వాన్ని మదిలో—మనస్సులో వెదకి చూచుకోమన్నాడు అనగా, పంచభూతాలు, పంచేంద్రియాలు మనస్సు అన్నవే విశ్వదములు అని వేమన ఉద్దేశమని స్పష్ట పడుతున్నదిగదా! వేమన పద్యాలలో తమ సొంత పద్యాలు కొన్ని చేర్చిన కొందరి ప్రక్షేపకులకు వేమనగారి యీ అర్థాలు తెలుసు. కుంటినడకతో వున్నగీతపద్యాలు ఒకటిరెండు ఈ అర్థంతోనే వేమన పద్య సంకలనాలలో ఉన్నాయి తర్వాత తర్వాత వేమన అనుచరులుకూడా ఆ అసలర్థం మరచిపోయారు.

గాఢమైన తత్వచర్చ చెయ్యకుండానే ఒకమాట చెప్పవచ్చు ఒక్క విశ్వదాభిరామ అన్నపదమే వేమన తత్వార్థమని, తత్వసర్వస్వం అని తార్కాణిస్తుందనవచు. ఆ చిన్న పదమే యివే అర్థాలతో భౌతికవాదంవద్ద మొదలుపెట్టి అవిద్య మాయమనస్సుతో తన్మాత్రలతో శంకరాద్వైతం అందులో భేదాలైన సురేశ్వరుల వార్తికాన్ని పురస్కరించుకొన్న అసామాన్యబోధ, దత్తాత్రేయ

తత్వం, ప్రకాశానందుని దృష్టి సృష్టివాదం, వేదాంత బౌద్ధాల మధ్య మెరిసి పోతుండే యోగవాశిష్ట తత్వం బౌద్ధంలోని విజ్ఞానవాదం, శూన్యవాదం, అద్వైతుల పరబ్రహ్మన్ని అపరిపూర్ణమన్న అచలపరిపూర్ణతత్వం వరకు అతనిలోని తాత్విక పరిణామ దశలన్నింటికి యీ మకుటం సరిపడిన అర్ధచ్ఛాయనిస్తుందని దిఙ్మాత్రంగా సూచించడం చాలుననుకుంటాను. లోతుగా విషయం తెలుసుకొన గోరినవారు నా పుస్తకం చూడవచ్చు.

"కామిగాక మోక్షగామికాడు" అని వేమన అన్నందుకు ఆ ఉభయ దశలకూ సరిపడే అర్థాలు యిచ్చే మకుటం కుదరడం ఒక మహాద్భుతం. "పుస్తక జ్ఞానమితనికి ఇంచుమించు సున్న" అన్న రామలింగారెడ్డిగారి మాటలో నడిచిన మన పండితుల పాలిటికీ మకుటం ఒక గేలిసేత.

ఇవేకాక అతని జీవితంలో మరికొన్ని విశేష దశలున్నై. ఆ దశలకు మరికొన్ని అర్థాలను యింకా చెప్పుకోవచ్చునని విన్నవించవలసి వుంది. విశ్వదము అన్నపదం ఒకగని; ప్రపంచాన్నీ-మించి మరి సమస్తాన్నీ-మనకు కావలసిన సమస్తాన్నీ యిచ్చేదై ఎన్ని అర్థాలనైనా యిస్తుంది.

పండితుల పరిశ్రమించి పైకితీసిన ఇన్ని అర్థాలు వ్యర్థమైపోనక్కరలేదు. అందులో వాక్య నిర్మాణం అనుమతించని అర్థాలు, శబ్దాలకు సంబంధంలేని అర్థాలుపోగా–అవి అర్థాలే గావుగదా–తక్కిన అర్థాలను ఎందుకు వదులుకోవాలి? వాడుకొందాం. ఔచిత్యాన్నిబట్టి అందాన్ని పెంచుకొంటూ వాడుకొందాం. రాళ్ళపల్లివారి ఆక్షేపణను గడచిగట్టెక్కి బ్రతికే కొత్త అర్థాలు, ఇందులో చూపిన అర్థాలు సార్వజనీనము సర్వసాధారణము అయిన అర్థాలై అన్ని పద్యాలకు, చెల్లేవిగా గ్రహిస్తూ, అయితే కొన్ని పద్యాల సందర్భంగా, ప్రత్యేకించి అందలి భావాలకు అందిపొందే అదనపు అర్థాలుగా, విశేషార్థాలుగా అక్కడక్కడికి అప్పటప్పటికి వాడుకొంటూ వేమన పద్యాలను అధికాధికంగా ఆస్వాద్యం చేసుకొందాం.

ఇప్పటికింతచాలు. ఇప్పటికే విశ్వదాభిరామ విశ్వరూప సందర్శన

యోగం విశ్వాభిరామంగా ఆవిష్కృతమయిందనుకొంటాను. ఇక్కడ చెప్ప కుండా మిగిల్చిన అందాలు, విశేషాలు మరొకసారి చెప్పుకొందాం.

ఈ పునర్ముద్రణను ముగించేముందు మరొక ముద్దయిన అర్థాన్ని ఇవ్వడం బాగుంటుందనుకుంటాను.

విశ్వశబ్దాన్ని సర్వ శబ్ద సమానార్థకంగా తీసుకొని విశ్వదాభి రాముణ్ణి సర్వదాభిరాముణ్ణిగా గ్రహించి, ఆ సమస్త పదాన్ని కాస్తా సర్వదా మఃఅభిరామ (విశ్వదామఅభిరమ)గా విడగొట్టుకొని వేమన్నను ఎల్లప్పటికీ ప్రీతిపాత్రుడుగా, ప్రియంకరుడుగా, రంజకుడుగా వుండేవాడా! వేమన్నా! వినురాయని ఎప్పటికీ ప్రీతిపాత్రుడుగా వుండిపోయేవాడని వేమన్నను చెప్పు కొందాం.

— : o : —

# విశ్వదాభిరాముని ఆర్థిక సిద్ధాంతం

వేమనను సంఘ సంస్కర్తగా గ్రహించామేగాని ఆర్థిక సంస్కర్తగా గ్రహించలేదు. అచల సంప్రదాయం కుల నిర్మూలనాన్ని చెప్పుతున్నదే కాని, వేమనగారి ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వాదాన్ని చెప్పడంలేదు. మాలపల్లి నవలా కర్త ఉన్నవవారుకూడా వేమనను కుల ధ్వంసకుణ్ణిగానే చిత్రించారు గాని ఆర్థిక ప్రవక్తగా చెప్పలేదు. ఆ తర్వాత ఎవ్వరూ అతనిలో ఆర్థిక కోణాన్ని పట్టించుకోలేదు. ఇటీవల ఒకరిద్దరు ఒండు రెండు పద్యాలలో అతడు ఆర్థిక విషయాలను గూర్చి సంస్కరణ భావాలను వ్యక్తపరుస్తున్నట్లు గుర్తించి వ్యాఖ్యచేశారు. అంతేగాని వేమన సంఘంలో సమూలమైన ఆర్థిక పునర్వ్యవస్థీకరణను కోరినాడని అతడొకానొక ఆర్థిక సిద్ధాంత ప్రవక్త అనీ సూత్రీకరించలేకపోయారు. అలాగని ఆనవాలే పట్టలేకపోయారు.

ఆర్థిక విప్లవం ఆర్థిక విప్లవం అని అహరహం కలవరించే సామ్యవాద, సామాజికవాదాల వారున్నారు. వాళ్ళు గురజాడ వీరేశలింగాలను గాలించినట్లుగా వేమనను గాలించలేదు. గాలించడంగాదు, జోలికే పోలేదనవచ్చు. వేమనను సరిగా చూడకుండానే, ప్రత్యేకమైన కృషి చేయకుండానే వేమనను గూర్చి చాలా నిశ్చితాభిప్రాయాలు వెలిబుచ్చివున్నారు.

వేమనలో సామాజిక స్పృహ (Awareness) వున్నదిగాని సామాజిక చైతన్యం (Consciousness) లేదన్నారు! అతణ్ణి భక్తి వుద్యమంలో వాణ్ణి చేశారు. సంఘ సంస్కరణకూడా సంకల్ప పూర్వకంగా పూనుకున్నవాడు కాదన్నారు, బ్రహ్మంగారితోపాటు వేమనకూడాజీవన్ముక్తిని సాధించమన్నాడన్నారు. వేమన కుల నిర్మూలనంకూడ ఏపాటిదిలెమ్మన్నారు. అతడు ఏమంత విజయం సాధించాడన్నారు. అటువంటప్పుడు వేమన ఆర్థిక విప్లవతత్వం వారికి అసలు

అడాహౌడా కనపడకుండాపోయింది. దాని మంచి చెడ్డల తూకంమాట ఎక్క డుంటుంది.

కాకపోతే హేతువాదిగాచూచి ఆచారకర్మకాండమీద, ఇంకా సగం మత విషయం సగం ఆధ్యాత్మిక విషయం అయిన కులంమీదా దాడిచేసి, "పురోహిత సంస్కృతి"మీద తిరగబడినట్టు–ఆ తిరుగుబాటు పెట్టుబడిదారీ వ్యవస్థ జననా నికి, దానినేపథ్య దశ అయిన పెట్టుబడిదారీ దశకు (Mercantilism) దోహద కారి అనే అర్థంలో ఇటీవల వేమనను వ్యాపారస్థులకవి అని సూత్రీకరించారే గాని, ఎప్పుడైనా అతనికి పూర్ణమైన ఆర్థిక దృష్టి అంటూ వున్నదేమో చూడలే కపోయారు.

వారిలో మరికొందరయితే అతని ఆర్థిక దృష్టి విషయం కానకుండానే కులంమీద అతడు చేసిన దాడికి ఆర్థిక కారణాలేమిటో వూహించి చెప్పబూను కొన్నారు. అతడుచేసిన కులంమీద దాడికి–బట్టల పరిశ్రమకీ వ్యాపారానికీ రక్త సంబంధాన్ని కనిపెట్టడంకాదు, కల్పిస్తున్నారు. అంటగడుతున్నారు. భక్తి సంప్రదాయంలో వందలకొలదిగావున్న చిన్నా, పెద్దా పేర్లతో కబీరు సిద్ధప్ప లిద్దరు మాత్రం నేతగాళ్ళు అయినందున, వారు 'కులంమీద దాడి' చేసినందున అసలు కులంమీద దాడికే బట్టల పరిశ్రమ పుట్టినిల్లు అని, ఆ దాడికి మొన గాడయిన వేమన జన్మచేత వృత్తిచేత – అనగా కులంచేత – బట్టల పరిశ్రమ లోని వాడని ఏ చేనేతకులంలోనో, బట్టల వర్తకంలోనో వున్న ఏ కులంలోనో పుట్టి వుంటాడని, కాదు, పుట్టి వుండాలని ఊహాశ్వాలను వడివడిగా పరుగెత్తిస్తు న్నారు. కానీ, వేమ అంటే సంస్కృతంలో మగ్గం అని. ఆ అర్థం తమ వాదానికి బలమిస్తున్నదని వీరు చెప్పుకోలేకపోయారనుకోండి. అయినా పేరు కులానికి రుజువు కాజాలదు తెలుగు వేమన్నలపేరు వేప చెట్టునుంచి వచ్చింది.

వేమనను గూర్చి ప్రత్యేకమైన కృషి చేయలేదని ఒకచెంప చెప్తూనే ఇంతింతమాటలు విసిరేశారు. ఇటువంటి సూత్రీకరణలు చేసేశారు. వేమన చేసిన ఆర్థిక విచారాన్నయితే అసలు ఆనవాలు పట్టలేదుగాని, అజతీసుకోలేదు గాని, వేమన కుల వ్యవస్థమీద అంతదాడిచేస్తే, అందుకుమాత్రం ఆర్థికకారణం వుండి తీరాలని అలసటలేని ఆలోచన అలవోకగా చేస్తున్నారు. మార్క్సిస్టుల

చరిత్రశోధన ఆలోచనలు యిలావుండగా వేమన ఆర్థిక చింతనాయత్నమూ వెలుగులోకి రాకపోయింది. అదే చూడాల్సి వున్నాం. అయితే అతి క్లుప్తంగా ఇప్పుడు చూస్తాం.

కలిమిలేనివాని కులముదిగుననని, కులముకన్న మిగుల కలిమి ప్రధాన మని, కులం ఎక్కువ తక్కువల బాధ పేదవాళ్ళకేగాని, కలిమి గలవాళ్ళకు కాదని,లేదని, కుల వ్యత్యాసాలకన్న కలిమిలేముల వ్యత్యాసాలే సంఘంలో ప్రమాదకరంగా పరిణమించాయని – సంఘంలో ఆర్థిక విషయమైన వర్గద్వేషం వర్గ సంఘర్షణ – వర్గ సౌభ్రాత్రం రూపుగొంటున్నవని, దారిద్ర్యం యొక్క పరిణామ ఫలమే శివుని దక్షాధ్వర ధ్వంసనగాథ అనీ, పులికన్న కనికన్నా ఆకలే హెచ్చు అని, ఆకలి అత్యయిక పరిస్థితి అని, అవశ్యం తీర్చాల్సినదని – అయితే అదితీర్చలేని గడ్డు సమస్య కాదని – కడుపుకెట్టులైన కలుగును భుక్తిరా, కడుపు రాతిలోని కప్పకు నిండదా– కరవులందైన గడచి గట్టెక్కవచ్చని – అట్టి ఆకలి కన్న విరివి అయినది, పెద్దది, వెంటనే తొలగనిది పేదరికము సమస్య అని, ఆకలి పేదరికము ఒకటి కాదని, పేదరికము బహుముఖమని, దారిద్ర్యం వల్ల ధైర్యం నశిస్తుందని, ఆత్మవిశ్వాసం సడలిపోతుందని, లేనికాలానికి లేనిమనసు ఏర్పడుతుందని. శుచి, ఘనత, ఆలోచన వివేకము, తాలిమి, పరపతి, దయ, బాంధవ్య బుద్ధివంటి మానవత్వపు లక్షణాలు నశిస్తాయని, విందుచే వ్యక్తి, సంఘము పాడగునని–ధనము లేమియనెడు దావానలంబది, తన్ను జెఱచు మీరిదాపు జెరచు–సముదయంబునందు సర్వమొక్కటియైన వైర మొరవదేమి వారలైన, హెచ్చుతగ్గులందు నేర్పడనే హాని – కాళ్ళు పోవువాడు కళ్ళు పోయినవాడు ఉభయులరయ కూడియుండురీతి పేదపేదగూడి పెనగొని యుండురాయని పరిశీలనమీద గ్రహించి చెప్పి యున్నాడు.

కలుగువానిబాధకనులచూడగలేము అంటూ సంపదవలని బాధలు అనర్థాలు చెప్పి వెక్కసమైనసిరులు మిక్కుటమైన దారిద్ర్యం రెండూ రెండు వైపరీత్యాలని, వ్యష్టికీ, సమిష్టికీ చెరుపని చూపాడు. ఆరోగ్యవంతమైన, మానుషగుణపూర్ణమైన నీతిమంతమైన జీవితం ఆర్థికంగా మధ్యమమైన స్థితి

లోనే సాధ్యమని, సమాజం మొత్తానికి మధ్యతరగతి మర్యాదసంసారితనాన్ని లక్షించాడు బోధించాడు.

మంచితనమంతా పేదలసొత్తని, పేదగా బ్రతకడమే పుణ్యమనీ, పేదకే స్వర్గద్వారం తెరచుకొంటుందని, దారిద్ర్య సంకీర్తనం ఇతరమతస్థులలాగా చెయ్యలేదు. పేదలను ఐహికజీవితంలోని కఠినసత్యాలను, బాధలను మరచి పొమ్మని, లెక్కచెయ్యొద్దనీ, దొరకనున్నస్వర్గానికై ఎదురుచూస్తూకూర్చోమని చెప్పలేదు. సంపద పాడుచేస్తుంది. దానిజోలికి వెళ్ళవద్దని దృష్టిమళ్ళించలేదు. సొంతలాభం కొంతమానుకుని పొరుగువాడికి తోడుపడమనికాదు, అతడు చెప్పింది. సంఘంలో సమూలమైన ఆధిక పునర్వ్యవస్థీకరణము నతడుకోరాడు. వ్యక్తి తనకు ఉన్నదాన్ని ఇతరులకు పెట్టవలెనన్నాడు. సంపదపునర్విభజన అతనిలక్ష్యం- మితమైన ఆస్తి మనుష్యుని వ్యక్తిత్వానికి అవసరం అన్నాడు. గోచిపాతకన్న కొంచెంబు మరిలేదు-గొప్పలేని బుద్ధికొంచమైపోవురా యని ఆకలితర్వాతి సమస్యల్నిచెప్పి, తల్లి బిడ్డలకును తగవులబుట్టించు, ధనము కూడదని వచింత్రుగాని, గడనలేక గడచుట ఎట్లురాయనిప్రశ్నించి ప్రతివానికి ధనము ఆస్తికొంత వుండాలన్నాడు,

పేదఱికము నిర్మూలనమే అసలు అతని అంతరాంతరాల్లోని తపన- ఆదినుండి అదేతపన. అతడు వట్టి బోధకుడుగానే ముగిసినవాడుకాడు. ఆదిలో పేదలకొరకు ఉద్యమించినవాడు ఉగ్రపంథత్రొక్కి, ప్రజలను త్రొక్కించిన వాడు.

> ద్రోహబుద్ధినైన దొంగరికమునైన. సటలనైన సాహసమునైన
> సంపదధికునుండి సాధించిధనమును బడుగుకిచ్చుటొండెబాగువేమ!
> అదురుబెదురులేక అన్యులసొమ్ముల దానమిచ్చువాడెదాతవేమ యని
> పరులకుపకరించి పరుసొమ్ముపరునకు పరగనిచ్చెనేని పరముగలుగునని

దానాన్ని, దాతృత్వాన్ని కొత్తదారులు తొక్కించాడు, కొత్తనిర్వచనాలు చేశాడు దానితో ఉద్యమమే జరిగివుండాలి. మాలపల్లి నవలలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు చిత్రించిన ధర్మకన్నాల సిద్ధాంతానికి చరిత్రలో వేమన

జనకపాదుడుకావాలి, కలవాళ్ళను కొట్టి లేనివాళ్ళకు పెట్టడం ధర్మం, కర్తవ్యం అన్న భావం అతనిదే. వైష్ణవ భక్తుల సమారాధనంకొరకు, జంగాలను తినిపించడంకొరకు తిరుమంగై ఆళ్వారు కన్నద బ్రహ్మయ్యవంటి వైష్ణవశైవ భక్తులు తమతమ మతాలవాళ్ళను మేపడానికి దొంగతనంచేశారు· అది మతస్థుల బుద్ధి-వేమన మాత్రం మతభేదమే చూడకుండా పేదవాళ్ళందరికీ కొల్లసొమ్ము పెట్టమన్నవాడు. వాళ్ళది మతదృష్టి-వేమనది మతప్రసక్తిలేని సాంఘిక సమతాదృష్టి.

దోసకారియైన దూసరికాడైన పతితుడయిన వేదబాహ్యుడయిన
వట్టిపేదవాని కీదగునీవి విశ్వ............అన్నవాడు.

ఈ బోధలతో సంఘంలో-శ్రీశైలం–కందుకూరు, కడపల మధ్య–17వ శతాబ్దంలో వేమన ఇటువంటి ఒక ఆర్థిక వుద్యమానికి కారకుడయిఉండాలి తర్వాత కాలంలో వెంటనే సర్వాయిపాపడి తిరుగుబాటులో నెల్లూరు హనుమంతు అనేవాడు తెచ్చినాటినభావాలు – కలవాళ్ళనికొట్టి పేదలకు పెట్టడం అన్నభావాలు – సర్వాయిపాపడి బుర్రకథలో వున్నవి. కాని ఆ ఉద్యమం ఎక్కిరాలేదు. విఫలమయింది. ఇక బంగారంచేసి పేదలకు పంచుతాననిపోయి రసయోగంలోపట్టాడు, యోగంలోపడ్డాడు–తత్త్వమంతా తరచితరచి తత్త్వానికి తాను దర్శించిన ఆర్థికవ్యవస్థకీ సమరసకుదుర్చుకొన్నాడు. మళ్ళీ జనంమధ్యకు సంఘంమధ్యకు వచ్చాడు-తత్త్వంతోను, ఆర్థికబోధతోను కూడా మళ్ళీవచ్చాడు. అప్పుడుకూడా ఆర్థిక పునర్వ్యవస్థీకరణ మాటమానలేదు.

అందుకుగాను లేనివాళ్ళకీ వున్నవాళ్ళకీమధ్యనే పెళ్ళిళ్ళుజరగాలని అలా జరిగితేనే మధ్యతరగతితనం ఏర్పడుతుందని వివాహసంస్కరణ చెప్పసాగాడు. కన్యాశుల్కంలేకుండా పెళ్ళిళ్ళుకావాలన్నాడు. పేదయింటి మగపిల్లలకు కలయింటి ఆడపిల్లలను ఓలి (కన్యాశుల్కం) అడగకుండా పెళ్ళి చెయ్యాలన్నాడు. కలవారు కలవారితోనూ-లేనివారు లేనివారితోనూ మనువులందుకోరాదన్నాడు.

కలిమిజూచియాయక్రయమిచ్చినట్లుండు సమునకీయచూడ సరసగుణమె
పేదకిచ్చు మనువు పెనవేసినట్లుండు...

సకలసంపదలను స్వారస్యములజూచి వలచియిచ్చుమనువువాడిపోవు

సమమురానిమనువు చాలగా ఫలియించు....

పేదకిచ్చు మనువు ప్రబలువేమ

కలవాళ్ళను దానధర్మాలు చెయ్యమన్న ఉదారబోధ ఎంతెంతో అందరి లాగా చెయ్యడమేగాదు, అలా చెయ్యకపోతే వచ్చేజన్మలో కటికపేదవై పుట్టి అడుక్కోవలసి వచ్చి, పెట్టేవాళ్ళు లేకుండాపోయి అలమటిస్తావని, ఉత్తరజన్మ లోని బాధలను చూపి కలవాళ్ళను భయపెట్టాడు. మతభావాలను విశ్వాసాలను కలవాళ్ళను కలవరపెట్టడానికి వినియోగించిన ఉదాహరణ వేమన.

తాముబలిమిపెట్టతమకుబల్మికల్గు, అడుగనిడినతామునడుగగల్గు

ఇందునీనివానికెందును గలుగదు....

తామొరులకొసంగ తమకదియేగల్గు....

తాముగడనసేయుధనము తమదటంచునమ్మియుండు వెఱ్ఱినరుఁలుః భువిని

తామునొకరికిచ్చు ధనమంతియేగాక కడమదితమకేలగలుఁగువేమ!

ఈవిధంగాదానధర్మ ప్రబోధం చేసేప్పుడుకూడా వేమన ప్రత్యేకత వేమనదే. అదీ అతని ఆర్థిక పునర్వ్యవస్థీకరణకు లోబడినదిగానే వుండి విశిష్టంగా కనిపిస్తుంది.

అంతేకాదు, అతడుబోధించే ఆర్థికమాధ్యమికవాదంసర్వానికి సొంత శ్రమే మూలం. శ్రమపడకుండా గడించడం, బ్రతకడం నేరమన్నది అతని భావం. చెమట కారునట్లు శ్రమపెట్టిదేహంబు గడనచేసికూడువవలయు, తల్లితండ్రిసొమ్ము తాఁదింటకారాదు. అని తెగవేసిచెప్పాడు. అంటే ఆస్తిపరం పరాసంక్రమణను తీసివేయమనికూడా భావిస్తున్నట్లేగదా! పూర్వులు స్వార్జితమ్ విత్తమ్ ఉత్తమమ్ అన్నారుగాని పిత్రార్జితమ్ మధ్యమమ్ అని కొంతగౌరవం మిగిల్చారు, వేమనమాత్రం పిత్రార్జితాన్నికూడా తీసేసి రద్దుచెయ్యాలనే భావం చెప్పాడు, స్వార్జితమేవ విత్తంభోగ్యం అని సవరణచెప్పాడు వేమన.

కాయకష్టం పేదగానేగాదు, కలిగినప్పుడుకూడా చెయ్యాల్సిందేనన్నాడు. ఉన్నవాడైనా ఉన్ననాడైనా కాయకష్టం మానగూడదన్నాడు. ఉండికూడా కష్టపడేవారిని ఎగతాళిచెయ్యడం తప్పన్నాడు. కష్టపడేకలవాళ్ళను సమర్ధించాడు. కష్టించి, గడించి, కోరితే యితరులకు పెట్టేటట్లు ఉండాలన్నాడు.

కలుగుకాలముననను కష్టించి కష్టించి అయినదివసములను అన్యులకును
కోరఁబెట్టువారు క్రూరులెయౌదురా......... అన్నాడు.

కష్టముచేసి జీవించుము. కష్టమొకనికికోల్పోకుము, కష్టమునుండి దానమిమ్ము అన్నది వేమనబోధ. విరివిగా, వివిధముగా చేసినబోధ.

కలుషితార్జనములు కలవారిలోనూ, పేదవారిలోనూ వున్నవన్నాడు. యాచకత్వము, దొంగతనము, అప్పుజేసియెగబెట్టుట వంటిమోసములు లేనివారి కలుషితార్జనములన్నాడు. దొడ్డవారమనుచు త్రోవడొంకలుఁగట్టి, అడ్డమైనజనుల సంటగట్టిదోచుకొన్న యట్టిదోషము, వాగులడ్డుకట్టి వల్లకాడులుదున్ని మునునడి చెడుత్రోవ ముండ్లుకొట్టి పైరుబెట్టుపాపులూ అయనగారి కలుషితార్జనాపరుల జాబితాలో వున్నారు. ఉమ్మడి భూములను అపహరించే మోతుబరులను తెగడినాడు. అప్పుదీసుకొన్నవారు తాకట్టుబెట్టిన వస్తువులను పరికరాలను అభరణాలను వాడుకోవటాన్ని ఖండించాడు. దానికి పరిహారం యివ్వాలన్నాడు. స్థితి విషమించి యిరకాటంలోపడి అత్యవసరమై ఆస్తి అమ్ముకోవలసివస్తే దాన్ని తొక్కిపట్టి తక్కువకు కొంటేమాత్రం అపరాధం అన్నాడు. పరునిఅవసరాలను లాభానికి ఉపయోగించుకోవడంలో కలుషితార్జన ఉందన్నాడు. అట్టి హీన క్రియాలు చెల్లనేరవు అన్నాడు. దొంగతూనికలు దొంగకొలతలు కలుషితార్జనమని ఖండించాడు. సరిహద్దులుగదుముకోవడం కలుషితార్జనం. వెట్టిచేయించుకోవడం కలుషితార్జనం. Bond slavery రద్దుచెయ్యవలసినపని ఇంకా మనకున్నదంటున్నాం- వెట్టిచేయరాదు విభుడెంతఘనుడైన—అని ఎన్నడో ప్రబోధించాడు. ఆనాడు రాచవెట్టి చాలవుండేది. వూరిలో మోతుబరులకు గ్రామాధికార్లకు వెట్టిచాకిరీ తప్పక చేయాల్సిందే. పరులసొమ్మును పరులఆస్తిని కాజేయడం కలుషితార్జనం అని వేమన భావం అనటంలో సందేహంలేదు.

పిసినిగొట్టుతనం అతని దృష్టిలో పెద్ద అపరాధం-అది అర్థికాపరాధమనే అతని వుద్దేశం. ధనస్వభావము నిత్యచలనం—దానినైజం గాలివలె

సదాగతి. చేతులు మారటమే దాని లక్షణం. అనుభవమే దాని పరమావధి, నిత్యోపయోగం నుండి తొలగకుండటమే దాని సార్థక్యం. తన తక్షణానుభవానికి-పరులకు, పేదలకు-భవిష్యంలో తనకొరకు తనవారికొరకు-ఇలా మూడుగా ఆర్జనను భాగించమని వేమనబోధ. ఆర్జనదానం, స్వానుభవం వ్యయం కొరకే. దాని గమనాన్ని నిరోధించరాదు. కూడబెట్టి, దాచిపెట్టి దాని చలనాన్ని నిరోధించటం నేరం. పిసినివాని దాపరికం సంఘవ్యతిరేకచర్య. ధనస్వభావానికి వ్యతిరేకచర్య. అందుకే పిసినిగొట్టుమీద అతని వేళాకోళం, కోపం అతివేలం అత్యధికం :

పిసినివాని యింట పీనుగువెడలిన కట్టెకోలలకును కాసులిచ్చి

వెచ్చమాయెనంచు వెక్కి వెక్కేడ్చురా.........అని అనితరసాధ్యంగా హాస్యరసపోషణచేశాడు. ఇంతకన్న గొప్ప అపహాసపంక్తు లిప్పటికి పుట్టలేదు.

భూమినాదటన్న భూమి పక్కునవ్వు, ధనము నాదటన్న ధనమునవ్వు

కదనభీతుజూచి కాలుండునవ్వురా.........అన్నాడు కడకు.

మరోప్రక్క పేదల నడవడిలోపాన్ని ఇలాచెప్పాడు : దానమడుగువాడు ధరలోన అధముండు, దానమడుగకున్న దైవసముడని-అప్పుచేయురోత అది తీర్పమియురోత-పరుల మోసపుచ్చి పరధనమార్జించి కడుపునింపుకొనుట కానిపద్దు-ఋణముజేయు మనుజుడెక్కువకెక్కునా అని, డొక్కకొరకు నూళ్ళు దొంగిలించడాన్ని-నిరసించాడు.

ఇరుపక్షాల కలుషితార్జననూ ఇలాచూపించి-తన అభిప్రాయం, తన పరిష్కారం అప్పులేనివాడు అధిబలాఢ్యుడని-కలిమిలేమి రెండు తెలివికి హానిరా అన్నట్టు-చద్ది మిగులగలుగు సంసారపరిస్థితికి అవకాశమిచ్చు జెప్పి కాయకవే కైలాస అని బోధించిన (కాయకష్టంచేత బ్రతకటమే కైలాసమనుఅన్న) కన్నడ బసవేశ్వరుల వీరశైవ మతోద్యమాన్ని జ్ఞప్తికితెస్తూ, దానికున్న మతపు తొడుగును కాస్తా ఒల్చేసి, అబోధను అభివృద్ధిపరచి అచ్చపు ఆర్థికసిద్ధాంత మొకదాన్ని తయారుచేసి ఆర్థికమాధ్యమికంగా బోధించిన వేమన ఆర్థికవ్యవసా ద్రష్టల్లో మొదటివాడు. పేదరికాన్ని నిర్మూలించాలని బోధించుటేకాదు, విఫలమైనప్పటికీ ఉద్యమించి చూచిన అపురూప మహాపురుషుడు. ప్రపంచచరిత్రలో ఆయనకు ముందిట్టి ఉదాహరణలేదు.

దారిద్ర్యనిర్మూలనమే అంతస్తపనగా మరిగి పొంగులెత్తి చల్లారి ఆర్థిక మాధ్యమకం చెప్పిన మహాపురుషుణ్ణి ఏ అర్థంలోగానివ్వండి వ్యాపారస్తులకవి అని నామకరణం చేయడం అన్యాయంకాదా? అక్రమంకాదా? అసత్యంకాదా? వీరికి మరొక మాటదొరకకపోయిందా? వ్యాపారులకు అనుకూలమైన పంక్తి ఒక్కగానొక్కటి చూపగలరా? చూపారా?

అదలావుండగా బట్టలపరిశ్రమకీ, బట్టలవర్తకానికీ—వేమనకీ, కులం మీద అతని దాడికీ ముడివేయడంగూర్చి ఒకటి రెండుమాటలు చెప్పాలి. పశ్చిమదేశాల్లో మన బట్టలకు బాగా గిరాకీ ఏర్పడినప్పుడు 16, 17 శతాబ్దాలలో బట్టలనేతతో, అమ్మకంతో సంబంధంవున్న కులాలు, అందులోని మేధావులు నాటి వ్యవస్థమీద దాడిచేయాల్సి వచ్చింది; దాడిచేశారు అనడం నిరాధారమైన సూత్రీకరణ—పశ్చిమ దేశాల మార్కెట్లు మనకు బారంబాటగా తెరచుకోకముందెప్పుడో, బట్టలపరిశ్రమలో వాళ్ళెవ్వరూ ముందుకురాకుండానే ఇతరకులాలవల్లే కులంమీదదాడి ఉవ్వెత్తుగా వాడిగాలేచి యుద్ధరూపం కూడా తీసుకున్నది. 11,12,13 శతాబ్దాల్లోనే కులంమీద దాడి వేడిగా వాడిగా సాగింది. 12 వ శతాబ్దంలో వీరశైవం కర్నాటకంలోనూ వీరవైష్ణవం ఆంధ్ర లోనూ కులాన్ని కూల్చవచ్చాయికదా! బసవేశ్వరుడు బ్రహ్మనాయుడు బట్టల పరిశ్రమలోని వాళ్లుగారు. వాళ్ళ అనుయాయుల్ని అభిమానపుత్రుల్ని ఆయా జాబితాల్లో వెదికితే వారెవ్వరూ నేతగాళ్ళుకారు-బట్టల అమ్మకందార్లుకారు. బ్రహ్మన్న ఏడుకులాల సంతానంలోనూ నేతగాడులేడు. బసవేశ్వరుని అనుచరులు నూట పద్దెనిమిదిమందిలో నేతకులంలోని వారొక్కరూలేరు. 13 వ శతాబ్దంనుండే పండరీపురం కేంద్రంగా లేచిన వార్కరీ సంప్రదాయంలో (రామకృష్ణ హరి)నూ అదేకాలంలో లేచిన మహారాష్ట్రుల మహానుభావ లేక జయకృష్ణ సంప్రదాయంలో అనేకానేక భక్తులలో సంతులలో బట్టలునేసిన కులంవాళ్ళేలేరు. ఈ రెండు సంప్రదాయాలూ కులాన్ని కాదన్నవే. మహానుభావ సంప్రదాయ ప్రవర్తకుడు మరీ ఎక్కువ బోధించాడు. యాదవరాజు మహాదేవుని ముఖ్యమంత్రి హేమాద్రి (చతుర్వర్గ చింతామణి కర్త) అతణ్ని అనగా చక్రధరుణ్ణి హత్య చేయించాడు. బసవకల్యాణం—పల్నాడు-అమ్రోతి-భీకరమైన కుల వ్యతిరేకోద్యమాలను చూచినవి.

7, 8 శతాబ్దాల నాటినుండీ వున్న తంత్ర సంప్రదాయం కులవ్యవస్థకు వ్యతిరేకమయింది. అందులో నేతకులం వాళ్లులేరు. నవవిధ కన్యలని చెప్ప

సదాగతి. చేతులు మారటమే దాని లక్షణం. అనుభవమే దాని పరమావధి, నిత్యోపయోగం నుండి తొలగకుండటమే దాని సార్థక్యం. తన తక్షణానుభవానికి-పరులకు, పేదలకు-భవిష్యంలో తనకొరకు తనవారికొరకు-ఇలా మూడుగా ఆర్జనను భాగించమని వేమనబోధ. ఆర్జనదానం, స్వానుభవం వ్యయం కొరకే. దాని గమనాన్ని నిరోధించరాదు. కూడబెట్టి, దాచిపెట్టి దాని చలనాన్ని నిరోధించటం నేరం. పిసినివాని దాపరికం సంఘవ్యతిరేకచర్య. ధనస్వభావానికి వ్యతిరేకచర్య. అందుకే పిసినిగొట్టుమీద అతని వేళాకోళం, కోపం అతివేలం అత్యధికం :

పిసినివాని యింట పీనుగువెడలిన కట్టెకోలలకును కాసులిచ్చి

వెచ్చమాయెనంచు వెక్కి వెక్కేడ్చురా........అని అనితరసాధ్యంగా హాస్యరసపోషణచేశాడు. ఇంతకన్న గొప్ప అపహాసపంక్తు లిప్పటికి పుట్టలేదు.

భూమినాదటన్న భూమి పక్కునవ్వు, ధనము నాదటన్న ధనమునవ్వు

కదనభీతుజూచి కాలుండునవ్వురా........అన్నాడు కడకు.

మరోప్రక్క పేదల నడవడిలోపాన్ని ఇలాచెప్పాడు : దానమడుగువాడు ధరలోన అధముండు, దానమడుగకున్న దైవసముడని-అప్పుచేయురోత అది తీర్పమియురోత-పరుల మోసపుచ్చి పరధనమార్జించి కడుపునింపుకొనుట కానిపద్దు-ఋణముజేయు మనుజుడెక్కువకెక్కునా అని, డొక్కకొరకు నూళ్ళు దొంగిలించడాన్నీ-నిరసించాడు.

ఇరుపక్షాల కలుషితార్జననూ ఇలాచూపించి-తన అభిప్రాయం, తన పరిష్కారం అప్పులేనివాడు అధిబలాఢ్యుడని-కలిమిలేమి రెండు తెలివికి హానిరా అన్నట్టు-చద్ది మిగులగలుగు సంసారపరిస్థితికి అవకాశమిచ్చు జెప్పి కాయకవే కైలాస అని బోధించిన (కాయకష్టంచేత బ్రతకటమే కైలాసమనుఅన్న) కన్నడ బసవేశ్వరుల వీరశైవ మతోద్యమాన్ని జ్ఞప్తికితెస్తూ, దానికున్న మతపు తొడుగును కాస్తా ఒల్చేసి, అబోధను అభివృద్ధిపరచి అచ్చపు ఆర్థికసిద్ధాంత మొకదాన్ని తయారుచేసి ఆర్థికమాధ్యమికంగా బోధించిన వేమన ఆర్థికవ్యవసా ద్రష్టల్లో మొదటివాడు. పేదరికాన్ని నిర్మూలించాలని బోధించుటేకాదు, విఫలమైనప్పటికీ ఉద్యమించి చూచిన అపురూప మహాపురుషుడు. ప్రపంచచరిత్రలో ఆయనకు ముందిట్టి ఉదాహరణలేదు.

ఆర్థికంకన్నా అన్య కారణాలుంటవని ఆచరణలోచూచి, చూపగలగాలి. మార్క్సిజం ఆర్థికనియతివాదం కాదు, కాదని మార్క్స్ ఎంగెల్సులు చెప్పారని వల్లిస్తే సరిపోదు. పరిశోధనలో ఆర్థిక నియతివాదులం కామని రుజువు చేసకోవాలి. వేమన్నను బట్టల పరిశ్రమ వాడనడం–కులంమీద దాడి బట్టల పరిశ్రమలో పుట్టినదనటం–వేమనను వ్యాపారస్తులకవి అనటం మార్క్సిజాన్ని ఆర్థిక నియతివాదం చేస్తున్నారనడానికి ప్రబల నిదర్శనం అవుతోంది. ఇదంతా ఊహాసౌధం. చరిత్ర వాస్తవాలు కావాలి. కులవ్యవస్థమీద వేమన తిరుగుబాటుకు ఆర్థిక కారణాలను వెదికేముందు వేమనను ఆర్థిక విచారకుడిగా వెలకట్టడం నిలబెట్టడం అవశ్య కర్తవ్యమని గుర్తించడం మంచిది.

ఈ వ్యాస ప్రచురణ దరిమిలా, గత శతాబ్ది చరిత్ర మార్క్సిజంయొక్క వైఫల్యాన్ని ప్రబలంగా నమోదుచేసింది. గత తర్కాన్ని ఆ దేశాలే తప్పు పట్టాయి. అది విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని అడ్డుకొన్నదని అవే తెలుపుకొంటున్నాయి. ఇక చారిత్రిక భౌతికవాదం ఒక ఆర్థిక నియతివాదమై, అది ఆచరణలో విఫలమై ఒక సంక్షోభంలో పడివుంది. ఈ సందర్భంలో వేమన ఆర్థిక మాధ్యమకం మరింత విచారణీయమౌతుంది నిస్సందేహం.

ఆర్థికమైన దినుసు వేమన ప్రత్యేకతలలో ప్రత్యేకత, ఇన్నూరు మున్నూరు పద్యాలలో ఆయన ఆర్థిక విచారవృష్టి కురిసింది. కబీరు, చైతన్య, రామానంద, రామదాస, జ్ఞానదేవ, తుకారామ, సర్వజ్ఞ, బ్రహ్మన్న రాయిదాస మరొకరు మరొకరు ఇటువంటి ఆర్థిక చర్చను చేసినవారేకారు. బసవన్నలో వీరశైవంలో కొంతవుంది. తిరువల్లువరు అరవైడెబ్భై పంక్తులు కూర్చాడు, కాని పోలికకు నిలవవు. వేమనలో వున్నంత ఆర్థికచింతన ఏ వాక్కారిలోనూ లేదు భారతదేశ చరిత్రమొత్తం తిరగేస్తే ఇంత గొప్ప ఆర్థిక వ్యవస్థా ద్రష్ట, చింతకుడు దొరకడు. ప్రపంచ చరిత్రలో పదిహేడవ శతాబ్దినాటికి ఇంత ఆర్థిక చింతకుడు నాకు కానరాలేదు. ఉంటే, వింటే, చూపితే చెప్పితే విందాం.

—: o :—

# వేమన వీరబ్రహ్మాలు
# వైష్ణవ మాయ - మార్క్సిజం

1) రామానుజుడు శివపూజా ధురంధరులకు వ్యతిరేకంగా వుద్యమించాడు. ఆనాడు శివభక్తులైన పాలకులను దోపిడికి, అణచివేతకు చిహ్నంగా సామాన్యులు భావించి వుంటారు.....పల్లవులు, శైవులు, రామానుజుణ్ణి రాజ్యం నుంచి తరిమారు.

2) పల్లవుల కాలంలో రాచరిక వ్యవస్థ దుర్మార్గాలను గురించి చారిత్రకులు చాలా వ్రాశారు. రాజభక్తి, రాజుల కోసం ప్రాణాలర్పించడం. రాజ సంక్షేమం కోసం శిరస్సు ఖండించుకోవటం మొదలైనవి చరిత్రలో కనిపిస్తాయి. బహుశా దీనికి భిన్నంగా భక్తి మార్గం తమిళ దేశంలో ప్రారంభమైవుంటుంది.

3) భక్తి దక్షిణ దేశంలో ఉదయించింది! రామానంద్ దానిని ఉత్తర దేశానికి తీసుకువెళ్ళాడు. కబీర్ దాన్ని....వ్యాపింపజేశాడు. రామానంద్ ద్వారా అందుకొన్న దక్షిణాది వైష్ణవంలోని ప్రేమతత్వం....సూఫీతత్వంలోని నిరాకార ఈశ్వర ప్రేమ, ప్రణయతత్వం సమ్మేళనం చెంది సంతుల మార్గం బయలు దేరింది.....13, 14 శతాబ్దాలలో ఆర్థిక సామాజిక రంగాలలోని అశాంత పరిస్థితులలో ఈ మార్గం సామాన్యులను ఆకర్షించింది. వృత్తికారులు, శ్రమజీవులు సంఘటితం కావటానికి భక్తిమార్గం తోడ్పడింది.... మహారాష్ట్ర నుంచి పంజాబు వరకు పశ్చిమోత్తరంలో సంత్ భక్తి మార్గం వ్యాపించింది.

4) క్రింది నుంచి భూస్వామ్య వ్యవస్థ పటిష్టమవుతున్న దశలో భక్తి సాహిత్యం ప్రారంభమయింది. సామ్రాజ్యాల కాలంలో రాజులను కొలవటానికి

రూపొందిన భక్తిని దైవం వైపుకు మరల్చి....పాలకవర్గం ముందు తర తమ భేదాలున్నా దేవుడి ముందర అందరూ సమానమే అన్న భక్తి తత్వకవులు కొంతవరకైనా సమాజానికి దగ్గరయ్యారు.

5) భక్తి కలిగి వుండటమనే అంశం ఆనాటి రాజరిక వ్యవస్థకు అనుకూలమయింది. రాజభక్తికి అది మార్గం వేసింది. ఉన్నత వర్గాల ప్రయోజనాలను పరిరక్షించటానికి ప్రాతిపదిక వేసింది. పై భూస్వామ్యవ్యవస్థ (Feudalism from Above) నుంచి కింది భూస్వామ్య వ్యవస్థ (Feudalism from Below)కు మారిన దశలో భక్తి రూపాంతరం చెందింది.

6) మధ్య యుగపు భూస్వామ్య, రాచరిక వ్యవస్థలో కేంద్రంలో అధికారం ఎవరిదైనా, గ్రామాధికారులు, స్థానిక భూస్వాములు సామాన్యులపైన శ్రమజీవులపైన వృత్తికారులపైన ప్రత్యక్షమైన పెత్తనం చెలాయిస్తున్న వ్యవస్థలో వారి నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వృత్తికారులు, స్వతంత్ర భావాలుగల యితరుల—భక్తిని ఆలంబనంగా చేసుకొని సంస్కరణ దృష్టితో జనాన్ని కూడగట్టడానికి ప్రారంభించిన ఉద్యమాలకు సమాజ స్వభావం వుంది.

7) స్వీయ భక్తిమార్గం ప్రత్యక్షంగా కుల నిరసన చేయకపోయినా పరోక్షంగా కులాన్ని కాదన్నది. భక్తి క్షేత్రంలో కులభేదాన్ని భక్త కవులు తిరస్కరించారు. ఆర్థికంగా ఉచ్చవర్గాల హృదయ పరివర్తననే వీరు కోరారు. ఫలితం వర్గ సామరస్యం, రాజాశ్రయాన్ని నిరాకరించటం ఈ కోవకు చెందిన చాలామంది కవులలో కనిపించే మరో ప్రత్యేకత. తనపైన శృంగార పదం చెప్పనన్నందుకు సాళువ నరసింహరాయల ఆగ్రహానికి గురై, చెరసాల పాలయ్యాడు అన్నమయ్య. వేశ్యలనుకూడా నిరసించలేదు. [వేశ్యలనుకూడా జీవిత సహచారిణులుగా గ్రహించిన వారున్నారు.] చైతన్యుని పాటలు, నృత్యాలు....సామాన్యులను ఎక్కువగా ఆకర్షించినవి. అదిమ సామూహిక ఉత్సవాలకు ఈ సామూహిక భక్తి సంప్రదాయం ప్రత్యామ్నాయం. అన్నమయ్య యిలాంటి సంప్రదాయాన్ని నిలబెట్టాడు.

8) స్వీయ భక్తి మార్గం కులవ్యవస్థపైన పరోక్ష నిరసన మాత్రమే

ప్రకటిస్తే సంస్కరణ మార్గం ప్రత్యేకనిరసనను ప్రదర్శించింది. బసవన్నది సంస్కరణమార్గం. కబీర్‌కూడా సంస్కరణ మార్గంలో చేరతాడు. తెలుగులో వేమనలోనే బసవన్నను పోలిన సంస్కరణ భావాలు కనిపిస్తాయి. వీరబ్రహ్మం, సిద్దప్పలలో ఈ అంశాలున్నాయి.

9) జ్ఞానంతోకాక యోగంతో బ్రహ్మను చూడవచ్చని తత్వకవులు నమ్ముతారు. ఉన్నత వర్గతత్వాన్నే ఆశ్రయించి సాంస్కృతికంగా ఉన్నత వర్గం దగ్గరకు వృత్తికారులను క్రిందివర్గాలను తీసుకొనివెళ్ళి ఆత్మగౌరవాన్ని పెంచడం తత్వమార్గంలో ప్రధానంగా కనిపిస్తుంది· వీరబ్రహ్మం మఠాలద్వారా వ్యవస్థిత నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాడు. స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ శిథిలమవుతూ వృత్తికార్లు వ్యాపారస్తులకు అవసరమైనవస్తూత్పత్తివారికి పరికరాలుగా తయారవుతున్న దశలో వారిలోని భయాందోళనలను తొలగించడానికి భవిష్యద్వాణి ఉపకరించివుండాలి. వీరబ్రహ్మం....ఈ ప్రపంచాన్ని ఉద్ధరించడానికి వీరభోగ వసంతరాయలుగా జన్మిస్తానని అంటాడు.

10 **(a)** వేమన మధ్య తరగతి రైతు కుటుంబానికి చెందినవాడు.... తనవర్గ స్వభావంలో భాగంగా వేశ్యాలంపటుడైనాడు....బ్రాహ్మణాధిక్య ప్రశంస, బ్రాహ్మణ దాన ప్రాధాన్యం, శైవేతరమతాల ఖండన....నీచ కులజుల పైన చిన్నచూపు, ధన ప్రాధాన్యం, రాజధర్మాలు....(వేమనలో కనిపిస్తవి).

**(b)** బసవన్న కులాహంకారాన్ని చంపుకొని కులరాహిత్యస్థితిని సాధించటం 12వ శతాబ్దిలో చాలా అభ్యుదయకరమైన అంశం, అగ్రకులాలకు చెందిన ఇతరభక్త కవులుగాని వేమనగాని కులభేదాన్ని కాదన్నా బసవన్నలోని ఆ భావాన్ని అందుకో లేకపోయారు.

**(c)** స్వయం ప్రతిపత్తిని కోల్పోయి వాణిజ్య వర్గ ప్రయోజనానికి సరుకులను ఉత్పత్తి చేసేవారుగా మాత్రమే తయారైన వృత్తికారుల్లో కనిపించే కనీసపు దిశానిర్దేశం సంఘటితత్వం వేమనలో కొరవడటానికి కారణం అతడు మధ్య తరగతికి చెందినవాడు కావడమే అయివుండాలి.

**(d)** వేమన పేరిట పద్యాలలో కనిపించే కొన్ని భావాలు సమకాలీన

తత్వకవులలో, అంతకుముందు బసవన్న, కబీరు మొదలైన వారిలో కనిపించే వాటికి భిన్నమైనవి కావు. అలాంటి పద్యాల్లో చాలావాటిని సమకాలీనులలో తరువాతవారో వేమన పేరిటవ్రాసి ప్రచారంలోకి తెచ్చివుంటారు. బసవన్నతోపాటు కబీర్ అన్నమయ్య యితర తత్వకవుల భావపరంపర వేమన పేరిట ప్రచారంలో వున్న పద్యాలలో యథాతథంగా అచ్చుగుద్దినట్టు కనిపిస్తాయి. ఇవి ఒక కవివిగాక, సమకాలీన తత్వకవులందరిలో ఒకే ధోరణిలో ప్రచారంలో వున్నవిగా, అనుసరణకు సంబంధించినవి కానివిగా, భావించవచ్చు. (ఒక్క వేమనవి మాత్రం అనుకోకుండాలి.)

* * *

ఇంతవరకూ మీరుచదివిన వాక్యాలన్నీ ఆంధ్ర సారస్వత పరిషత్తు సారస్వత వేదికా సంచాలకులైన రంగనాథాచార్య వర్యులవి. పదిపన్నెండు మందిచేత కొంతమంది తెలుగుభక్తులను యోగులనుగూర్చి ప్రసంగాలు వ్రాయించి చేయించి, ఆ యోగులను భక్తులను తెలుగులో తొలిసమాజ కవులని సిద్ధాంతించి, ఆ పేరుతో ఆ ప్రసంగాలను ప్రచురించారు. ఆ వ్యాస సంకలన కర్తలుగా సమీక్షకులుగా ముప్పది పేజీల పొడవైన సంపాదకీయ వ్యాసమొకటి ఆచార్యులవారు వ్రాశారు. ఆ వ్యాసంలోని సారంశమే పైన చదివిన వారి వాక్యాలు.

## అయ్యవార్లంగార్ల సంకల్పం

భక్తకవుల విషయంలో రంగనాథాచార్యులవారి ప్రణాళిక, అభిమతార్థం అభిమానార్థం ఏమిటో పాఠకులిప్పటికే పసికట్టివుంటారు. (1)భక్తి దావావైష్ణవంతో పుట్టిందని, దక్షిణానిలోనే పుట్టిందని, అది రామానుజులతోను, రామానందులతోను రాజభక్తి కాకుండాపోయి- పాలకులకు, ప్రభువులకు ఎదురునడిచేదిగా రూపాంతరంచెందిందనీ, ఆంధ్రలో అట్టిభక్తి సింహగిరి వచనకర్త కృష్ణమాచారి (14వ శతాబ్దాది) తోను 15వ శతాబ్దాంతగతుడైన అన్నమాచార్లతోను అట్టి రూపాంతరం చెందిందని, రాజ తిరస్కారకమైన భక్తికి తెలుగులో యీ కృష్ణమ, అన్నమ ఆచార్యులే ఆదిమూలాచార్యులని చరిత్రను తిరగరాయడం ఒకటి.

2) నిజమైన, నిండైన అర్థంలో సర్వభారతంలోను ఆర్థిక, సాంఘిక వ్యవస్థా పునర్విచారకుడు, ప్రచారకుడు. ప్రయత్నాశువు అయిన ఏకైక మహా పురుషుడు, వ్యవస్థీకృత మత స్వరూపంలోని కృతకత్వాన్ని, అపాయాన్ని అసహన మనస్తత్వాన్ని గుర్తించి, ఆ రూపాన్ని నిరసించి మతాన్ని యోగాన్ని ఆధ్యాత్మికతను ఐహిక తత్వంతోను, హేతువాదంతోను, నిత్యజీవిత యాథార్థ్యం తోను, అందనుసరించవలసిన ఆచరణీయ నీతి రీతితోను హొందిపొసగించే సమీకరణాన్ని యిచ్చిన విశిష్ట దార్శనికుడు, సహపంక్తి చాప కూడులతోకూడా చావని కులభేదాన్ని, అగ్రజాతి - అంత్యజాతులు, గురువులు - శిష్యులు పరస్ప రోచ్ఛిష్టాన్ని తినజెప్పి, తినిచూపి తినిపించి నిర్మూలించవలెనని ఉద్యమించిన కులోన్మూల నాతివాద శిఖరం అయిన వేమన్నను ఆద్యంతమూ అరాజకునిగా, చుంబకునిగా, అనుకర్తగా, అవిశిష్టునిగా తెగిన గాలిపటంగా దిశానిర్దేశం లేని వానిగా దిగలాగి దిగువాయి చేయడం రెండవది.

3) రైతాంగ నేపథ్యంనుంచి ఆవిష్కృతుడైన ఆ వేమనను తత్వపద రచయితలైన చేతివృత్తిదార్లలో వీరబ్రహ్మంలో యింకా అందెవరిలోనో వున్నట్టి దిశా నిర్దేశం లక్ష్యం రైతయినందున వేమనలో కొరవడటం సహజమని, వీర బ్రహ్మంలోవున్న మత నిర్మాణ దక్షత ఏదో వేమన అరాజకునిలో కొరవడిందని, ఇంతవరకెవ్వరూ వూనుకొని ఎరుగనివిధంగా వింతగా అపాయకరమైన దారిబట్టి- బ్రహ్మంగారే మాన్యునిగా మన్నించినట్టి ఆవేమన వ్యక్తిత్వానికి బ్రహ్మంగారి అభిమానులకే తొలి గురువుగా కనిపించినట్టి వేమనకూ-ఆ బ్రహ్మంగారికి అసంగ తమైన తేడాలు పోటీలు తెచ్చి, ఆ యిద్దరిమధ్య భేదనీతిని ప్రయోగించటం మూడవది.

చేతి వృత్తులను చావుదెబ్బ తీసిన తెల్లదొరతనం కాలంలో తలెత్తిన బ్రాహ్మణేత రోద్యమంలోని కర్షక కులాల కోపుగాచి బ్రాహ్మణాధిక్యాన్ని కాదనే సిద్ధాంత పోరాటంలో పంచాణంవారు అగ్రగాములుగా వున్నారనేమాట చారిత్రక సత్యం. వేమన పద్యాలను కోర్టులో దాఖలుచేసి విశ్య బ్రాహ్మణ్యాన్నినిల బెట్టు కొన్నారు. వేమనను పంచాణంవారే బాగా ప్రచారం చేశారు. చేనేతవారుకూడా బ్రాహ్మణేతరోద్యమంలో పాలుపంచుకొన్నారు. రైతుఅయిన వేమన చేతివృత్తుల

కులవ్యవస్థనీ బ్రాహ్మణ్యాన్నీ తీర్థాటననీ విగ్రహారాధనలను ఇతర కర్మకాండలనీ యావద్భారతంలోనే అరుదు, అపురూపు అన్నంత తీవ్రంగా తీక్షణంగా ఎదుర్కొన్నాడని 1982లో ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా వ్రాసింది.

In the literature of the Dravidian languages other than Tamil, the Bhakti movement was largely Saiva. Veerasaiva devotional literature in Kannada goes back to Basava, the founder of the sect. In Telugu the most interesting figurei s Vemana (15th Century), a saivaite teacher of low birth who attacked the caste system and the Brahmins in particular with a vehemence rare in all Indian Literature and who was almost equally antagonistic to inconolatry (worship of images), pilgrimage and other aspects of ritualism.

(HINDUISM, HISTORY OF BHAKTHI TEACHINGS IN ALL OF INDIA'S MAIN LANGUAGES. THE NEW ENCYCLOPAEDIA BRITANNICA, MACROPAEDIA vol. 8 P. 917 C (1982 edition)

తెలుగులో శివభక్తి వుద్యమమే ప్రధానమైనదని అన్యదేశీయులకు విశ్వసాహిత్య పరిశీలకులకు కూడా కనిపించగా, తెలుగు సాహిత్యంలో ఈ వైష్ణవదురభిమానులకు కంటిలో కలికానికి కూడా కాకపోయింది. అలాగే ఆవిశ్వసారస్వత సమీక్షకుల మదింపులో కులవ్యవస్థనీ బ్రాహ్మణ్యాన్నీ నిరసించడంలో అఖిల భారతంలోనే సాటిలేనివాడుగాను, అనగా బసవన్న కన్న కూడా గట్టి కుల వ్యతిరేకిగాను తేలిన వేమన కులాంహకారం చంపుకోలేనివాడుగా, ఆవిషయంలో బసవన్నకన్నా దిగువవాడుగాను ఈ రంగనాథాచారిగారికి కనిపించాడు. పైగా నీచ కులజులపై చిన్నచూపు, బ్రాహ్మణస్తుతి, బ్రాహ్మణదాన ప్రబోధం కూడా వేమనలో కానవచ్చాయట. విపరీతంకదా!

## రాగిరేకులమీద వైష్ణవభక్తి

శివకవుల ప్రసంగం లేకుండా చేసి, శివకషిగా తేల్చి వేమనను పలువిధాల ప్రల్లదించి తెలుగులో సమాజకవిత అనదగిన భక్తికవితకు ఆద్యునిగా చెప్పబడిన కృష్ణాచార్యుని గూర్చి, సామూహిక భక్తి కవిగా చెప్పిన అన్నమయ్యనుగూర్చి వివేచించడమే యికమిగిలివుంది.

రాజపోషితులైన కవిత్రయంవారేమి, శ్రీనాథ పెద్దనాది ప్రబంధకవులేమి, కృష్ణరాయాది రాజకవులేమి తమరచనలను తాటాకులమీద వ్రాయగా, తొలి సమాజకవితను రాజాశ్రయ నిరాకరణ కవితను వ్రాశారన్న యీవైష్ణవ కవి ద్వయం తమ రచనలను వ్రాసి రాగిరేకులమీద చెక్కించారు. రాగభోగ మయమైన తమ భక్తికి రాగిపలకలే తగినవని భావించారు రాజకవులు, రాజ పోషిత మహాకవులు తాళపత్రాలతో తృప్తిపడగా, వీరు రాగిరేకులమీద చెక్కించడం చూడగా అది సమాజ స్పృహాతిరేకమవుతుందో, భక్తి వ్యతిరేక మవుతుందో, ఆ భక్త రేణువుల్లో దాగివున్న ఆడంబరము, శాశ్వతీక రించుకోవాలన్న తపన, అనాయాసప్రాప్తమైన ధనం వేయించే విద్విలాసచేష్టా విశేషమౌనో ఆలోచించదగిన సంగతికాదా? ప్రజలసొమ్ముతో రాజులుచేయలేని ఆగడం యీ భక్తి కవులు చేశారు అని అనకుండా వుండలేని పరిస్థితి. ఒకరు నాలుగు లక్షల రాగి పలకలు, మరొకరు ముప్పయి రెండువేల రాగిపలకలు పోతపోయించి, శిల్పులచే పనిచేయించడం ఎంతవ్యయమో, ఆదెంత పరిశ్రమో యోచించండి. పైగా ఇదంతా రాజాశ్రయ నిరాకరణలో జరిగినపనియని రంగ నాథాచార్యులు చెప్పి చెల్లింప జూస్తున్నారు.

## కృష్ణాచార్యులకథ :

కృష్ణాచారి కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి క్రింద యాభైగ్రామాల మీద రాజాధికారిగా వుండి, ఒక గ్రామం అగ్రహారంగాపొంది, రైతులనుంచి, వృత్తిదార్లనుంచి వసూలుచేసిన పన్నుల ఆదాయాన్ని, అగ్రహారపు ఆదాయాన్ని వేశ్యలకూ రాగిపలకలకు వ్యయం చేసినవాడు. వేశ్యావాటిలో వుండగా తన కోసమై వచ్చిన ప్రజతో తాను కృష్ణాచారిని కాదని చెప్పి Impersonate చేసుకొని చాటుగా యిల్లుచేరి వేషంమార్చుకొని ఇదిగో కృష్ణాచార్యులనన్న మహానుభావుడు సుమీ! అలా సాగిన భోగానుభవం వెక్కసమై వైరాగ్యం కలిగి, అధికారం వదిలివేయ సిద్ధమై, నాలుగు లక్షల రాగిపలకలను బళ్ళ కెత్తించుకొని, అధికారం వదిలివేస్తున్నాను, మరెవరికైనా అప్పగించుకోవలసిన దని రాజుకు వర్తమానంకూడా పంపకుండా శ్రీరంగానికి కదిలిపోయినవాడు. పోతున్నాడని భటులువచ్చి చెప్పినా అతనిని అడ్డగించమని, నేరస్థుణిగా పట్టుకో మని అనకుండా వదిలివేసిన శైవ ప్రభువు ప్రతాపరుద్రుని ఔదార్యం

రుజువయినంతగా చరిత్రలో కృష్ణాచారి దొడ్డ గుణాలంటూ ఏమీ రుజువుకావు. ప్రజలసొమ్ముతో రాజకోశంతో ఇంద్రియతృప్తి, కీర్తికండూతి తీర్చుకొని విరాగియై నిర్బాధ్యతగా అధికారం వదిలివెళ్ళడంలో రాజతిరస్కారమేముంది? అతడు నిరసించవలసినట్టి అనుచితం రాజెక్కడచేశాడు? ఇతడు ఏ ఆత్మ గౌరవరక్షకొరకు రాజాధికారం వదులుకొన్నాడు? వైరాగ్యం కలిగి సన్య సించడమే రాజనిరసనమవుతుందా? సన్యసించడమే ఆదర్శమా? ఇతని కథ రాజాశ్రయ నిరాకరణ క్రిందకి రానేరదు. ఇతడు రాజనిరసన అంటూ రచనలో చేసినవాడుగాడు. సమాజంనుంచి రాజాధికారంనుంచి మస్తుగా అనుభవించి మొకంకొట్టి వదిలేసుకొన్న వృత్తాంతం అతనిది.

అతనివి అరవై రెండు వచనాలు దొరికినై. ఆవేమంత దొడ్డరచనలుగావు. భక్తుల నోళ్ళమీద బ్రతికినవీకావు. అంతశక్తి అతని రచనకులేదు. సగటు వైష్ణవునికి అతడంతగా నేడు తెలిసియున్నవాడూకాడు. 62 వచనాల్లో రాజప్రస్తావనలేదట-అదీ అతని గొప్పంటున్నారు. తక్కినవాటిలో లేదనేం దుకు ఆధారంలేదు. మరెలా రాజనిరసనవుందనగలరు? ఆ 62 వచనాల్లో ఒక కథ రత్నాలవ్యాపారమందున్న పెద్దవర్తకునికథ-ఇది జ్వాలాముఖి నిర్వచనం ప్రకారమే అది "వార్తాకథ, వార్తాకవిత" అవుతుంది. రత్నాలవ్యాపారి కథను సామాన్యజనుని కథయని ప్రసంగకర్త మనని అర్థంచేసుకోమంటున్నాడు!! దొరికి నంతలో అతని రచనల్లో ఒక్క వర్తక చక్రవర్తి కథేవున్నది. అదీ అతని సమాజ స్పృహ!! కావాలంటే కృష్ణాచారి రాజుల తర్వాత వర్తకుల వెంటపడ్డాడని ఇంకా చెప్పుకోవచ్చు. దానిలో అంతశీలశోభావిశేషం ఏముందో? ఇట్టి రచనను, ఇట్టి రచయితనుతెచ్చి, అంతకు ముందుగల శివకవులను లుప్త నాములను చేసి తెలుగున తొలి సమాజకవి అనటం ఎంత గొప్పగావుందో పాఠకులు ఇక తెలియగలరనుకొంటాను.

## ఇక అన్నమాచార్యుల తిరుగుబాటు !

ఇక అన్నమయ్య సంగతి : అన్నమయ్యదగ్గర కమ్మని తెనుగున్నది. అనాటి వాడుక తెనుగున్నది. అదిచాలు. అంతటితో తృప్తిపడకపోతే వేంకట

శైలవల్లభుని రతిక్రీడా రహస్యంబులను ప్రైవేటుగా చదివి వినోదించవచ్చు. కాని ఆయన శీలము, ఆయన సమాజ చేతన, ఆయన రాజతిరస్కార కవిత భక్తి అంటూ అంతగా టెక్కెమెత్తి ప్రచురించి సామాజిక దృష్టి ప్రాధాన్యానికి ఆయనను పేర్కొని అయన్ను ఆ విషయంగా రచ్చలోకి తేవడం అంత ఆరోగ్యమైన పనికాదు. సురక్షిత స్థితికాదు.

వెంకన్న రతికేళిని పదాలకెత్తినట్టుగా, తన శృంగారలీలమీద ఒక్క గానొక్కపదం చెప్పమని రాజుకోరగా, దాని గాదని తిరస్కరించి, సంకెళ్ళ పాలయిన సంగతి చాల విప్లవాంశమన్నారు. రాజుపైన అతడెట్టి పదమూ చెప్పలేదని అయన మనుమడు వ్రాసిన దానిని ఆస్కారం చేసుకొని వ్రాశారు! మనవడి వ్రాతేగాదు, అది తాటాకుల్లో దాగిపోయి ఆనాడు వెల్లడిగాని వ్రాత. రాజు కోర్కెను తిరస్కరించ యత్నించడం అతనిలో స్వాభిమాన రేఖ వున్నదనటానికి తార్కాణం. కాని కొలువులో అప్పుడు కాదన్న కోర్కెను మరొకపరి తీర్చినట్లు కనిపిస్తున్నది.

"అతివ జవ్వనము రాయలకు పెట్టనికోట. పతిమదన సుఖరాజ్యంబు నిలప" వంటి పదాలు నరసింహరాయలకు, ఏడుకొండల రాయలకూ జమిలిగా అన్వయించేట్టు అన్నమయ్య నోట పలికిన పదాలున్నవి. ఆ సంగతినిలా క్లుప్తంగా యిప్పటికి ముగించుదాము. కాని రాజు కొలువునాతడు విడిచిపెట్ట లేదు. పైగా సాళువ వంశ పక్షస్థుడుగా మిగిలినవాడు. తుళువ వంశకాలంలో రాజాస్థానానికి దూరంగా వుండినా, రాజాగ్రహారాలను మాత్రం అక్కరలేదని త్రోసిపుచ్చలేదు అన్న సంగతి విస్మరింపరానిది.

వారి విషయంలో రాళ్ళపల్లివారి మాట ఎలాంటిదో చెప్పితే వారి శృంగార భక్తిపదాలెంత ఇంద్రియ ప్రేరకాలో తెలుస్తుంది.

"అన్నమాచార్యుల శృంగార భావనలు ఆధ్యాత్మికముగా అసాధారణ మైనవి. ఆధి భౌతికముగా అతని అనుభవములును అట్టివేయని యూహింప వచ్చును" తాళ్ళపాకవారి "శృంగార కీర్తనలు"-పీఠిక-1956.

రాళ్ళపల్లివారు అంతమప్పిదంగా చెప్పినదానిని, మనమిక విప్పి చెప్ప

కోవలసిన పని బెట్టుకోకుండటం మంచిది. ముద్దుగుళని ఉద్దికాకపోవచ్చునేమో!!

అట్టి పాటలు, అదీ జానపదుల పదవరసలోకూడా భక్తిపేర సంభోగ శృంగారాన్ని పాడుతుండగా రాజు అలా కోరి వుండటం వింత కాదు. వారు అలాంటి పాటలు వ్రాసి కొలువులో వాటిని పాడటానికి అలవాటు నడటంచేతే, అనుదినం ఆయన ఆశీర్వచనానికి తహతహలాడిపోయేరాజు, ఆ ఆశీర్వచన బలమే అతణ్ణి రాయరాజ్య మెక్కించిందని నమ్మిన రాజు అలా కోరే ఉబలాటానికి వశంవదుడయ్యాడని గ్రహించవచ్చు. రాజు కోర్కెకు అన్నమయ్య ఉత్తరవాది కావలసి వుందనుకొంటాను. ఆ పరిస్థితి అన్నమయ్య స్వయంకృతం కాదా ?

## అన్నమయ్య : చైతన్యులు

చైతన్యుని సామూహిక భక్తి సంప్రదాయాన్ని అన్నమయ్య నిలబెట్టాడని, అదేదో ఆదిమ సామూహికోత్సవాలకు ప్రత్యామ్నాయమని రంగనాథాచార్యులసూక్తి. ఇది చాలా పెద్దమాట. తారతమ్య వివక్షమాలిన మాట. అన్నమయ్య బ్రతికివుండగా చైతన్యులు నగర సంకీర్తనం మొదలుపెట్టలేదు. అదే తెలిసివుంటే ఆచార్యులుగారు అన్నమయ్య సంప్రదాయాన్నే చైతన్యులు అనుసరించారని వ్రాసేవారేమో! అన్నమయ్యగారి సంభోగ శృంగార భక్తి పదాలతో నగర సంకీర్తనలూ తిరువీధులూతీస్తే ఎలా వుంటుందో! ఆదిమ సామూహికోత్సవాలకొక అర్థంమాత్రం చూపించగలవేమో ! ఆదిమ సామూహికతకు బదులు ఆ తర్వాత మరే సామూహికతాలేదా? ఉన్నా అది మనకేమీ పనికిరాదా ? ఆదిమ సామూహికోత్సవమేనా మనకి పనికి వచ్చేది? అరగని మార్క్సిజం పేర వీరు ద్రవిడ ప్రాణాయామం చేస్తున్నారు. జనులను మభ్యపెట్టుతున్నారు. అన్నమయ్యమీద మనకెంత మక్కువవున్నా, ఆయన్ను చైతన్య రామానందుల కోవలోబెట్టి మాట్లాడకూడదు. వారికివలె రాజాశ్రయం వైపు చూపుపెట్టనివాడుకాదు అన్నమయ్య. సంకెల తగిలించితే అదేదో ఒక చిన్న రవరవలాగా నేడు సారీ చెప్పినట్టుగా అనాడు సాగిలపడితే లేపదీసి ఆ రాజుగారి కొలువు చిలకే అయిపోవడం ఎక్కడ? చైతన్యుల వరసఎక్కడ? చైతన్యులు దేవాలయ వేశ్యావృత్తిని మాన్పించిన సంస్కర్త. మహారాష్ట్రలోని

జెజూరీలోవున్న ఖండోబా కోవెలలో మురళీలనే పేరుతోవున్న దేవదాసీల వ్యభిచారాన్ని మాన్పించారు మరి అన్నమయ్యగారు వారి ఆటకుతగ్గ పాటలు వ్రాశారు. చైతన్యులు రాధననుకొన్నా వారికీర్తనలువేరు-అన్నమయ్య శృంగార కీర్తనలువేరు.

## కోశాంబి : మన వైష్ణవ మార్క్సిస్టులు

మన భూస్వామ్య విధానం ఎగువ, దిగువ తరహాలని చెప్పే రెండు భిన్నదశలను గడిచిందని, 11 వ శతాబ్దికి ముందు ఎగువ తరహా ఫ్యూడల్ ప్రభుత్వవ్యవస్థ అని, ఆ దరిమిలా దిగువతరహా ఫ్యూడలు ప్రభుత్వవ్యవస్థ అనీ-ఎగువ రకానికి శైవం, దిగువ రకానికి వైష్ణవం తగిన మతాలని, తత్వశాస్త్రాలని సుప్రసిద్ధ మార్క్సిస్టు చరిత్ర పరిశోధకులైన డి.డి.కోశాంబి ప్రతిపాదన ఒకటుంది. 14 వ శతాబ్దినుంచి మనదేశంలో వైష్ణవభక్తి ఉద్యమాలు అధికమైనాయి. ఉత్తరాదిన ముస్లిం పరిపాలనా కాలంలో హిందూ జన సామాన్యంలోను, ప్రాచ్య దక్షిణభారత హిందూ ప్రభుత్వాల మతంగాను వైష్ణవం వ్యాప్తి చెందింది. ఇందుచేత మన వైష్ణవ మార్క్సిస్టులు ఈకోశాంబీ ప్రతిపాదనను తమ జన్మసిద్ధమైన మతానికి అనుకూలంగా వుందని తలచి, ఆ సూత్రాన్ని రామానుజులనుంచి అన్వర్తింపజేసి, భారతదేశభక్తి చరిత్రను సర్వం వైష్ణవ మతచరిత్రగా మార్చి, శైవాన్ని అనభ్యుదయంగా తుడిచివేయడానికి అవకాశం తీసుకోవడం వీరి ప్రయత్నం.

చారిత్రక సత్యాలు నిజంగా అలాగేవుంటే, చరిత్ర కోశాంబీ సూత్రబద్ధమై ఒదుగుతున్నట్టయితే వైష్ణవ ప్రాశస్త్యాన్ని చాటుకొంటే ఆక్షేపింపరాదు. కాని తెలుగునాట భక్తి సాహిత్యంలో యీ సూత్రాన్నిబట్టి వీరు చేయాల్సి వచ్చిన దుష్కార్యం చూడనే చూశాం. వైష్ణవభక్తి సారస్వతంకన్నా రెండువందలేండ్ల ముందు ఆవిర్భవించి ప్రాభవంపొంది ప్రసిద్ధ శివ కవితా యుగాన్నే మటుమాయం చేయవలసి వచ్చింది.

అలాగే దేశ చరిత్రను కోశాంబీ సూత్రంలో యిమిడించాలంటే దానిని కూడా అబద్ధాలతో నింపవలసి వస్తుంది. ఇప్పుడు మన ఆచార్యులు చేసిన ఆ పనినే చూస్తాము.

## చరిత్ర తెలియని రాత

భక్తి-శైవ వైష్ణవాలూ క్రీస్తుకు పూర్వం చాలా కాలంనుంచి వున్నవి గాని ప్ర్యూడలు దశలో సరికొత్తగా మొలకెత్తినట్టివిగావు. ఎగువ దిగువ భూస్వామ్యాలలో ఒకటివుండి ఒకటి లేకపోయిన స్థితిలేదు. ముఖ్యంగా దక్షిణాదిలో జైనబౌద్ధాలను దెబ్బతీసిన పల్లవులకాలంలో శైవనాయనార్లతో పాటు వైష్ణవ ఆళ్వార్లుకూడా ఉద్యమించినవారే. జైనబౌద్ధాలను అణచటానికి, మార్చటానికి శైవవైష్ణవులు ఉభయులకు పల్లవుల కాలంలో సకలస్వేచ్ఛలూ వున్నాయి. పల్లవరాజులందరూ శివపూజా ధురంధరులని వ్రాసిన వ్రాత చరిత్ర ఎరుగని వ్రాత. అలాగే చోళులను గూర్చి వ్రాసిన వ్రాతా తెలియని వ్రాతే. పల్లవరాజుల పేర్లే వైష్ణవ పరమైనవిగా వున్నాయి. సింహవర్మ, కుమార విష్ణువు, విష్ణుగోపుడు, నరసింహవర్మ మొదలైన రాజనామాలే వున్నాయి. విష్ణుగోపుడు మన నెల్లూరి సీమ దాలూరులో విష్ణుదేవాలయ పోషకుడై శాసనమేవేశాడు. శైవులుగావున్న పల్లవు లెవ్వరూ వైష్ణవులను బాధించిన కథనాలు లేవు.

## రామానుజులపలాయనం : చోళులచరిత్ర

రామానుజులను పల్లవులు పారదరిమారని వ్రాసిన వారి చరిత్రజ్ఞానం, రామానుజ జీవిత చరిత్ర పఠనం ఎంతపాటిదని అనుకోవాలి? రామానుజులు చోళకులోత్తుంగుని కాలంలో పారిపోయారు. ఐనా చోళులందరూ శైవులుకారు. కులోత్తుంగుని కొడుకులందరూ యువరాజులుగావుండికూడా, తండ్రి బ్రతికి రారాజుగా వుండగానే వైష్ణవులై వున్నారు. వేంగీ యువరాజులుగా వచ్చి వైష్ణవాన్ని వ్యాపింపజేశారు. వేలకొలది తమిళ వైష్ణవులను రప్పించి తెలుగు దేశంలో అగ్రహారాలిచ్చారు. తమిళ వైష్ణవ రైతులను ఆంధ్రలో దించి వ్యవసాయాన్ని పెంపుచేశారు. వేంగిలోవారి సేనానులు వైష్ణవులు. సేనాని మేడమార్యుడు మన చెల్లూరులో విష్ణుకోవెల కట్టించాడు. అదే కాలంలో మండయ్య అనే వైష్ణవ వైశ్యుడొకరు చాళుక్య భీమవరంలో విష్ణుదేవాలయం నిర్మించి ఆ వూరిని ఆ కులోత్తుంగుని బిరుదనామకంగా చోళనారాయణపురమని పెక్కించాడు. కులోత్తుంగుని బిరుదులే వైష్ణవీయమైనవి. చోళ నారాయణ, రాజనారాయణ బిరుదులాయనకున్నవి. నాణెములమీద బిరుదు చోళనారాయణ

బిరుదే కాని ఆ కులోత్తుంగ శైవ సమ్రాట్టుకే భయపడి రామానుజులు తమిళ దేశం విడిచి కన్నడంలో పాతికేళ్ళ కాలం వెళ్ళబుచ్చారు. కులోత్తుంగుడు మహా విద్వాంసుడు. పండిత చోళుడని కూడా బిరుదున్నవాడు. అట్టివాడు రామానుజులవారిని రాజసభలో శైవులతో వాదనకు ఆహ్వానించాడు. సభా వాదంవల్ల తమకేదో ప్రమాదంకలుగవచ్చని భయపడి కన్నడంచేరుకున్నారు. తన బదులుగా తన శిష్యుడు కూరేశుడు తానే రామానుజుడనని రాజభటులకు. చెప్పి నమ్మించి, రాజసభకు వెళ్ళుటకు అనుమతించి, తాను మాత్రం దొడ్డిదారిన తప్పుకొనిపోయి హొయిసలరాజుల ఆశ్రయం సంపాదించారు. అది రాజ్యస్పర్థలో దొరికిన అవకాశం.

ప్రవక్తల్లో ఎవరూ ఇట్లు శిష్యుణ్ణి తన పేర పంపిన వారులేరు. పండితా రాధ్యుని ప్రవర్తనకు రామానుజుల ప్రవర్తనకు హస్తిమశకాంతరం ఉన్నది. దీనినే రామానుజులవారిని చోళులు పార దరిమారని చరిత్రగా యిస్తున్నారు.

చోళ పాండ్య రాజసభల్లో ఓడిపోతే ఊడిగమో, పన్ను చెల్లింపులో, మతాంతరీకరణమో, తలవదులుకోవటమో పూర్వం సంప్రదాయంగా ఉండేది. తిరుమంగైయాళ్వారే అలాంటి షరతులతో చోళ సభలో బౌద్ధులతో వాదించాడు. అతడు చోళ సేనాని సుమా! శ్రీరంగం కోవెల అధికారి యామునా చార్యులు చోళ సభలో తానోడితే శైవులకు పన్ను చెల్లించుకుంటానని ఒడబడి వాదంచేశాడు. ఆనాటి వైష్ణవసంప్రదాయం అది. రామానుజులా సంప్రదాయానికి తిలోదకాలిచ్చారు.ఇప్పటికింతకన్నా లోతుకు వెళ్ళనక్కరలేదు అవసరం ఐడితే వివేచించవచ్చును.

## శైవ వైష్ణవాలు భూస్వామ్య దశలను సూచిస్తాయా?

కాని రామానుజులు ద్వార సముద్రంలో దాగియున్న పాతికేళ్ళ కాలంలోనూ శ్రీరంగాలయ నిర్వహణను, అచటి నిర్వాహకులై రామానుజానుయాయులను కులోత్తుంగుడు బాధించలేదు. కులోత్తుంగుని తరవాత కొడుకు విక్రమచోళుడు రాజై రామానుజుల్ని రావించి శిష్యుడై పోయాడు. అది మొదలాపైన చోళ సమ్రాట్టులందరూ వైష్ణవులే. చోళ సామ్రాజ్యం శైవ

సామ్రాజ్యంగా గాక, వైష్ణవ సామ్రాజ్యంగా అంతమొందిందని తెలియాలి. అంటే అది కోశాంబి సూత్రీకరణకు గొడ్డలి పెట్టవుతుందని తెలియాలి. వైష్ణవ చోళరాజ్యం తర్వాత 14 వ శతాబ్దంలో హంపీ సామ్రాజ్యం ఒకటిన్నర శతాబ్దంపాటు శైవ సమ్రాట్టుల రాజ్యంగానే తమిళ దేశంమీదికి ప్రాకిందని తెలియాలి. కులోత్తుంగుని కొడుకులనాడు వైష్ణవారాధకమైన వేంగీరాజ్యం వీరమాహేశ్వరులైన రెడ్డిజుల క్రిందికి వెళ్ళింది. రామానుజుల కాలంలోనూ తర్వాత వెంటనే కర్నాటకంలోనూ వీరశైవం విజృంభించింది. హొయిసల రాజును జైనం నుంచి వైష్ణవంలోకి రామానుజులు మార్చారు. కాని అనతి కాలంలో హొయిసలలో కూడా వీరశైవం అల్లుకుపోయింది. రామానుజుల అనంతరం 15 వ శతాబ్ది సగందాకా దక్షిణ భారతంలో శైవం ప్రధాన మతమయింది. కాకతీయ సామ్రాజ్యం జైనమతం నుంచి శైవానికి మళ్ళింది. కొండవీడొక సామ్రాజ్యం కాదు. కడు చిన్నరాజ్యం. అందులో కోరుకొండరెడ్లు, కందుకూరురెడ్లు కొండవీటి రెడ్లలో భాగంగా వుంటూ వైష్ణవంలోకి మారి వున్నారు. ఈ స్థితిలో కోశాంబీ సూత్రీకరణకు చరిత్రఎలా విధేయమైవున్నట్టు? ఆలోచించాలికదా!

హంపీ విజయనగరం సంగమ వంశ పరిసమాప్తివరకూ వీరమాహేశ్వర మయి వుంటే అందాకా అది ఎగువ భూస్వామ్యమై, సాళువ వంశంతో మార్పు ప్రారంభమై, తుళువ కృష్ణరాయల వంశంతో దిగువ భూస్వామ్యంగా పరివర్తనం చెందిందనగలమా? కొండవీడు ఎగువ తరహాదై, కందుకూరు, కోరుకొండలలో దిగువ భూస్వామ్యం తయారైనదనగలమా? శివాజీ రాజ్యం గాని, పీష్వాల రాజ్యంగాని శైవప్రధానమైనవి కాగా అవి ఎగువ భూస్వామ్య వ్యవస్థకు చెందినవని అనగలమా? కోశాంబీ అనగలిగారా?

రామానుజులవారిని రావించి అభిమానించిన నాటినుంచి చోళ సమాజం, చోళ ప్రభుత్వం దిగువ భూస్వామ్యానికి మారిపోయిందని చెప్పగలమా? రామానుజులు శైవంమీదగాని, చోళుల మీదగాని, వారి సామ్రాజ్యతత్వం మీదగాని ధ్వజమెత్తలేదు. వైష్ణవంలోనేమి శైవంలోనేమి ఉభయత్రా విశిష్టా ద్వైతముంది; ద్వైతముంది. కడపటికి వీరశైవంలో, తమిళశైవంలోనువున్న అద్వైతభేదం, శూన్యతత్వంకూడా ఉత్తరభారత వైష్ణవంలోకూడా కనిపించు

తాయి. ఈ తత్వభేదాలు ఎగువ దిగువ భూస్వామ్య వ్యవస్థలోని భేదాలను సూచిస్తవని, నిర్ణయిస్తవని, యింకేమో చేస్తవని చెప్పడం ఉపపత్తిలేని ఉత్తిత్తి మాటలు.

## దాక్షిణాత్య శైవం : గౌడీయ వైష్ణవం

రామానుజుని నాడే 11వ శతాబ్దంలోనే వీరశైవం కర్నాటకంలో అంకురించి వుంది; అల్లుకొంటోంది. శైవ పురాతనులనాటి నుండి కులంమీద పోరు నడుస్తున్నది. మొత్తం కులభేద నిర్మూలనోద్యమంగా బసవన్న నాడు 12వ శతాబ్ది వుత్తరార్థంలో శైవం, విప్లవ జ్వాలాముఖియై విజృంభించింది. పల్నాటి వీర వైష్ణవం దాని అనుకరణ. మల్దేవరాజు పెళ్ళికి వెళ్ళి బసవ కల్యాణంలోని సంస్కరణను కళ్ళారాచూచి తిరిగివచ్చి పల్నాటి రాజకీయాలను బట్టి ఆ సంస్కరణను బ్రహ్మన్న వైష్ణవపరంగా సాగించవలసి వచ్చింది. ఇది మనకు ఆరాధ్యమైనా, కన్నడ వీరశైవం ఇంకా గాఢమైనది, తీవ్రమైనది అనక తప్పదు. శైవంలో బ్రాహ్మణేతరులయొక్క, వృత్తిదార్లయొక్క బడుగుకులాల యొక్క పాత్ర, స్త్రీలపాత్ర తొలుతనుంచీ ఎక్కువే. దాక్షిణాత్య శైవంతో పోల్చితే ఆ విషయంలో వైష్ణవం వెనుకబడే వుంటుందిగాని ముందెక్కడుం టుంది?

దక్షిణాదిన శైవం యిట్టిదని అట్టడుగు కులాలు అందులో ముఖ్యపాత్ర వహించినవని, వృత్తిదార్ల వుద్యమమని కోశాంబికి తెలిసినట్టులేదు. రామానుజ, మధ్వ, చైతన్యుల ఉద్యమాలు చిన్న భూస్వాములపక్షంగా పెద్దభూస్వాముల ప్రయోజనాలకు వ్యతిరేకంగా లేచిన వుద్యమాలని ఆయన వ్రాశారు ఆశ్చర్యంగా వుంది. చేతివృత్తులవారు ఎడమచేతి కులాలుగా శైవమతంలో వున్నవని-వ్యవసాయకులాలు మొత్తం కుడిచేతి కులాలుగా వుండటాన కుడిచేతికులాలకు కాలక్రమాన శ్రీవైష్ణవులనే పేరు వచ్చిందని, భూమిదారీ ప్రయోజనాలకు శ్రీవైష్ణవమూ-వృత్తిదారులకు శైవమూ ప్రాతినిధిత్వం వహించాయని కోశాంబికి తెలిసినట్టులేదు. భారత చరిత్రాధ్యయనానికి పరిచయప్రాయంగా ప్రవేశికగా వ్రాసిన అంత గ్రంథంలో వీరశైవం పేరైనా వారెత్తకపోవడమే దక్షిణాది శైవం సంగతి నాయన పట్టించుకోలేదని తెలుపుతుంది. మాధ్వమతం కుల

వ్యవస్థా కాఠిన్యానికి పేరు. కాని అదేదో దిగువ భూస్వామ్య ప్రయోజనాలకై విలిచిందంటారు కోశాంబి!! ఆ మాటను మించి ఉపపత్తులంటూ వారిచ్చినవారు గారు— ఈ సూత్రీకరణ కోశాంబీ అనాలోచితంగా చేసిన సులభ సూచన.

బౌద్ధ సహజయానీయులను వైష్ణవులుగా మార్చి నిలబెట్టుకోగలిగిన వంగదేశంలో కులభేదము దక్షిణాదిలోవున్నంత కఠినంగా లేదు ఆ విషయంలో గౌడీయవైష్ణవం చెప్పుకోదగివుంది. ఐనప్పటికీ యావద్భారతంలో ఎక్కడా కూడా కర్నాటక వీరశైవంలో లాగా విలోమ వివాహాలను చెప్పి కుల నిర్మూలనకు వైష్ణవం సాహసించిన జాడలేదు.

గౌడీయవైష్ణవం అభ్యుదయమంతమవుతుండగా దాక్షిణాత్య వైష్ణవం రామానుజులనాడున్న కాస్త మంచినీ మరచిపో నారంభించింది. 14వ శతాబ్దం సరికే వెల్లాళ మొదలైన అబ్రాహ్మణులకు దేవాలయంలో యిచ్చిన హక్కులను, ఉద్యోగాలను వూడగొట్టింది. చివరకు తాతాచార్యుల వంశం అచ్యుత రాయలంతటి వైష్ణవ సమ్రాట్టుకు పురచేతితో దీవించసాగింది. శైవులైన అప్పయ్యదీక్షితులవారా అనుచితాన్ని ఖండించటం చరిత్ర ప్రసిద్ధమయింది.

దక్షిణభారతంలో 16వ శతాబ్దం నుంచి శైవం గిడసబారిపోయింది. దానికి కారణాలున్నాయి. అది వేరే ప్రసంగం. శైవంనుంచి ఆరంభమై, ఎదిగి ఎదిగి శైవాన్ని చెరిపేసి, దాని యిరుకుతనాన్ని తానే తెలుసుకొన్నది. శైవ వైష్ణవాది శాఖారేఖల సంకుచితత్వాన్ని ఉత్తరించింది. దానిని మళ్ళీ పాత హరిహరనాథ తత్వంగానో, శివనారాయణ తత్వంగానో కానీయకుండా వ్యవస్థీకృతమైన మతతత్వమో ఇస్లాముగానట్టి మరొక మతతత్వమో కాగూడదని, అవన్నీకూడా శైవవైష్ణవాలవలె పాక్షికములేయని, సర్వమత శాఖలను త్రోసి రాజుచేసి అతి నాగరకము అత్యంత సూక్ష్మము అయిన అత్యున్నత ఆధ్యాత్మికతను మానవతా వాదప్రాయంగా తీర్చనెరిగిన ఒక మహామహుడు ఉద్భవించాడు. అతడే వేమన.

## సంతులు - సూఫీలు - రామానందులు

సంత్ కవుల్లో, సంత్ పద్యమంలో మొదటివారు మహారాష్ట్రులు. 13,

14 శతాబ్దుల్లో జ్ఞానేశ్వర్ నామదేవులతో నూతనోత్తేజం పొంది పండరీపుర విఠలుని ఆరాధించేవార్కరీ ఉద్యమం సంత్‌మార్గం. కర్నాటకంలో వృత్తిదార్ల వీరశైవంవంటి పేదల భక్తిఉద్యమం దాని సమీప ప్రదేశమైన మహారాష్ట్రంలో తలెత్తింది. జ్ఞానేశ్వర్ 1296లోనే చనిపోయాడు వెంటనే నామదేవు వచ్చారు. అప్పటికి రంగనాధాచార్యులు వ్రాసినట్టు రామానందుల ప్రభావం మరాటావార్కరీ సంత్‌లపై వుండేవీల్లేదు. ఎందుకంటే రామానందు లింకా పుట్టలేదు. మరాటాసంత్‌లపై సూఫీ ప్రభావం అప్పటికేకాదు ఆ తర్వాత కూడాలేదు. మరాటాసంత్‌లలో మధురభక్తిచ్ఛాయేలేదు. మనతొలి సూఫీకవి అమీర్ ఖుస్రూయే 14 వ శతాబ్దివాడు. 13 వ శతాబ్దిలో సూఫీ ప్రభావంతో వ్రాసిన హిందూభక్తికవిలేడు. రామానంద్‌లో దాక్షిణాత్యమైన ప్రణయభక్తి వున్నట్టు దాఖలాలెవరూ చూపించినజాడలేదు. అసలొకేవొక్క పదం రామానందునిది – అదీగ్రంథసాహెబులో – దొరికింది. అతనిలో సూఫీ తత్వం ఏవిధంగా వుందో చూపినవారెవరు? ఇప్పటికీ రామానందీశాఖ– బైరాగిశాఖగా బ్రతికేవుంది. అందులో ప్రణయభక్తిలేదు. తమ దక్షిణాది వైష్ణవం పాత్రను పెద్దదిగా చెప్పాలని వైష్ణవ జన్మవ్యామోహం చరిత్ర వరసను తప్పిస్తున్నది. మరాటాసంత్ పథంపైనున్న ప్రభావం నాథపంథాది.

వైష్ణవం పిదప అలాగే వీరిలోవున్న మార్క్సిస్టు వ్యామోహంకూడా చరిత్రను తారుమారు చేయిస్తున్నది. 13, 14 శతాబ్దాల్లో ఆర్థిక సామాజిక రంగాల్లోని అశాంతి పరిస్థితులట! అది పేదలకు బహుకష్టకాలమైవారికి ఊరటగా మరాటానుండి పంజాబుదాకా సంత్ వుద్యమవ్యాప్తికి కారణమయిందట! అని మార్క్సియ పడికట్టు పదజాలం ప్రయోగించారు వీరు.

మహారాష్ట్రలో సంత్ పంథా అశాంతి పుట్టలేదు. ఆ మాటకొస్తే నాయనార్, ఆళ్వార్ వీరశైవ, మహానుభావ, వార్కరీ భక్తిపంథాలేవీ వృత్తిదార్ల పరిస్థితుల్లో ఏర్పడిన ఒడుదుడుకులవల్ల తలెత్తి అల్లుకున్నవికావు. మహారాష్ట్రను గూర్చి ఒకమార్క్సిస్టు విశ్లేషణ యిలావుంది.

In Maharashtra the movement of the saints was in the main a religious movement. This movement extended very

quickly among the peasants and among the Karunaru, the artisan class And this was not because this class of alutebalutedars was the most exploited class or because it was in the thirteenth century a new or rising class like the merchant class in Europe. The reason for the prominent participation of this class in the religious movement is to be found not in any oppression which it suffered, but in the security and leisure it enjoyed. The annual income of this class was small but fixed. So, after completing the specific tasks assigned to it, this class had plenty of free time, Therefore, it readily became one with the movement.

(The Saint Poets of Maharashtra—Prof. G. B. Sardar)

"గ్రామాధికారులు, భూస్వాములు ... వృత్తికారులపైన ప్రత్యక్షమైన పెత్తనం చెలాయిస్తోంటే వారికి వ్యతిరేకంగా.... భక్తిని ఆలంబనం చేసుకుని.... సంస్కరణ వేపుగా జనాన్ని కూడగట్టడానికి ప్రారంభించిన వుద్యమాలు" అంటూ రంగనాధాచార్యులవారు వ్రాసిన మహారాష్ట్రుల తొలిసంత్ వుద్యమానికి వర్తించదని పై గ్రంధం చెప్పుతున్నది. ఆ తర్వాత అసలే వర్తించే వీలులేదు. తురకలు పరిపాలకులైన తర్వాత హిందువులైన గ్రామాధికారులు భూస్వాములు వృత్తికారులపైన పూర్వం మాదిరిగా అణచిపెట్టే అవకాశాలు పోయినై. అదేమంటే చాలు, వృత్తిదార్లూ అంటరానివారూ తురకలై పోతారు, ఎదురుతిరిగి బెదరించగలుగుతారు.

"మహారాష్ట్రలో ఫ్యూడలిజం వున్నది. అది యూరపియన్ ఫ్యూడలిజం వంటిదికాదు....మహారాష్ట్ర రైతులు తమ పంటభూమికి తామే యజమానులు. ప్రకృతిలోనే వారి ముఖ్యమైన పోరాటం... స్థానిక పాలకుడు అతిబలవంతుడు. కాని సంప్రదాయానికి తలవంచేవాడే, పాటిల్ ఊరికిరాజే, కాని గ్రామ పంచాయతికి కట్టుబడి నడిచేవాడే. పన్నెండుకులాల చేతివృత్తిదారులు (బలుతేదార్లు) గ్రామపంచాయతీ వ్యవస్థకు బద్ధులే. కాని వీలైనప్పుడెల్ల బలుతేదార్లు రైతులను పీడించడానికి వెనుకాడేవారుకాదు. మహారాష్ట్రలో బ్రాహ్మణభూస్వామ్యం లేదు. మహారాష్ట్రలో పీష్వాలపరిపాలన ఏర్పడేవరకైనా బ్రాహ్మణులు భౌతి

కాధికారం కలిగిన వాళ్ళుకాదు. జనులను దోపిడీచేయడానికి కావలసిన ఆర్థికాధికారం వారికిలేదు. బ్రాహ్మణ్యంయొక్క బలం ప్రజల మూఢ విశ్వాసాలే. (The Saint Poets of Maharashtra - Prof B.G. Sardar)

## వృత్తిదార్ల - అభ్యుదయంలో భక్తి వెల్లువ

మహారాష్ట్రంలో లాగానే కన్నడ వీరశైవోద్యమ కాలంలో కూడా చేతివృత్తిదార్ల ఆర్థికపరిస్థితి బాగున్నది. వారికి తగినంత స్వేచ్ఛ వున్నట్టుగా వీరశైవ సారస్వతంవల్లే తెలుస్తున్నది. అక్కడా ఆర్థికాభ్యుదయం అనుభవించే చేతివృత్తులవాళ్ళు, దిగువ కులాలనిపించుకున్నవాళ్ళు ఆధ్యాత్మిక సాంస్కృతిక రంగంలోకూడా తదభివ్యక్తికీ గణ్యతకూ ప్రయత్నించినట్టు భావించాల్సి వస్తున్నది. సంత్ వుద్యమాలేమీ, వీరశైవమేమీ అడుగు బడుగుకులాల, వృత్తిదార్ల జీవన పరిస్థితులు దుర్భరమైనప్పుడు లేచినట్టివిగాకన్నా, అందుకు విరుద్ధంగా వారి పరిస్థితులు ఆర్థికంగా మెరుగై సంఘంలో నిలదొక్కుకుంటున్న పరిస్థితులు-విశ్రాంతి ఆధారంగా తలెత్తినవని చారిత్రక పరిశీలన తెల్పుతున్నది. ఇక్కడ ఆంధ్రదేశంలో వీరబ్రహ్మంగారి సంగతినే చూడదగును.

## చేతివృత్తుల ఉన్నతి - వీరబ్రహ్మ నేపథ్యం

ఆయన నేపథ్యమైన 17వ శతాబ్దం చేతివృత్తుల వాళ్ళకు చాలా చాలా మంచికాలం. చేతి పరిశ్రమలే పరిశ్రమగావున్న ఆనాటి ప్రపంచంలో మొగల్ ఇండియా, (గోల్కొండ రాజ్యంతోసహా) ప్రపంచ కర్మాగారంగా పేరొందింది. నూరేళ్ళపైగా వుంటున్న పోర్చుగీసువారిని చూచి డచ్చి యింగ్లీషు ఫ్రెంచి వాళ్ళు మన సరుకులపై పోటీలుపడి పెచ్చు ధరలుపెట్టి కొనవలసిన కాలం అది. ఇంగ్లీషువాళ్ళు చెన్నపట్నం కౌలు సంపాదించేసరికే (1642) ఆ శతాబ్దం సగం గడచిపోయింది.

హిందూ రాజ్యాలంతరించి దేవాలయ ధ్వంసం జరిగిపోగా, తురకల పాలన రాయలసీమ మీదికి ప్రాకేకొలదీ కాసెపని (విగ్రహాలు చెక్కేపని) మాత్రం దెబ్బతింటున్నప్పటికీ, పంచాణం వారిలో తక్కిన నాలుగు వృత్తులకు

చాలా గిరాకీ ఏర్పడింది. డచ్చి, యింగ్లీషువాళ్ళు యిక్కడే ఓడల నిర్మాణానికి పూనుకోవడంతో వడ్రంగానికి ఎప్పుడూలేని గిరాకీ ఏర్పడింది. డమాస్కస్ కత్తుల తయారీకి కావలసినట్టి జాతి యినుము కొనుగోలు పెరిగి మన కమ్మరి కొలుములకు యినుం తయారీపని దండిగా పెరిగింది. కొయ్య ఓడల తయారీలో మేకుల ఉత్పత్తి ఒక పెద్దపని అయింది. ఈస్టిండియానుంచి, బెంగాలునుంచి తెల్ల వాళ్ళ వలన రాగి, టిన్ను దిగుమతై లోహపాత్రల ఉత్పత్తి, కంచరం, మాట్లూ కళాయిలు పెరిగినై. మనబట్టకూ, కలంకారీ అద్దకానికి, నీలిమందుకు అమ్మకం పెరిగి నేతవారి పని మెరుగవడమేకాక, ఆ బట్టలకు యితర సరుకులకు తెల్ల వాళ్లు మనకు అమ్మే సరుకులవల్ల గడించిన సొమ్ముచాలక తమవెండి, బంగారు నాణెములు కుమ్మరించి కొనుక్కోవాల్సి వచ్చి విదేశీ వెండి, బంగారాలు దిగి దేశంలో స్వర్ణకార వృత్తికి గిరాకీ పెరిగింది. వీరబ్రహ్మం నివసించిన ప్రదేశం గండికోట రాజ్యంలోనిది. ఆ రాజ్యం వజ్రాలకు అప్పట్లో మంచి ప్రసిద్ధి. మీర్జుమ్లా, 1648లో దండయాత్రకు వజ్రాలొక కారణం. గండికోటను స్వాధీనం చేసుకొన్న మీర్జుమ్లా, యితర నవాబులు వజ్రాల పనిమీద కేంద్రీక రించారు. సర్కారు జిల్లాలలోకూడా వజ్రాల గనులు బాగా లేచినై, ఫలితంగా ఆ పనికి గిరాకీ పెరిగింది. అలా చేతివృత్తులవాళ్లు బలం పుంజుకున్నారు. సిద్ధయ్య తన దిన సంపాదనలో సగం వీరబ్రహ్మానికి దిన దక్షిణ యిచ్చు కొంటూనే తన సంసారం గడుపుకోగలిగిన నేత వృత్తివాడన్న సంగతే ఆనాటి వృత్తుల సమాచారానికి నిదర్శనం.

ఇలా భక్తి ఉద్యమాలను చేతి వృత్తివార్ల దుస్థితితో, దారిద్ర్యంతో, పరాధీనతో ముడిపెట్టి మాట్లాడుతుంటే, ఆ భక్తీ ఉద్యమాల కాలమైన 11, 12 వ శతాబ్దాలనుండి చేతివృత్తులవారి పరిస్థితులు దక్షిణ భారతంలోగాని, ఉత్తర భారతంలోగాని క్రమికాభ్యుదయం చెందినవేగాని తీసికట్టు కాలేదని చరిత్రను వివరించాల్సి వుంది.

దక్షిణ దేశంలో బ్రాహ్మణేతర కులాలు కుడి-ఎడమ కులాలుగా ఒక విభజనకు గురై వున్నాయి. కమ్మరి, కంసాలి, వడ్రంగి, శిల్పి వృత్తులవారు పంచాణం వారుగా పేరొంది మరికొన్ని చేతివృత్తులవారిని కలుపుకొని ఎడమ

లుగా పులా పేరొందాయి. వ్యవసాయదారులు, వ్యవసాయాధార వృత్తులవారూ కుడి కులాలుగా పేరొందారు పైపంచవృత్తులవాళ్ళు తప్ప తక్కిన చేతి వృత్తులవాళ్ళు అందరూ ఎడమకులంగా లేరు. నేతవృత్తిలో దేవాంగులు తప్ప తక్కిన కులాలు, కుమ్మరులు వగైరా కులాలు కుడి కులాల్లోనేవున్నారు. ఈ విభాగంలో 11వ శతాబ్దంనుంచీ ఎడమచేతి కులాలు తమిళ, కన్నడ, ఆంధ్ర దేశాల్లోనే దానశాసనాలు, కులకట్టడి శాసనాలు వేయించుకోగలిగి దేవాలయా లను కట్టించగలిగి సైన్యాలను ఏర్పరచుకోగలిగి (ఇడంగై మాసేనై, ఇడంగై వేళక్కారర్) వీరపంచాణం అనగలవై, రాజసేనలో ప్రత్యేక విభాగంగా నిల బడగలిగి రాజులచేత పన్నులరద్దు శాసనాలు రాబట్టగలిగి, కుడిచేతి కులా లతోపాటు సమగౌరవ ప్రతిపత్తిని, గౌరవ చిహ్నాలనుపయోగించుకొనే హక్కు లను పొందుతూ రాజశాసనాలు పొందుతున్నస్థితి అధికాధికంగా వ్యక్తమై హంపీరాజ్య కాలంలో బాగా వర్ధిల్లినట్టు చారిత్రకాధారాలు దండిగా వున్నవని అర్థం చేసుకోవలసి వున్నది. ఉత్తరాదిలో చేవృత్తులవారు, హరిజనులు ఇస్లాంలోచేరి తమ జీవన పరిస్థితులనేగాక సాంఘిక హెూదానుకూడా మెరుగు పరచుకొన్నారు. భారత సమాజంకూడా చేతిపరిశ్రమల క్రమవికాసాన్ని సాధించుకొంటూ మొగల్ ఇండియా అనిపించుకొన్న అప్పట్లో ప్రపంచ కర్మా గారంగా తెల్లజాతులచే ఎన్నికచేయబడి వుందని గ్రహించాలి. పారిశ్రామిక విప్లవంవరకూ భారతీయ చేతిపరిశ్రమల క్రమ వికాసం సాగి, వృత్తిదార్లజీవన పరిస్థితులు ఉత్తరోత్తరాభివృద్ధిని పొందివున్నవి. అట్టి అవగాహనతో ఇక్కడ ఆంధ్రదేశంలో వీరబ్రహ్మంగారి సంగతిని, శ్రామిక జనుల సమైక్య శంఖంగా, వారినైరాశ్యాన్ని ధ్వనించి, వారి వీరకాహళిని మ్రోయించినవాడని పొరపాటు సూత్రించిన సందర్భంలో పరిశీలించవలసి వున్నది.

## వీరబ్రహ్మం నాడు బాపలు రైతులు

1565 లో రాక్షసితంగడితో వెనుకమొగమైన హిందూరాజ్యాధికారం 17 వ శతాబ్ది సగానికి, మరికొన్ని సంవత్సరాలకూ మొత్తం హరించుకు పోయింది. గోల్కొండ, బీజపూరువార్ల ఎడతెగని దాడులలో జలవనరుల మర మ్మత్తులు పట్టించుకొనే దిక్కులేక వ్యవసాయవృత్తి సర్వేసర్వత్ర దెబ్బతిన్నది.

కరువు కాటకాలు మొదలయ్యాయి. హిందూ సైన్యాలనుంచి యిళ్ళకు చేరుకున్న సైనికులతో వ్యవసాయంమీద వొత్తిడి ఎక్కువయింది. నిన్నటివరకూ పాలక కులాలుగావున్న శూద్రకులాల గ్రామాధికారం సడలిపోసాగింది. రైతుకులాల స్వాస్థ్యం అడుగుబట్టింది. "మొరసు, కమ్మ రాచవారు కొంచెపడిపోయ్యేరు" "శూద్రకులమెల్లా నిర్మూలంచేస్తిమి" అని వీరగురుని కాలజ్ఞాన వచనాలున్నవి.

కర్నూలు కడప గుర్రంకొండ సిద్ధవటం పొదిలె బనగానపల్లెవంటి తావు లన్నింటా నవాబులు నెలకొన్నారు. బ్రాహ్మణులకుగల రాజపోషణ రాజరక్షణ లేకుండాపోయింది. ఇలా చేతివృత్తులకు మంచికాలం, వ్యవసాయా నికి గడ్డుకాలం, హిందూశూద్ర-బ్రాహ్మణాధికారాలు పట్టుసడలేకాలం అయిన ఈ 17 వ శతాబ్ది మధ్యంనుంచి రూపేర్పరచుకొంటున్న వీరబ్రహ్మంగారి చారిత్రక నేపథ్యచిత్రం యిలావుంది.

## అవురంగశాహి రామావతారం :

"అవురంగశాహి రామావతారం, పిండారీ మరాటీ దండుకోతిపిండు మొగలాయీ గుర్రం రామేశ్వరమంటేనీ" అనే కాలజ్ఞానం చెప్పిన వీరబ్రహ్మం గారి వైఖరి తెలుస్తున్నదికదా! తురకలలో చేరిపోయిన దూదేకుల సిద్ధయ్యను శిష్యునిగా చేరదీసి, అతనిద్వారా సిద్ధవటం, కడప, కర్నూలు, బనగానపల్లె, గోల్కొండ నవాబులను కలిసి, కొత్తతురక రాచరికంతో సంబంధాలు ఏర్ప రచుకొన్నారు. సిద్ధవటం నవాబుచేత కందిమల్లయపల్లె భూమిపొంది, ఇల్లుకట్టి యింటి చావడిలో కొయ్య సింహాసనంమీద భార్యతో కొలువు కూర్చుండి సొంతంగా మత పీఠాన్ని, నెలకొల్పినట్లు ప్రకటించారు. వీరబ్రహ్మంగారు బనగానపల్లె నేల మంతంనుండి కందిమల్లయ్యపల్లెకు ప్రమోషను పొందారు.

## పుష్పగిరిపీఠం వీరబ్రహ్మం

తురకల దొరతన మేర్పడినకాలంలో కంసాలి వీరప్పయ్య వీరబ్రహ్మమై పీఠం నెలకొల్పిన కొద్దికాలానికి,అనగా 1665లో, బ్రహ్మంగారి పీఠానికి అనతి

చూరంలోగల పుష్పగిరి గ్రామంలో బ్రాహ్మణ్యం పూనుకొని క్రొత్తగా శంకర పీఠం వొకటి స్థాపించింది. (దాని తొలిపీఠాధిపతి విద్యాభినవ శంకరభారతులు 28 ఏళ్ళు 1693 వరకు వున్నారు.) కంసాలిపీఠం ఏర్పరచిన దృష్ట్యా అది పోటీలో ఏర్పడిందేమో అనిపించుతున్నది. అలాగే వీరబ్రహ్మం ఆ వూరి మీదగానే, బహుశా ఆ పీఠం ముందుగానే గుఱ్ఱంమీద వెళ్ళడం, దానిని ఆ బ్రాహ్మణ్యం ఆటకాయించడం, ఆ గుఱ్ఱంమీద బ్రహ్మంగారు అగ్ని మహిమ చూపించి భయపెట్టి, బ్రహ్మరథం పట్టించుకోవటంతో పుష్పగిరి పీఠానికి గర్వభంగం, గౌరవభంగం జరిగింది. కాగా బ్రాహ్మణేతరుల దృష్టిలో అదొక గొప్ప విజయంగా, గర్వకారణంగా చూపట్టి జనసామాన్యం అయినను గుర్తించడానికి ఎంతో గొప్పగా తోడ్పడింది. కాని ఇటువంటిపని హిందూ రాజ్యాలకాలంలో జరిగివుండేవీలులేదుగదా! అదిఆయనలో ఉద్ధతిని ధార్ష్ట్యాన్ని పెంచివేసింది. "నేనే బ్రహ్మము నరుడానేనే బ్రహ్మమురా" "పోతులూరి వీర భోగవసంతరాయలు ఏడుదీవుల ఏకచక్రమునేలు బ్రహ్మాండమంతా" అనిపాటలు గట్టి చాటసాగాడు పామరజనులు నమ్మసాగారు కూడానేమో! కనీసం ఆ ప్రాంతంలోనైనా నమ్మియుంటారు. మతమూ తెలియునట్టి మాయాగుంపులబట్టి మానుమానుకు వేల గట్టింతురా....నడివీధినా కొలిమి నాటింతురా - కాల్పింతురా - బాకులకుమ్మింతురా....అంటూ భయంకరగానం జేశాడు. వీరశైవంలో శివనిందచేస్తే తలదీయవలసిందిగా వ్రాశారు-చేశారు. వీరబ్రహ్మం గారి మతాన్ని వినకున్నంతమాత్రానికే ఏమేమో చేస్తాను. చేయిస్తానన్నాడు.

## వీరబ్రహ్మం ప్రత్యేకత :

అఖిలభారత భక్తకవుల చరిత్రలో ఎట్టి అట్టడుగు బడుగుకులంనుంచీ, పంచములనిపించుకొన్న వారినుంచీ వచ్చిన ఏ భక్తిపరుడు ఏ యోగివరుడు యిలా తానే కల్కి అవతారాన్నని, 11వ అవతారాన్ననీ, తన్ననుసరించని వారిని కోయిస్తానని కొరతన వేయిస్తాననీ జడిపిస్తూ వ్రాసిన జాడలేదు. ఎక్కడో ఎందుకు? తెలుగులోనే తత్వకవులంటున్న వారెవ్వరూ, వారెంత చేతివృత్తుల వారైనా ఇలాంటి ధోరణిలో తత్వాలు వ్రాయలేదు. వారెంతో సాత్వికంగా వ్రాశారు. వీరబ్రహ్మాన్ని యీ భయానకరస పోషణలో ఎవ్వరూ అనుకరించ లేదు. అట్టి తామసిక రాజసికడాంబిక దాంభికతలకు పాల్పడలేదు. గీతలోని

అవతారవాదాన్నీ, భాగవతకల్కినీ ఈ దారి తొక్కించిన వారింకొకరు లేరు. అఖిలభారత భక్తి ఉద్యమంలో వీరబ్రహ్మం ఒక అపవాదం (Exception) అనిపించుతాడుగాని మన రంగనాథాచార్యులవారు పట్టికవేసిన సగటుభక్తి లక్షణాలేమీ కలిగినట్టు కనిపించడు. బ్రాహ్మణ్యంతో పంచాననం వారికిగల సర్వతోముఖ స్పర్థయే నేపథ్యంగా వీరబ్రహ్మంగారి కృతయుగ ధర్మస్వరూపం, వారిబోధలు వెలువడ్డాయనిపించుతుందిగాని వృత్తికారుల క్షుభిత జీవనపరిస్థితుల నుంచి, వారినిస్త్రాణ నిస్పృహాయతలనుంచి భక్తిఉద్యమాలు వెల్లివొడిచాయని ఈ ఆచార్యులవారు సెలవిచ్చిన అఖిలభారత సులభచిత్రం వీరబ్రహ్మానికి వర్తించినా వర్తించకపోయినా వారి ఆర్థికబాధ విషయంగా మచ్చుకొకముక్క అయినా ఆయనలో దొరకటంలేదు. ఇది ఆలోచనీయం కదా !

"మాలమాదిగెలు కోయలు బోయలు అధిక సంపన్నులయ్యేరు. ఆచార వంతులయ్యేరు. కులజులమనేరు. వారిని బ్రాహ్మలు కొలిచేని. వారువీరు ఏక భోజనంచేతురు. గండికోటయందు అత్యంతవర్ణాలవారూ ఒక బావిలో పానాలు చేతురు. వర్ణాశ్రమ ధర్మంబులు నష్టం పొందును. గురుదేవ బ్రాహ్మణ దూష ణంబులు పుట్టీని...." అన్నది బ్రహ్మంగారి కాలజ్ఞానం. అదంతా ఘోరకలి, ధర్మభ్రష్టత అని ఆయనబాధ. ఆ దుష్కలినిబాపి కృతయుగాన్ని తన నమూనా చాతుర్వర్ణ్యాన్ని వీరభోగవసంతరాయులుగా స్థాపిస్తానని చాటుకొన్నాడు.

## వీరభోగ వసంతరాయలి కుల ప్రణాళిక :

"మా భక్తులైన బ్రాహ్మణులు సుఖానవుండేరు. మా పంచాణంవారు సుఖానవుండేరు. (అక్కడకది బ్రాహ్మణ-వీరబ్రాహ్మణ సామ్యాలేక ఏకీకరణ). క్షత్రియులు వేరేకదా, మాముత్తరాచవారిని (క్షత్రియులుగా) నిలిపేము. కోమట్లు వేరేకదా బేరికోమట్లను (వైశ్యులుగా నిలిపేము). శూద్రులు వేరేకదా, తెలుగుబలిజవారిని నిలిపేము. [కాలజ్ఞానం, 6 వ ఆశ్వాసం, చివరిభాగం]

సకలకులాలకు ఏకపాత్రభుక్తులు చెప్పిన వేమనగారి తర్వాత – 17 వ శతాబ్ది చివర వీరబ్రహ్మంగారిచ్చిన కృతయుగధర్మ ప్రణాళికా సంరూపం యిలా వుంది. ఇదొక సెలెక్టివ్ చాతుర్వర్ణ్య చట్టం. ఆయన లక్షించిన పలువర్ణాల ఐక్య

సంఘటన అది. పంచములకిందులో చోటులేదు. మాలలెలాగూ కుడిచేతి కులంవారే. ఎడమచేతి కులమైన మాదిగ కక్కయ్య కులానికైనా ఇందులో చోటుచేయలేదు. కక్కయ్య సమాధికక్కడ పూజలేదంటున్నారు.

ఇందులో కనిపించే ముఖ్యాంశం ఒక్కటుంది. బ్రాహ్మణ–విశ్వబ్రాహ్మణ కుల సమానతాసాధన. మా భక్తులైన బ్రాహ్మణులు సుఖానవుండేరు అనటంతో పాటు "వీరప్పయ్యమీద లోకాలకెల్లా యేలేటందుకు కర్త అన్నాజికి తన కుమార్తెనిచ్చి అందుకు దేశరాజ్యమెల్లా యిచ్చినాడు" - అని కూడా ఒక వాక్యముంది.

ఇదేమిటో ఆలోచించవలసిన సంగతిగా వుంది. బ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని అన్నాజి చేతిలోనే పెట్టాడు. అందులోనే ఈ వివాహ ప్రతిపాదన వుంది. 1974లో అమరాకృష్ణమూర్తి, తుమాటి రంగయ్య & కంపెనీ (ఉప్పుగుండూరు) వారు ముద్రణకర్తలుగా కందిమల్లయ్యపల్లె బ్రహ్మంగారి మఠంవారి ప్రచురణగావున్న కాలజ్ఞానము ఆధారంగా ఈ విషయాలు గ్రహించబడింది.

## ఇకనేమైనా అనుకోవచ్చు

ఇక దీనినిబట్టి ఒక పరిశోధక వ్యాసకర్త వ్రాసినట్టుగా బ్రహ్మంగారిది చేవృత్తుల కులాల ఏకీకరణ ప్రణాళికేనంటామా? వృత్తేకులమన్నాడని వ్రాసి ఒక వృత్తిలోగల పలుకులాలను రద్దుచేయదలచాడనే అంటామా? ఎడమచేతి కులాలను ఏకం కమ్మన్నాడంటామా? బ్రాహ్మణులకు వ్యతిరేకంగా కుడిఎడమ కులాలన్నింటియొక్క–రైతాంగ, చేవృత్తిదారీ కులాల ఐక్యసంఘటనా ప్రణాళికే నంటామా? ఆ పైన ఇటీవలి చరిత్రలోని బ్రాహ్మణేతరోద్యమ బీజరూపమే నంటామా? సకలకుల సమానతా సమీకరణమేనంటామా? కార్మికవర్గకులంలో జన్మించినందువేత సహజంగా వారిలోనుండే కనీసపు దిశానిర్దేశమంటే ఇదే నంటామా? 17వ శతాబ్ది గత ఆంధ్రదేశంలో, రాయలసీమలో చేతివృత్తుల వారి క్షుభిత కల్లోలిత జీవిత పరిస్థితులలో అలముకొన్న బృహన్నైరాశ్య నేపథ్యంనుంచి దాని నివారణకై పూరటకై, ఆత్మగౌరవ రక్షణకై వెలువడిన

భవిష్యవాదం, ఆశావాదమేనంటామా? రంగనాథాచార్య విధేయులు ఇంకా ఏమేమి అన్నారో అదంతా విచార సహమోకాదో పాఠకలోకం తేల్చుకోవచ్చను కుంటాను.

## వేమన - రాళ్ళపల్లి, వైష్ణవ మార్క్సిస్టులు

సర్వమత ఖండనం ప్రచండంగా చేసిన వేమనలో శైవేతరమత ఖండనం మాత్రమే కనిపించిందట! మతమును మఠములను – మఠములోనున్న మతములను కోయుము, మతము మమతజిక్కి మరిదేహమున్నది అంటూ పరి పరి విధాలుగా వ్యవస్థీకృతమైన మతాన్ని సమూల నిరసన చేసినపద్యాలు కోకొల్లగా వుంటే కానరాలేదు. మతసమానత్వమునుండి మతరాహిత్యానికని శీర్షికలుంచి త్రిపురనేని తన రచనలో వివరించగా అది వీరికి కానరాలేదు. రాళ్ళపల్లికి కానవచ్చిన వేమన శైవమత నిరసన, శివనిరసన, విష్ణునాధిక్యోద్ఘాటన వీరికి మాత్రం కానరాలేదు. దానితో వేమన వీరశైవుడు మాత్రముకాదని రాళ్ళపల్లి వాదన చేయటం వీరికి అగపడలేదు. "వేమన శైవప్రపంచంలో పుట్టి పెరిగినవాడేకాని కడకు త్రిమూర్తులను త్రోసిరాజని శుద్ధాద్వైతిగా మారినాడు" "హరిహరాజులందు ఆనవిడిచి" నవాడు – మూడుకనులవాని మొనసి నిల్చినవాడు" అని చెప్పుకొన్నవాడు వేమనయని రాళ్ళపల్లి తమ్మయ్య గారితో వాదించడం ప్రసిద్ధ విషయం.

"విష్ణువుకన్న శివుడు గొప్పవాడని వాదించు శైవులతో నొకమారు విష్ణుపక్షము వహించి అతడిట్లు వాదించెను" అని యీ పద్యం చూపించారు రాళ్ళపల్లి.

> కొడుకును బ్రతికించుకొనలేదు శంభుడు, కొడుకును బ్రతికించుకొనడె శౌరి
> దేవతాంతరములు దీననే కనిపించె....

వేమన "శైవుడై పుట్టినందుకు అందరికిని (బ్రహ్మ విష్ణువులకు) అగువరకు శివునకు శిక్షనీయలేదు. అంతే గౌరవముగా పరమేశ్వరుడు సంతోషింపవలసినది" అని– "బ్రహ్మ జంపి విష్ణుభాగంబులోగల్పి, విష్ణుజంపి శివుని వెలయగలపి, శివుని జంపితాను శివయోగివలె" నన్న పద్యముపై చమత్కరించుతూ

వేమన శివుని జనకుటుకు వెనుదీయనివానిగా - వృషభాంకునకు సొడ్డువేసిన వానిగా చెప్పి చూపించారు. రాళ్ళపల్లికి కనిపించిన యీపద్యాలు, రాళ్ళపల్లి చేసిన యీ వాదన వీరు కానకుండానే తమ గ్రంథం వ్రాశారనుకోవచ్చునా ? అసలు అలా కానకుండా వ్రాయవచ్చునా, వ్రాస్తే అది పరిశోధన అవుతుందా? "నీచకులజు"లపై చిన్నచూపు, బ్రాహ్మణదాన ప్రశస్తిగల పద్యాలు కనిపించిన వీరికళ్ళకు విష్ణుస్తుతి పద్యాలు కనిపించలేదు?

లింగధారికన్న దొంగలు లేరయా, బసవ భక్తులెల్ల పాపులు తలపోయ వంటి పంక్తులతో ఆ మతస్థుల ఆచరణను విమర్శించటమున్నది. "ప్రాణి కోటులెల్ల పరగ వైష్ణవులయా" అనటమున్నది. వాదమేల మత విభేదమేల అని శైవష్ణవుల నిద్దరినీ మందలించిన ప్రసిద్ధ పద్యమున్నది. శ్రీమూర్తులను వైన వైనాలుగా వెక్కిరించిన పద్యాలున్నవి. ఇవేమీ వారు చూడలేదనుకో వాలా? వీటన్నింటినీ చూచినప్పటికీ కావాలని కల్లవ్రాతలకు తలపడ్డారను కోవాలా? అవన్నీ వేమనవి కావంటారా? ఇందులో వారేద అనుకోమంటే అదే అనుకొందాముగాని ఏదనుకొన్నా అది తప్పే కదా!

విజయనగర రాజ్యం అంతరించే దశలో వైష్ణవం చాలా భ్రష్టు పట్టిం దని, "వేమన కాలమునకు వైష్ణవ ప్రాబల్యము పరమార్థ దృష్టిలేక కేవలము వేషము క్రిందికి దిగినట్లున్నది. (ఆ) మతముపేర నెన్నియో అకార్యములు చేయుచుండిరి" అంటూ ఉదాహరించి పై దురవస్థ పదునేడవ శతాబ్దమందే కలిగియుండవచ్చును అని రాళ్ళపల్లి వేమన కాలము వైష్ణవ మత దురవస్థా కాలమైన 17 వ శతాబ్దమన్నారు. వేమన వైష్ణవ మత విమర్శను రాళ్ళపల్లి వంటి నైష్ఠిక వైష్ణవులు ఇలా గ్రహించి వుండగా, కులమత అభిమానములను జయించినట్లో మార్క్సిస్టులుగానో చెలామణిలోవున్న రంగనాథ రాఘవాచార్య వర్యాదులు వేమనపై దురద్యమ కర్తలయ్యారు.

"భక్తకవిగా తత్వకవిగాకాక యోగిగా వేమన ప్రచారంలోవున్నాడని" ఎప్పుడు మొదలు పెట్టారో అప్పుడే ఆచార్య వర్యుల సదుద్దేశ పరిమళం గుబా ళింపు తగులుతుంది. "నీచ కులజులమీద చిన్నచూపు"వేమనకున్నదనగానే వేమన మాట. తర్వాతగాని, నేడుకూడా కులాల విషయంలో నీచ శబ్ద

ప్రయోగం మానుకోలేని ఈ ఆచార్యులకే అట్టి చిన్నచూపున్నదని తార్కా ణించుకొంటున్నారని అనవలసి వస్తోంది. ఈ కాలంలో కూడా నీచకులాలని వ్రాసే అలవాటు మానుకోలేని వీరు, "హీన కులజునైన యిట్టె రమ్మందురో" ధనవంతుడై కానవస్తేచాలు అలా చేస్తారని ధన మహిమను చెప్పిన వేమనకు కులభేదపు చూపు చావలేదనటం ఎంత అనుచితము! ప్రమాణాలుతప్పి చేసిన రంధ్రాన్వేషణా పరాయణబుద్ధి ఈ ఆరోపణలో వుంది.

బసవన్న కులాహంకారాన్ని చంపుకొన్నంతగా కుల రాహిత్య దృష్టి నందు కొన్నంతగా వేమన అందుకోలేదని వీరి మరొక పలుకు. బసవేశ్వరుడు కులరాహిత్యాన్నందుకొన్నమాట ఎంత తిరుగులేనిదో వేమన కులరాహిత్య బుద్ధివర్తనలమాటకూడ అంతే తిరుగులేనిసత్యం. వారిద్దరిమధ్య ఆవిషయంలో తరతమ వివక్షకు అవకాశంలేదు. శూద్రుడై వేమన చేసినకన్న బ్రాహ్మణుడై బసవన చేయడం గొప్ప అనేమాట లేకపోతే, (అది జన్మ భేదం) యింకేమైనా భేదమెంచే అవకాశమంటూ వుంటే వేమన అతివాదుల్లో అతివాదిగా తేలుతాడు. బసవన్నగాని యితర శివశరణులుగాని కుల నిర్మూలనకై చెప్పని చెయ్యని ఏకపాత్ర భుక్తి–ఎంగిలి తిండి సిద్ధాంతాన్ని వేమన చెప్పి చేశాడు. కుల భేదం తప్పని వేమన చెప్పినన్ని యుక్తులు, చేసినంత వాదం యితరుల రచనలలో లేదు. కులభేదం కూడదని చెప్పిన భక్తి సాహిత్యంలో కానవచ్చే సగటు వాదంతో వేమన సరిపెట్టుకొన్నవాడుకాదు. ఎందరో ఎంతో తనకు ముందుం డగా, వారు చెయ్యని హేతువాదం వేమన చేశాడు. (హేతువాదమే కాదు, హేత్వాభాసలుకూడా చేశాడు.) నేటికీ కుతూహలకరంగా వుంటున్న హేతువులు చూపాడు. అదంతా నా 'విశ్వదాభిరామ వినురవేమ' రచనారంభంలోనే కుల నిర్మూలనంలో వేమన ప్రత్యేకత ఏమిటో వివరించాను. అది వేమన కార్యకారణ వివేచనా శక్తి.

– : ౦ : –

# వేమన - నాథయోగం - కొర్లపాటి

"వేమనకు నాథసిద్ధులతో సంబంధమున్నది. కాయసిద్ధిసాధన మతము వారి పొత్తున బడుటవల్లనే చేసినాడు" (పే. 17) అని మాత్రమేకాదు – సూర్య చంద్రవహ్ని సిద్ధాంతం వేమనయందున్నదని చూపించి, "పేరున పిలువలేదు గాని నాథసిద్ధుల సంప్రదాయమును వేమన ప్రత్యేకముగా ఎరిగినవాడు".

(పే. 10)

"తంత్రాచారముపై తిరుగుబాటుగా మధ్యయుగమున భారతదేశమందం తటను అల్లుకొన్న నాథమతమొకటున్నది. వేమనకుగల తత్సంబంధము ఇది వరకే ప్రస్తావింపబడినది స్త్రీనిందన మతితీవ్రముగ సాగించిన మతమిది.

(పే. 100న విశ్వదాభిరామ వినురవేమ-1981)

"హఠయోగ ప్రదీపికకూడా చతుర్విధశూన్యతను చెప్పుతున్నది. నాథ మతముకూడా బౌద్ధుల శూన్యతా సంబంధమున్నట్టిదే. నాథసిద్ధాంతాన్ని చామరుసు, గౌరన, హరిహరులొద్దకన్న వేమనవద్దే ఎక్కువగా లభిస్తున్నది".

1982–(పే. 208, వేమన, వివిధ దృక్కోణాలు)

"నాథమతమూ కబీరూచేసిన స్త్రీ నిందనాన్ని వేమన జీర్ణంచేసుకున్నాడు.

1982–(పే. 120, వేమనదర్శనం, విరసంపేరిట వక్రభాష్యం)

"బహుశా, "ఆంధ్రసాహిత్య తాత్విక" పరిశోధనలో నాథమతంగూర్చి తెలిసి నాకన్న ముందు ప్రస్తావించినవారు లేరనవచ్చు. చారిత్రక పరిశోధనలో ఆంగ్లంలో మల్లంపల్లివారు మాత్రం వేమననాథుడన్నారట. అది కొర్లపాటికి ప్రేరణమయిందట! వేమనపై నా రచనాప్రచురణాలు 1981–82 సంవత్స రంలో వెలువడగా, కొర్లపాటివారు తమ రచనను 1989లో ప్రచురిస్తూ వారి ప్రేరణ మల్లగపల్లి అంటారు! వారు నాతో ఉత్తరప్రత్యుత్తరాలు 1985లో జరిపారు!!

## త్రిపురనేని - వేమన నాథయోగం

నా తొలుతటి ప్రచురణలోని తాత్విక ప్రకరణం 1974నాటి కరపత్రం యొక్క పునర్ముద్రణమనీ, అది నిజంగా 100 పుటల విస్తృతిగల వివరణను కోరుతుందని, ఆపని మరొక ముద్రణకు చేయగలనని పీఠికలో చెప్పివున్నాను.

అనగా నా విశ్వదాభిరామ వినురవేమ గ్రంథంలోని తత్వప్రకరణం సూచనా ప్రాయమైన రచనమాత్రమే.

అందుకే అప్పట్లో అచ్చులో వచ్చిన అయింతే చదివి "ఏమిటో! వేమనకు నాథసిద్ధులతో సంబంధమున్నదట!" అంటూ అది అంతుబట్టని వింత విషయం, అసంగత సమాచారంలాగా విసువు విస్మయం ప్రశ్నాపెనగొన్నట్టుగా శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారు 'శివయోగి వేమన' అని భారతిపత్రికలో వ్రాసిన వ్యాసంలో ఒక్క వాక్యంలో విమర్శ పూర్తిచేయగా-(1982 జనవరి)

ఇకనిప్పుడు - ఎనిమిదేళ్ళ పిదప - "నాథయోగి వేమన" యంటూ - నాథసిద్ధులతో సంబంధముండుటకాదు - 'వేమన నాథసిద్ధుడే' యని ఒక గ్రంథమే వ్రాశారు శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి D. Litt. గారు.

మొదటివారికి అప్పుడే జవాబుతాకింది; వారు వ్రాస్తామన్న గ్రంథం మాత్రంరాలేదు. అందుకు పూర్తిభిన్నంగా యిక శ్రీ రామమూర్తిగారి గ్రంథం వచ్చింది. ఆ పరామర్శే మనకు మిగిలింది.

## వేమననాథయోగం : శ్రీమతి సుజాతారెడ్డి

నాథసిద్ధాంతం గౌరనవద్దకంటే వేమనవద్దే ఎక్కువగా లభిస్తున్నది; వేమనకు నాథసంప్రదాయ సంబంధమొకకాలమున్నది; ఆ సంప్రదాయాన్ని వేమన ప్రత్యేకంగా ఎరిగినవాడు; అందుండి దానినుండి బైటపడినవాడు; అని నేను వ్రాసినపిదప-నా అభిప్రాయాలు భారతి యితర పత్రికలద్వారా బాగా ప్రచురమైనపిదప వేమనలో నాథసంప్రదాయం ఎంతగానో వున్నదని కొర్లపాటి వ్రాసినది నా రచనకు వివరణగా మరింత సమాచారసేకరణగా చూడవలసివుంటుంది. అలాకాకుండా ఆదిమధ్యాంతాలంతటా వేమననాథయోగ మందేగాని తదన్యమతనియందు లేనేలేడని, వేమనయందు నాథేతర సంప్రదాయ పద్యంలేదు; అతని పద్యాలన్నింటికీ నాథసంప్రదాయార్థమేగాని మరొక అర్థం చెల్లదు, సిద్ధించదు, ఇంతవరకూ నాథేతరంగా చెప్పిన అర్థాలన్నీ తప్పులు అని నిరూపించడమొక్కటే వీరిపూనిక, ప్రతిజ్ఞ, పరిశ్రమ, ఫలితార్థం. వారి రచనే అలావుండాలి. అదిసున్న. ఇంకొక విషయం చెప్పాలి. వేమనను నాథయోగంతో ముడిపెట్టడంలో నా తర్వాత వీరికంటే ముందు మరొకరున్నా రనే నిజమొకటి చెప్పాలి.

సుజాతారెడ్డిగారు సూత్రించారు. 1983 లో హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి "తెలుగులో తొలి సమాజకవులు" అనే ప్రసంగవ్యాస సంకలనం లోని "భక్తతత్వ కవయిత్రులు" అనే వ్యాసం (పే. 236) ఆమెగారు వ్రాశారు. శ్రీ రామ్మూర్తిగారికి ఆ సంకలనం ఆ వ్యాసం ఆ సూత్రీకరణ చూడని చదవని సంగతి కాజాలదు. ఐతే ఆమెగారు నిరూపణ తలపెట్టలేదు- ప్రసంగ విషయం కవయిత్రులుగావునేమో! కాని మన కవయిత్రులనే నాథ సంప్రదాయినులని వారుచెప్పుటకు భూమికగా ఆంధ్రలోను, ఉత్తర భారతంలోను నాథసంప్రదాయ జనన పరిణామ కథ చెప్పివున్నారు. ఆ విష యాలలో వీరిద్దరిని పోలిక చేయదగివుంది.

ఆమెగారు నాథశిరోమణులైన గోరక్షుని చౌరంగిని (సారంగధరుడు) ఆంధ్రదేశస్థులను ఆంధ్రజాతీయులను చేసెయ్యగా, శ్రీరామ్మూర్తిగారు వారిని వారి గురువులైన మత్స్యేంద్రనాథుణ్ణి శంకర భగవత్పాదులకే పూర్వికులను గావించి, ఆ శంకరుల ప్రస్తావనకెక్కని నాథయోగులనూ, ఆ సంప్రదాయాన్నీ క్రీస్తుశకం ఆరవ శతాబ్దిలోనికీ తమిళదేశపు దక్షిణపు కొసకూ తిరుమూలరు పురాణ కథద్వారా చేరవేశారు!

ఆమెగారు వేమన వీరబ్రహ్మ సిద్ధయ్యలను+బాలపాపాంబ, ఈశ్వరమ్మ సుందరీమణి వెంగమాంబలవంటి తత్వకవయిత్రులను నాథసంప్రదాయంలోని వారని చెప్పగా, శ్రీరామ్మూర్తిగారు శంకరపూర్వులైన భర్తృహరిబాణభట్టులూ శంకరునెరుగని సమకాలికుడో సమీపకాలికుడో అయిన భవభూతీ తమ తమ కావ్యాలలో వర్ణించిన పాశుపత కాపాలిక శాక్తేయాలను నాథసంప్రదాయం గాను, శివయోగాన్నే నాథయోగంగాను భ్రమసి భ్రమయింపజూశారు!

ఆమె నాథసంప్రదాయం ఆంధ్రదేశంలో ఎప్పుడో ఎందుకోగాని మధ్యలో అచలమార్గమనే పేరుతోకూడా వ్యాపించిందని చెప్పగా శ్రీ రామ్మూర్తిగారు అచలమార్గదర్శిగా ప్రశస్తికెక్కిన వేమన్న పరిశోధనలో ఆ అచల విషయాన్నిగాని వేమనలో అచల సంప్రదాయమున్న సంగతినిగాని పరామర్శించే పనినుంచే తప్పించుకొన్నవారయ్యారు! కాని ఆమెగారుకూడా నాథమతం ఎలా అచలం కాగలుగుతుందో నిరూపించినవారుకాదు నాథమతం

స్త్రీనిందకంకాగా బాలపాపాంబను, ఈశ్వరమ్మ వెంగమాంబలను నాథమస్థత రాం(డుగా చెప్పియున్నారు. దానికి తగిన వివరణము చెయ్యలేదు. ఒక్క హఠసాధనమే నాథమతం కాజాలదనే తెలియలేదు.

ఆమె రాహుల సాంస్కృత్యాయనుల పరిశోధనలనుల్లేఖించి నాథ మతం బౌద్ధములోని వజ్రయానానంతర సహజయాన ప్రభావం పొంది దాని మీదే తిరుగుబాటుగా తలెత్తినదనగా - శ్రీ రామ్మూర్తిగారు శశిభూషణదాస్ గుప్తాగారి అనిరూపిత ఊహాపోహముల అపార్థం ప్రేరణగా గైకొని, ప్రాచీన మైన సిద్ధసంప్రదాయమునుండి నాథమతం రూపుగొన్నదన్న ఆ దాస్‌గుప్తా యూహనతిక్రమించి, "నాథ సంప్రదాయములోని యంశములు సహజయాన కాలచక్రయానములందు సంక్రమించినవ"నే వరకు వెళ్ళారు. కాని "నాథ సంప్రదాయమునందు యోగాభ్యాసముల సముద్దేశము"ను వివరించేందుకు నాథయోగుల రచనలులేకపోయి సహజీయాచార్యులైన సారహపాద, కృష్ణ పాదు(కానుపా)లచర్యాగీతికలనే ఆశ్రయించాల్సిన దురదృష్టముపాలయ్యారు!

అసలు పాశుపత గ్రంథములే ఎరుగని ఈ కొర్లపాటివారే వెనకటికి శ్రీనాథ నన్నెచోడులపై తమ పరిశోధనలను ప్రచారించారు. ఆనాటికి శ్రీ రామ్మూర్తిగారికి శైవంలో శూన్యవాదం సోమసిద్ధాంతం నాథయోగం వున్నాయని తెలిసినవారేకాదు-ఆ సంగతులందులో వ్రాసినవారేకాదు. అంతేకాదు, అసలు పాశుపతవ్రతము మతము దాని విశేషాంశములు తెలియ కుండానే యీ పరిశోధనలు ముగించినవారు. ఆ మత సారస్వతమైన గణకారిక, రత్నటీక, పాశుపత సూత్రాలు, కౌండిన్య భాష్యము, పంచార్థ దీపికలను, వానినిగూర్చి వ్రాసిన సారసత్వాన్ని, విద్యారణ్యుల సర్వదర్శన సంగ్రహ రచననుకూడా ఏ మాత్రం కానకుండా పాశుపతేతరమైన తమిళ శైవ సిద్ధాంతానికి మూలమైన ఆగమాదులను ఆశ్రయించి శ్రీనాథుని పాశుపతాభిరతిని ప్రస్తుతించి పట్టమందుకొని పంచారించినవారయ్యారు. అందుచేతనే దిగంబరత్వం, త్యక్తభుక్త శేషాన్నం, పాణిపాత్రభుక్తి సర్వవిధ శైవబాహ్యా చారవేషారాహిత్యం, శైవమతస్థుడని లోకులు గుర్తింప వీలుగానట్టి ఆకార వర్తనలు, బురదదుమ్ము కొట్టుకొని జడలు గడ్డాలు మీసాలు గోళ్ళు పెంచుకొని సంచరిస్తూ పిచ్చి, పిశాచి, వెర్రియని యనిపించుకొనటం, నిర్గుణధ్యానియై వుండ

టం పాశుపతవ్రత పరాకాష్ఠయని, అది ఆగమాల్లో లేనిదని అప్పటికీ ఇప్పటికీ తెలియనందున వేమన రూపవర్తనా విశేషప్రశస్తులు, విత్తరువు గాథలు అతని పాశుపతదశలో అలవడినవని పోల్చుకోలేక తేల్చుకోలేకపోతున్నారు;భర్తృహరి అవధూతవర్ణనను కూడా అవగాహన వేసుకోలేకపోతున్నారు. పాశుపత మతాన్ని గూర్చి, శివయోగాలనుగూర్చి వేమన - శివయోగం అనే నా వ్యాసం వేమన - వివిధ దృక్కోణాలు అనే వేమన వికాస కేంద్ర ప్రచురణ - 1982 చూడండి. పాశుపతంగూర్చి సురేంద్రనాథదాస్ గుప్తాను ముమ్ముందు యిందు లోనే ఉదాహరిస్తాను.

## పాశుపత శ్రీనాథుడు ఇప్పుడిక నాథమతస్థుడు ! !

ఇక శైవంలో నాథమతంగూర్చి వేమనకు దానితో పొత్తునుగూర్చి వ్రాసిన తర్వాతను అదే వేమనలో ఆదిమధ్యాంతముల నిండియున్నదని, పాశుపత వీరశైవాది యితర శైవాలేవీ వేమనలోలేవని, వేమన మకుటమే నాథమతార్థక మకుటమని, వేమనలోగల సకలమైన శివస్మరణను నాథసంప్రదాయంగా జమ కట్టి, చివరకు శ్రీనాథుని దాకావెళ్ళి శ్రీనాథ నామంలోనే నాథమతం పలుకుతున్నదనే వరకూ చెప్పబట్టారు!! మత్స్యేంద్రనాథ, గోరక్షానాథ, నాగార్జుననాథుల నామాలలోగల నాథబిరుదంవంటిదే శ్రీనాథ నామంలోగల నాథశబ్దం అంటున్నారు!! పాల్కురికి పిడపర్తి నాచనసోమనాథుల పేర్లు కాశీవిశ్వనాధునిపేరూ విద్యానాథ, పండిత రాయజగన్నాథ నామాలన్నీ, తిక్కనగారి హరి హరనాధీయం నాథముని వైష్ణవంతో సహా, నాథమత ప్రభావంలో ఏర్పడినదనట మొక్కటే యిక తరవాయి!!

బౌద్ధుల శూన్యతత్వం శైవంలోకి చొచ్చుకుపోయిందని తొలుత తెలియ కేపోయి, 1985లో నాతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా మాత్రం ధ్రువంగా గ్రహించిన శ్రీ రామ్మూర్తిగారు శైవంలో ఆ శూన్యతా భావం అర్థ భేదం పొందిందని అలవోకగా తిరుగుటపాలో వ్రాశారు. అలా వ్రాయటంలో వీరికి ఒరవడి సుందరేశ్వరరావు. అల్లమ ప్రభువులో వీరశైవంలో గల శూన్యత బౌద్ధుల శూన్యతకు భిన్నమని చెప్పి నాచే ఖండనమందు కొన్నవారు. వారిని వీరు అనుగమించారు. కాని వేమనను నాథపంథీగా

సూత్రించేవారికా దారి తప్పు దారని కానకపోతున్నారు. నాథుల శూన్యత బౌద్ధ సిద్ధాచార్యుల శూన్యత భేదించవని ఒక్కటేయని శ్రీరామ్మూర్తిగారనుసరించిన శశిభూషణ గుప్తుల పరమాభిప్రాయం. ఇప్పటిదాకాగల ప్రసిద్ధ (196, 197 పేజీలు, OBSCURE RELIGIOUS CULTS) పరిశోధకులందరి అభిప్రాయం. అదే నాథ సహజీయ సిద్ధాంతాలు కవల పిల్లలవలె ఒకటినొకటిగా భ్రమించే టంత గాఢ సంవాదంకలవి కదా! అంతేకాక నాథమతంనుంచే సహజయానం బాలాబాలా తీసుకొందని, ఉత్తేజం పొందిందని శ్రీరామ్మూర్తిగారు అటునుండి యిటు తిరగవేసి చెప్పినవారుగదా! అందుచే వేమన నాథపంథీ గనుక అయి వుంటే వేమన శూన్యత సహజీయ బౌద్ధ శూన్యతకు భిన్నంకారాదు. భిన్నమై వున్నదన్నప్పుడు వేమన పద్యాలలో శూన్యతా భావమే లేకపోయినప్పుడు వేమనను నాథయోగియని యననేకూడదు. నాథపంథీయనతలచినవారు వేమ నలో శూన్యతే వుందని చెప్పవలసిన వారవుతారు. కాని అది కానక వీరు చెప్పిందేమిటో ముందు పరిశీలిస్తాము గాని వీరు స్వవాద వ్యాఘాతకతా వ్యవ సాయం చేశారని మొదటే చెప్పడం అవసరం.

## వేమన పద్యాలు వేయికాదు వేనవేలు

వేమన ప్రశస్తి పేరిట వీరు కూర్చిన ప్రకరణం ఎంత పద్ధతిగా వుందో, అందులో పొందుపరచిన వేమన సమాచారం అంతపాక్షికం అంతపక్ష పాత సంకలితం, అంత అపూర్ణంగావుంది. ముందే వొక నిర్ణయానికి వచ్చి, అందుకు వలయును, ఉపకరించును, సరిపడును, అవిరుద్ధమగును అని తామను కొన్న ప్రశస్తులను మాత్రమే ఎంచుకొని కూర్చిందేగాని సమాచార సామస్త్యాన్ని ప్రశస్తి ప్రభేద సర్వాన్ని యథాతథంగా పాఠకులముందుంచి, ఆ సామస్త్యాన్ని విశ్లేషించి చర్చించి ఒక పర్యవసానాన్ని వెలువరించే పరిశోధనా ధర్మాన్నితప్పి దూరంగా నడచిన ఘోరప్రకరణం. సమాచారాన్ని కప్పిపెట్టటం అన్నట్టిది యీ పరిశోధనయొక్క ప్రత్యేకత ఘనత.

వేమన చెప్పినవి వేయిపద్యాలేయని ప్రశస్తి వుందని ఒకపద్యం ఉదాహ రించి వూరుకొన్నారు. కాని పదేనువేల పద్యాలు చెప్పాడని, వ్రాతకందని

పద్యాలు వేలకొలది చెప్పాడని వున్న ప్రశస్తి పద్యాలను ప్రస్తావించకుండా దాటవేశారు.

శ్రీకార శివతత్వశీలుఁడౌ వేమన్న పదియుఁనైదువేల పద్యములను
లోకమందు జెప్పె ప్రాకృతుల్ దరిజేర....
శ్రీకరుండగు వేమన జెప్పినట్టి వేల కొలదుల పద్యముల్ వివరమెరుగు
పురుషవరునకు సిద్ధించు పరమ పదము....
నీతివైరాగ్య భక్తివినీతులకును ఘాతకులుఁగాని జ్ఞాన సంకలితులకును
వ్రాలకందని పద్యముల్ వేలసంఖ్య చేతమందగ వేమనజెప్పె భువిని

వేమున ఆశుకవి. "మాటికి మాటికిన్ మరియు మాటకు పద్య పద్ధతిన్ ధాటి నెఱుంగ జెప్పి"న వాడన్న ప్రశస్తిపొందినట్లు ఉదాహరించిన శ్రీరామ్మూర్తి గారే యిట్టి ఆశుకవి వేమన చెప్పిన పద్యాలన్నీ కలిపి వెయ్యే అనటం అసంగతం. ఆశు కవితా స్వభావానికి శుద్ధ విరుద్ధం. విచిత్రమేమంటే వేమన పద్యాలు వెయ్యి అనే ప్రశస్తి వుందని ఉదాహరించిన పద్యంలోనే ఆమాటా, ఆ అర్థం లేనేలేదు చూడండి.

వేయి పద్యములు వివేకియై భక్తితో పఠనజేసినట్టి భక్తునకును
బాయకుండు మోక్ష పదమరచేతిదై....

ఇందులో వున్నదంతా వెయ్యి పద్యాలు పఠించిన భక్తునికి మోక్షమని మాత్రమే కదా! ఎవరి పద్యాలు? అవెన్ని? ఇందులో అదేమీలేదే? ప్రకరణం అనుగ్రహిస్తే వేమనవందాం. అయితే అతడు చెప్పినవన్నీ ఎన్నని అడిగితే ప్రకరణం పలకదు; పద్యం ఉలకదు. వేమన పద్యాలు వేయనే వాదానికి మూలకర్త సుందరేశ్వరరావు. వీరు అనుకర్తలు. వే. వి. దృక్కోణాలలో మూలకర్తలకు జవాబు ముట్టినా పేలవమైన పునశ్చరణకు పూనుకొన్నారు అనుకర్తలు. వారి సూత్రీకరణావసరమట్టిది!! వేమననాథ సిద్ధుడేయనటానికి చాలా అట వెలదులను వేమనకవి కాదనాలి సుమీ!

## వేమన జీవత్ప్రశస్తి అచలము

వేమనకున్న ప్రశస్తే అచల మార్గదర్శకత్వం. నాథయోగిగా "ప్రశస్తి" వేమనకసలేలేదు. "ప్రశస్తి" లేకపోయినా ఆయన నిజంగా నాథయోగే అయి

వుంటే దానిని కాదనలేము. కాని అట్టి ప్రశస్తి అయనకులేదు. లేని ప్రశస్తి వున్నట్లుగాను, ఉన్న ప్రశస్తి లేనట్టుగాను చూపటం కామాపుచేయటం ప్రశస్తి ప్రకరణంలో పరిశోధకుల ప్రణిధానం. అందుకొక సాధనం వేమన పేరపద్యాల కల్పన, వేమన ప్రశస్తి కల్పన.

వేమనగారిపేరు చెప్పుకొని వివరించుతున్న ఏకైక తత్వమే అచలం. "అచలతత్వమనగా అనుభవ గమ్యంబు చూపి చెప్పరాదు సూటిగాను, మదికి దోచుగాని మర్మమెన్నగరాదు...." (వావిళ్ళప్రతి) అచలతత్వ మహాపురుషునిగా అందులో పరంపరా ప్రతీతి వేమనకున్నది. శ్లోకరూపంపొందింది ఆ ప్రఖ్యాతి. వేమన పద్యాలకు ఆ మార్గస్థుల భాష్య ప్రవచనాలు నిత్యచర్య. గ్రంథగతము. వేమన జీవత్ప్రశస్తి అచలము.

> "ఎరుక తత్వమనియె ఇలశంకరార్యుడు తెలివితత్వమనుచు దెలిపెవ్యాసు
> లెరుక తెలివి రెండు నెరుగడు వేమన్న...."

> "చెవిని యిల్లుగట్టి చెప్పెను వేమన్న బట్ట బయలనుండు బ్రహ్మమనుచు"

> "బ్రతుకులెల్లమాయ భవ బంధములు మాయ, తెలివి మాయ తన్ను దెలియమాయ"

> "ఎరుక మరచుచోటు నెరుగుట తత్వంబు...."

ఎరుకమాయ తెలివిమాయ తన్ను తెలియుట మాయ-ఇది శంకరాద్వైతం మాత్రంకాదు. ఇది బయలుతత్వం—శూన్యతత్వం; బయలు పద్యాలు అరవైడెభై చెప్పాడు వేమన్న. పారిస్ ప్రతిలోకూడా వున్నవి. పారిస్‌ప్రతి 1737 నాటిది. అర్వాచీన అచలగురువు శివరామ దీక్షితులకన్న అది ముందటిది. వేమన బయలుతత్వం, పైజెప్పిన అంశాలన్నీ శివరామదీక్షితుల్లో వున్నాయి. వేమన ఎంగిలి సిద్ధాంతముంది-ఆచాయ అచలంలో ఇప్పటికీవుంది. వేమన మతరాహిత్యబోధే అచలంలోవుంది. ఇలా వేమన అచలంలోను, అచలం వేమనలోను అంతర్భవించుకొనివుండగా, వేమన ప్రశస్తి ప్రకరణంలో గాని, వేమన తత్వ ప్రకరణంలోగాని శ్రీరామ్మూర్తిగారు ప్రస్తావించనేలేదు! ఇక చర్చించటమెంత దూరపుమాట! ఆపై వీరి పరిశోధనమందలి టెక్నాలజీ ప్రాక్రుష్టియన్ టెక్నాలజీ.

## మతరాహిత్యం - ఆధ్యాత్మికత - వేమన

శ్రీరామ్మూర్తిగారు యిలా మరుగుపరచిన వేమన ప్రశస్తి సమాచారము లింకేమేమి వున్నవో చెప్పేముందు మతరాహిత్యంగూర్చి కొంచెం ముచ్చటించి ముగిస్తాను. వేమన మతములను కాదన్న ఆధ్యాత్మిక మహా పురుషుడన్నమాట స్వయం బాధితమని వీరి విమర్శ. అది స్వయం బాధితం కావచ్చు—కాక పోవచ్చు. అది ఆధ్యాత్మికుడైన వేమన తలంపా కాదా యన్నది మాత్రమే మన ప్రశ్న. ఆధ్యాత్మికుడు మత నిరసన గావించడం అసంబద్ధమని తలచి, వేమన ఆ పనిచేసి వుండడని తలంచటం, తలంచి అట్టి పద్యాలు వేమనవి కావనడం, వానిని దిద్దివెయ్యటం అకార్యం–పరిశోధక ధర్మభ్రంశం. ఐనా వారు దిద్దగలిగిందొక్క పద్యం; వేరుగాకూడా అర్థం చెప్పుకోవచ్చని చూపిన దింకొక పద్యం మాత్రమే. వేమన మత నిరాసక పద్యాలన్నీ ఆదిలో నేనిచ్చిన పద్యాలు పదింటిలో ఒకదాన్ని దిద్ది, మరొక దానికి మరొక అర్థంకూడా తీయ వచ్చని చూపి మొత్తాన్ని కొట్టివేశామనటం దంభం అర్థరహితం. ఆ కథ చూద్దాం. అంతేకాకుండా మత నిరాసకభావాన్ని బాగా ముదురుపాకానబెట్టి దిద్దశక్యంకాని కూర్పుగల వేమన పద్యాలు అదనంగా మరి రెండు లభించాయి. పారిస్ ప్రతినుంచి ఒకటి, నాగలింగ శివయోగి ప్రతినుంచి మరొకటి వే. వి. దృక్కోణాల్లో (1982 లో) ప్రచురించాను. వెరశి పన్నెండు పద్యాలు.

"వరుస మతములంట వర్ణాశ్రమములంట దర్శనములంట దైవమంట
తగిలి తిరుగువాడు ధరనంధకుండాయ....(పారిస్ ప్రతి)

"మూడు మతముల మరిముక్తంబుసేయక, అధికమతము లింకహతము గాక–నాగలింగ శివయోగిప్రతి మొదట చూపిన పదింట ఎనిమిదిని వదలి వేయటమేగాక, వెనుక మళ్ళీ అదనంగా చూపిన యీ రెండింటి మాటనుకూడా మరుగునబెట్టి, వేమన మతవ్యవస్థను మతమును నిరసించలేదని పరిశోధనగా ప్రదర్శించటం సత్యసాధకం కాదు–సత్యబాధకం మాత్రమే.

1952లోనే "మతములు **తగవని** వేమన తలంపు" అని వావిళ్ళవారి

వేమనపద్యాల పీఠికలో శేషాద్రిరమణ కవులు వ్రాయటమిప్పుడు గమనించి నివ్వెరపోయాను. వేమన ఆ తలంపు అధ్యాత్మికతకు విరుద్ధమని ఆయాధ్యాత్మికులకు అనిపించలేదు—ఆ భావం వారికి సుపరిచితమనిపించింది. అది వారి వేత్తృత. ఆధ్యాత్మికులట్టి భావాలు వెలిబుచ్చట మెరుగకపోవటం ఆ భావం ఆధ్యాత్మికతకే విరుద్ధమనుకొనటం నేటిపరిశోధనాస్థాయి!! ఇది దేశదురదృష్టం.

## అష్టమతములా ? అష్టమదములా ?

ఇక దిద్దుపాట్ల గురించి : వ్రాత ప్రతులు అచ్చు పాఠం ఒక్కలాగే వుండగా, ఆ పాఠం అర్థవంతమై యుండగా దిద్దటం దేనికి? అంటే యిష్టార్థ సాధనకొరకు అని చెప్పాలి. "అష్టమతములెందు హరము పాయగలేక వీర శక్తి యెల్లపీటిబోవు ..." "అష్టమతములెల్ల హతముగాక, వేత్తయనగనేల వెర్రి పద్ధతిగాక...."అన్నట్టి అచ్చుపాఠాలు వ్రాత ప్రతులందున్నట్టే వున్నాయి. ఏ వొక్క వ్రాత ప్రతిలోను అష్టమదములని లేదు. ఐనప్పటికీ అష్టమదములనే వుండాలిగాని అష్టమతములనుకోవడం తప్పంటున్నారు. అష్టమదములనే పారిభాషికపదం వేదాంత గోష్ఠి వారెల్లరికి కంఠపాఠమైన పదం. అంత సుసామాన్య పదబంధం తెలియకనే పండిత ప్రతుల్లోకూడా అష్టమతములనే ముద్రించారనుకొందామా? అష్టమదములని దిద్దితేకూడా అర్థవంతమేనన్న సంగతి కానకనే ముద్రించారనుకొందామా? మతరాహిత్య బోధగల అధ్యాత్మికత వుందని తెలిసినవారుగావుననే అష్టమతములుగానే వుంచారనుకొందామా? పాఠకులే ఆలోచించి తెమల్చుకోవచ్చు. అష్టమద రాహిత్యం సర్వతత్వ శాస్త్రంలోనూ కనిష్ఠ సామాన్య గుణకము (క.సా.గు—L.C.M.) మత రాహిత్య భావన తత్వ శాస్త్రంలో విశేష విషయం. (గ సా.గు—G.C.M.) అట్టి విశేషభావనే యింకా చాలా యితర పద్యాలలోవుంది. అటువంటప్పుడు దాన్ని కాదని కనిష్ఠ సామాన్య గుణకంవంటి భావాన్ని చెప్పడానికై దిద్దుపాట్లకు దిగటం న్యాయం చేయుటంకాదు.

అదీకాక ఏడు మతములని, మూడు మతములని, ఆరు మతములని, నిస్సంఖ్యముగా మతమని వాడుకచేస్తూ మతరాహిత్యాన్ని చెప్పే వేమన పద్యాలంటూ ఇంకా ఎన్నో అధికాధిక సంఖ్యలో వుంటుండగా అష్టపద పూర్వకంగా మత శబ్దమున్న ఒక్క సందర్భాన్ని అనువైనదని దొరికించుకొని అష్టమదముగా మార్చి, మతరాహిత్యంనుంచి వేమనను విముక్తి గావించినట్లు పంచారించటం తప్పు-ముప్పు.

## పదహారుయోగుల పట్టిక

వేమనకున్న పూర్వ ప్రశస్తినిబట్టే నాథయోగియనవలసి వుందని చూపటం వారి పుస్తక ప్రణాళిక; ప్రయత్నం. కాని అపూర్వ ప్రశస్తులలో, వేమనకు అక్షరాల నాథయోగియనే ప్రశస్తేలేదని వారే నిరూపించినట్లవు తుందని ఇక్కడ చూడనున్నారు.

ఆ ప్రశస్తి లేకపోవచ్చుగాని, వేమన నాథయోగియనే నాలుగక్షరాల మాటను ప్రయోగించాడా లేదా అన్నది ఆమీది ప్రశ్న. ఏఏ విశేషణాలతో యోగి శబ్దప్రయోగం వేమన చేశాడో పట్టికవేసి అవి పదహారని (70వ పే.) చూపించారు. అందులోనూ నాథయోగిలేడు !! వేమన నాథయోగి పేరెత్తనే లేదని ఈ పరిశోధకులే పాఠకులకు సమాచారం ఇచ్చినట్లయింది.

ఆపైన "అది (నాథ సంప్రదాయం) వేమనకాలమునందు వేమనదేశము నందు–ఆంధ్రదేశమునందు కలదు" [134వ పే.] అని నొక్కి వక్కాణిం చారు. ఈ పరిశోధకులన్నట్టుగా, వేమనే (1)నాథయోగియై యుండగా, (2) అంతకుముందే నవనాథ చరిత్రలు రచితమై, అవి శ్రీశైలంమీద ప్రచురమై తాఁజదివినవై, అచట నాథయోగియైన ముక్తిశాంత భిక్షావృత్తిమఠము నక్కడ చూచియుండవలసి యుండగాను (3) యోగి శివయోగి రాజయోగి నెరయోగి వరయోగి పరిపూర్ణయోగి పరతత్వయోగి పరమయోగి సంసారయోగి అంటూ అనేకానేక విధములుగా యోగులను చెప్పుచుండగా, వేమననోట ఒక్కగానొక్క సారి నాథయోగియనేమాట వెలువడలేదంటే అది యాదృచ్ఛికమూ, ప్రామాది కమూ అవుతుందా? వేమనను నాథయోగిగా చెప్పవచ్చే సందర్భంలో అది అప్రధానాంశం కానేరదు. వేమన నాథయోగి కాగా నాథయోగి అనేమాటనే వాడకుండటం సంభవమా? వేమనకాలంలో నాథసంప్రదాయం ఆంధ్రదేశంలో ఎంత విస్తారంగా వుందో పరిశోధకులు చెప్పేకొలదీ, నాథయోగి పదప్రయో గమే వేమన చేయలేదనేమాట వేమన పద్యాలలో నాథ సంప్రదాయాంశాలు కనిపించినప్పటికీ వేమనను నాథయోగిగా సూత్రించడానికి ప్రబల ప్రతిబంధ కంగా ప్రాధాన్యం పొందుతుంది.

కాని ఇదంతా తెలిసే "పేరున పిలువకపోయినను నాథసిద్ధుల మతము

వేమన ప్రత్యేకముగా దెలిసినవాడు" అని నా "విశ్వదాభిరామ వినురవేమ"లో 10 వ పుటలో 1981లో ప్రచురించాను. (1974లో వ్రాశాను.)

అవధూత శబ్దము అది నాథసంప్రదాయం పుట్టుకకు ముందటిది. అధశ్చక్రస్థిత స్త్రీ శక్తికి అవధూతిగా ప్రయోగించటమెక్కువ. సుషుమ్నా నాడినే అవధూతిక అన్నారు. హిందూ బౌద్ధ తాంత్రిక సిద్ధులిద్దరూ యీశబ్దాన్ని బాగా వాడుకొన్నారు. అది నాథయోగం ప్రాచుర్యం పొందిన పిదప నాథ పర్యాయంగా ప్రచారానికి వచ్చింది. ఆంధ్రలోకూడా వాడుకకెక్కి వుంది. అట్టి పర్యాయపదాల్ని కూడా వేమన వాడి ఎరుగడు !!

ఇక సూటిగా నాథయోగియనేమాట వేమన పద్యాలలో లేకపోగా పట్టిక పదహారు, యోగులలో ఎవరిమాటునో నాథయోగి దాగి వుండొచ్చనటం ఊహ్యమే. అలాగే "నేర్పెరుగనివాని నెరయోగియందురా ఎద్దుకన్న దున్న ఏలాగు తక్కువ, ఎరువులేకపోయి తరిగె విలువ"–అన్నచోటగల నెరయోగిలో నాథయోగే వున్నారన్నారు. నెరజాణలాగా పరిపూర్ణమైన యోగి అనటానికి నెర యోగియంటారు. నెరయంటేనే నేర్పనేవాడుక, ప్రయోగం వుంది. గౌరన నవ నాథ చరిత్ర–నాగార్జున కథా ప్రకరణంలో "నీ కుమారుండు, నెరయోగి యగు గాని నృపుడు కాబోడు" అని వున్నందుకు నాగార్జునుని సిద్ధ మహిమలన్నీకల యోగి నెరయోగి. అన్నంతమాత్రాన నాథయోగి అనటం సరికాదు. నవనాథ చరిత్రలో ప్రయుక్తమైన ఘనయోగి వరయోగి ఉత్తమయోగి వంటివన్నీ నాథ యోగి వాచకాలనటమే యిక తరువాయి సుమీ !! నెరయోగిలో నాథయోగిని చూపటం అనివార్యతలేని అక్కరమాలిన అపేక్షార్థ సాధనాయోగం అవుతుంది.

నాథయోగి, నాథ సంప్రదాయం అనేమాటలు పారిభాషిక పదాలంతటి నిర్దేశంకల మాటలు, అతివ్యాప్తిలేని మాటలు. ఒకే వొక శైవమత ప్రభేదానికి తప్ప మరొక శైవశాఖకు వర్తించ వీల్లేని మాటలు. సిద్ధ శబ్దంకూడా కేవలం నాథ పర్యాయంకాదు. నాథులుకానట్టి సిద్ధులున్నారు. తాంత్రిక సిద్ధులు. అతివ్యాప్తికి శివయోగి పదాన్నే చెప్పాలి. యోగసాధన కాని దానిని శివయోగం

అన్నారు. "జ్ఞానం శివమయం, భక్తిః శైవీ, ధ్యానం శివాత్మకం శివవ్రతం శివార్చేతి శివయోగోహి పంచధా" అని శివయోగ ప్రదీపికనుంచి నేను ఎప్పుడో ఉదాహరించాను నా వెనుకటి రచనల్లో.

అంచేత వేమన ప్రశస్తి శివపరమని, శివతత్వ శీలతయని, శివయోగిత యనీ. శివరూప ధారణయని శివధ్యానమని శివరూప బ్రహ్మమని శివమార్గ మోక్షగామిత్వమని.... గాఢంగా బాఢంగా విస్తారంగా వివృతులతో ఉదాహరించడం – పరిశోధనా మహా ఫలాలుగా చూపించవలసిన విషయాలుకావు. కొత్త విషయాలుకావు. ఈ విషయాలు చెప్పని వేమన పరిశోధన యింతవరకు లేదు. నిష్కర్షగా వేమనను నాథయోగిగా నిరూపించజాలిన సంగతులివి కానే కావు. 'నాథయోగి నిర్దేశముద్రకరమైన సగటు శైవ నిరూపకాంశాలివి. 'వేమన ప్రశస్తి' ప్రకరణం మొత్తంలో నాథయోగి కనిపించలేదుసరిగదా! నాథయోగిని చూపుతామని శివయోగిని చూపించారు!! అందులో పాశుపత యోగాన్ని మాత్రం కానలేకపోయారు!!

## ఆశుకవిత నాథలక్షణమా? ఇంకా?

పైగా "భిక్షాటనము దేశ సంచారము ఆశుకవనము శివరూప ధారణము కలిసి నాథ సంప్రదాయ సరణి"యని వేమన ప్రశస్తి (84వ పుట)గా కొర్లపాటి సిద్ధాంతము. అది ఆకరములేనిమాట. 1. ఆ నాలుగంగాలు వ్యస్తంగా నాథ సంప్రదాయ నిరూపకాలు కావని వారే యిందులో వొప్పుకోగా చెప్పకోగా - ఆ నాలుగంశాలూ సమష్టిమీద నాథ సంప్రదాయ సరణి అనేందుకు ప్రమాణం లేదు. ఉంటే వారివ్వలేదు. 2. నాథసంప్రదాయ సందర్భంలోనూ మరే మత సంప్రదాయ సందర్భంలోనూ ఆశుకవనం ఒక అంశమనడం వింతమాట. కల్పన కల్లబొల్లు అందుకు ప్రమాణమాలేదు; ఉదాహరణమా యివ్వలేదు. ఇవ్వ లేరు. ఆ సంప్రదాయ ప్రవర్తకులైన మత్స్యేంద్ర గోరక్షులే ఆశుకవులుకారు. నవనాథులలో మిగతావారినైనా కవులుగాగాని ఆశు కవులుగాగాని గౌరనకూడా తెలుపలేదు. కొందరందులో అక్షరం వ్రాసినవారుకాదు. నాథసంప్రదాయం అవలంబించినందునే వేమనకవీ, ఆశుకవీ కాగల్గాడనటమా యిది? 3. శివ

రూపధారణమనగానే నాథయోగివేషమేయన్న నిర్దేశమాలేదు;నాథయోగివేషము శివరూపమనగానే నాథయోగి రూపమనటం, నాథయోగిరూపమే శివరూపమన టం పొరపాటు, భ్రాంతి. మత విషయంలో ఆశు కవితా వ్యాసంగం అనవసర ప్రసంగమని అవతల బెట్టిగాని, పెట్టకగాని మిగిలిన అంశాలు భిక్ష, దేశ సంచారం, శివరూపధారణ-అన్నవి వ్యష్టిగా సమష్టిగా పాశుపత శైవంలో వున్నవేగాని లేనివిగావు.

## వేమన ప్రశస్తి పద్యాలు : పాశుపతం

ఇంతకూ ఈ నిరాధార కల్పిత సూత్రీకరణకు తావలమైన పద్యప్రశస్తి:

కూటికి లేనివానివలె కోపము లేకను యెల్లతావులన్
మాటికి మాటికిన్ మరియు మాటకు మాటకు పద్య పద్ధతిన్
ధాటినెఱుంగ జెప్పుచును ధారుణిలో శివరూపధారియై
మాటుకునున్న వేమన సమానము యెవ్వరు వెఱ్రివేమనా!!

ఇందులో ఆ నాలుగంశాల సమష్టిమాత్రమేగాక వేమన వెఱ్రివానిగా పొందిన ప్రశస్తికూడా వుంది. వెఱ్రిపోకల ప్రశస్తితో కలిసి ఐదంశాల సమష్టి కాగా అది నాథ సంప్రదాయమౌనో కాదో కొర్లపాటి చెప్పవలసినదికాని చెప్ప లేదు. చెప్పినా చెప్పకున్నా వెఱ్రిపోకల యోగం మాత్రం నాథయోగంలోలేదు. వెఱ్రిపోకళ్ళ యోగం పాశుపతులయోగం. వేమన వెఱ్రితనపు ప్రశస్తి తక్కిన ప్రశస్తి పద్యాలలో నిండివుంటే-అదే గమనించవలసింది.

పిలిచిన బల్కకుండు మరి పిల్చిన వేకనకూరకుండు తన్
దలచిన ఎవ్వరేమనిన దన్ననుగాదని నవ్వుచుండు నా
త్మల దలపోయుచుండు పరతత్వము నిత్యము తానయై సదా
తెలిసిన యోగి వేమనగతిన్ శివరూపుడు నెల్లతావులన్!!

కాదని యెవ్వరితోడను వాదాడక తిరుగు వెఱ్రివాడుంబలెనే
భేదా భేదము లడచిన వేదాంత రహస్యమెల్ల వేమన నేర్చున్!!

ఎప్పుడు జూచినన్ ఇతరమేమియు జూడక ముక్తియందుకన్
రెప్పల మూసి మూయకను రేయి బగల్ ఒక రీతినుండగా
తప్పులనందజేయు యమధర్ముని పాలికి లొంగనేర్చునే
చెప్పగనేమి వేమనకు జెల్లును ముక్తి విధానమంతయున్!!

కొర్లపాటి ఉదాహరించిన యీ ప్రశస్తి పద్యాలను వేర్వేరుగా వారింకొ కందుకు ఉదాహరించినా యిందులో శైవుడైన వేమనవేషం చేష్టా చర్యా వున్నై. పిలిచినా పలకడని, ఎవ్వరేమంటున్నా తన్ను కాదనుకొంటాడని, పైగా తనలో తాను నవ్వుకొంటాడని, వెర్రివాడనిపించుకొంటాడని యిందులో వుంది. ఇవి నాథయోగి లక్షణాలేకావు సరిగదా సరిగా యివే పాశుపతయోగి లక్షణాలు.

## సురేంద్రనాథదాస్ గుప్తాను కాస్త వినండి...

In the third chapter it is said that the real Saiva ascetic may dispense with all the external practices, so that no one will recognise him as a Saiva ascetic and will not give him a high place in Society. People may often abuse him as a lunatic, an ignorant man or a dullard etc. (P. 137 Vol 5)

One should continue to meditate by drawing one's mind from all other objects and concentrating the mind on Siva or on some symbolic name.

Lord should be meditated upon in His aspect as formless God should not be approached with the association of any of the qualities attributed to Him. This is expressed by the Sutra V. 27 (P. 139 Vol 5)

Even in wearing ordinary apparel, one has to kill many insects. (P, 140 Vol. 5)

In the higher state, they go about naked. They further say that the ultimate being that they worship, is not associated with any of the Puranic characteristics of Siva, such as having matted

locks or the lunar digit in the hair etc. Such a supreme being is devoid of all such characteristics and passions. (P. 144 Vol. 5)

## HISTORY OF INDIAN PHILOSOPHY VOL. 5

BY SURENDRANATH DASGUPTA

నాథయోగుల వేషభూషల పట్టికను కొర్లపాటి నాథ సంప్రదాయము అనే అధ్యాయంలో కూర్చి యిచ్చారు. బినయతోష్ భట్టాచార్యులు, అక్షయ కుమార బెనర్జి, బ్రిగ్సువంటి వారి రచనలనుండి ఉల్లేఖించి యిచ్చారు.

"నాథుల విభూతి రుద్రాక్ష దండకాషాయాంబర ధారణాదికము శైవ పద్ధతికి ప్రబల నిదర్శనము"–ఇంతవరకు శైవపద్ధతేగాని నాథమత ప్రత్యేకత యేదో చెప్పలేకపోయారు. ఇక "నాథయోగుల ప్రత్యేక చిహ్నములలో ఛిన్న కర్ణములు. అందు ప్రతీక త్రిశూలము ....

ఈ వేమనప్రశస్తి పద్యాలు చెప్పే వేషంలో నాథమత విశిష్టవేషమైన యీ చిల్లి చెవులు, ఆ చెవుల నల్లలనాడించే బరువైన దర్శనకుండలాలు లేవు సరిగదా శైవమత సామాన్యమైన విభూతి రుద్రాక్షలు కాషాయములుకూడ లేవు. ఇట్టి బాహ్య వేషధారణ కొర్లపాటి ఉదాహరించిన పద్య ప్రశస్తులలోలేదు. వేమన ఆటవెలదులలో నయితే సరిగా ఈ బాహ్య వేష నిరసనమే నిండిచండ తాండవమాడుతున్నది. ఈ విషయమై వేమన పద్యోదాహరణమే అక్కరలేదు. వీరి పుస్తకం ముఖపత్రంమీద అచ్చువేసిన త్రిశూలం, పట్టికలోని విభూతి దండ రుద్రాక్షలను వేమన ధరించలేదు.

వేమనకున్న ప్రశస్తులన్నింటిలోకి తిరుగులేని పెదప్రశస్తి, విలక్షణ ప్రశస్తి అతని వెర్రిపోక. ప్రశస్తి నిబట్టి మాత్రమే వేమన మత సంప్రదాయాన్ని తత్వాన్ని నిర్ణయిస్తున్నట్టుగా తమ పరిశోధనా ప్రణాళికను వెల్లడించి అలాగే

దాని బాహ్యరూపాన్ని పాటించుతూ వేమన ప్రశస్తిలో ప్రధానము ప్రథమ గణ్యము అయిన వెర్రితనపు ప్రశస్తిని ఆ పద్యాలలో వున్నప్పటికీ దానినిపట్టి చూపించకుండా ప్రక్కనపెట్టి కొర్లపాటి వేమన ప్రశస్తి పరిశీలనను ముగించారు! ఆ వెర్రిపోకల ప్రశస్తి వేమనను నాథ సంప్రదాయస్థుడనటానికి ప్రతిబంధకమైనట్టిది.

## దిగంబరులు నాథయోగులు కారు

అసలు ఆనాల్గు ప్రశస్తి పద్యాలలోనూగల శివరూప ధారణమన్నమాటకు ఇంతవరకు ఎవరు అర్థంచేసినా అది దిగంబరత్వంగానే చేశారు. వేమన చెప్పిన పద్యాలలోను, మరి యితరత్రానుగల సుప్రశస్త ప్రశస్తి అతని దిగంబరత్వమే. శివరూప ధారిత్వానికి ఆ అర్థమే చెప్పకుండా, మరే విధంగానూ ఎక్కడా ఆ ప్రశస్తిని ప్రస్తావించకుండాను తమ పరిశోధనను ముగించారు !! వారు పట్టికజేసి యిచ్చిన నాథ వేషంలో కాషాయముందిగాని దిగంబరత్వంలేదు !!! అంత మాత్రాంకూడా వారు కానరు. కొర్లపాటివారు నాథయోగులుగా చెప్పిన తెలుగు యోగులు ఆత్మారామ శ్రీనివాసభట్టులు. వారు తమ గ్రంథాలలో దిగంబర రూపం చెప్పలేదు. చూపలేదు. హఠయోగి కొలని గణపతి దేవుడా దిగంబరి కాడు; అలా కమ్మని చెప్పలేదు. కాగా నాథయోగులు గోచీ పెట్టుకొని. ఎర్రకావిగావంచాను (అంచలాన్ని) నడుముకు చుట్టుకొంటారు. కాని మన వేమన దిగంబరుడుగదా! అనేమాట కొర్లపాటికీ పట్టదు.

పూర్వ ప్రశస్తి అంటే పద్యరూప ప్రశస్తి, అక్షరరూప ప్రశస్తిమాత్రమే కాదు. వాడుక కథలుకూడా ప్రశస్తే. చిత్తరువులుకూడా ప్రశస్తే. కాబట్టి వ్రాత ప్రతి పద్యాలతో వేమన ప్రశస్తిని సరిపెట్టటం సరికాదు. వేమన రాజమహేంద్రవర పురవీధుల్లో పుల్లెలలో పులిగూడెత్తుకుని కుడిబాడనీ—వీరబ్రహ్మంగారి వెంట నడిచే శిష్యుడు వెళ్ళి వేమనను ప్రశ్నలడిగినాడనీ—వున్న గాథలు వదిలేశారు !! వేమన తంజావూరు వెళ్ళాడని, అక్కడున్న అయన బొమ్మకూడా వీరి ప్రస్తావనా పరిశీలనలకెక్కలేదు. ఏ పూర్వాంధ్ర కవీ నోచుకోని అదృష్టం

వేమనకుగల ఆ తంజావూరి బొమ్మ. వినుకొండ వీధుల్లో ఎద్దుల గుద్దులాట విడదీయటంలో వేమనకు దిగంబరత్వం అబ్బినదన్న గాథకు, తంజావూరిబొమ్మకూ బిత్తలతనం మీద వేమన ఆట వెలదులకూ కొర్లపాటి కూర్చిన వేమన పూర్వ ప్రశస్తిలో స్థానం దొరకలేదు! ఇంకా అదెట్టి ప్రశస్తో స్వస్తో వేరే చెప్పనవసరం లేదు. కొర్లపాటి కూర్చి పెట్టిన వేమన ప్రశస్తి తమ సూత్రీకరణకు తగుపాటి దనుకొన్నమేరకు ఏర్చి ఎంచుకొని, మిగతాది కత్తిరించి యిచ్చిన ప్రశస్తిగాని యథాతథమైన సమగ్రమైన ప్రశస్తికాదు. వేమన ప్రశస్తిని వారికిష్టమైన మేరకు, వారు సిద్ధాంతించదలచిన దానికి ఉపకరిస్తుందని వారనుకొన్నమేరకు మాత్రమే పాఠకులకందించారు. ఇంత దుర్మార్గమైన పరిశోధనను ఇంతవర కెక్కడా ఈ రచయిత చూడలేదు.

## బయలు చర్చలేని వేమన పరిశోధన

నిన్న మొన్నటిదాకా తెలుగునేల నాలుగు చెరగులా దట్టంగా అల్లుకొని పామర జనులను ఆకట్టుకొన్న అచల సంప్రదాయం వుంది. ఆ సంప్రదాయ మహాపురుషులలో వేమనను ముందు చెప్పుకొని ఆయన పద్యాలను ప్రవచనంతో ప్రచారంలో పెట్టి ఆయన కీర్తి పతాకాన్ని నిలబెట్టినట్టిది అచల సంప్రదాయమే. అచల సాహిత్యం వేమనను అంతర్భవించుకొన్నది. కొర్లపాటి ఉదాహరించిన పద్య ప్రశస్తి మొన్నటిదాకా వ్రాత ప్రతులకు పరిమితమై మృత ప్రశస్తిగా వుండిపోగా అచల బోధకుల భాష్య ప్రవచనం సజీవప్రశస్తిగా నిలిచివుంది. వేమన అచల ప్రశస్తి, వేమన పద్యాల వ్రాత ప్రతులలోకూడా వీరు ఉదాహరించిన ప్రశస్తులకన్నా ఎంతో ఎక్కువగా వుంది; ఆటవెలదులలో మకుట సహితంగా నిండి నిబిడంగా వుంది; ప్రాచీన ప్రతుల్లోనేవుంది. వేమన ఎంగిలి తిండి బోధసైతం అచలంలోవుంది. కొర్లపాటి దృష్టికి స్వయం బాధితంగా కనిపించే మత నిరాసక అధ్యాత్మికత అచలంలో దండిగావుంది. వేమనచెప్పిన 'తెలివిమాయ, తన్ను దెలియమాయ' అనే ఎరుక మరపులకు అవలితత్వం అచలంలో తాండవమాడుతోంది. శూన్య శబ్ద పర్యాయంగా కన్నడులు వాడిన, వేమన విస్తారంగా చెప్పిన బయలుతత్వం అచలానికి ప్రాణస్పందన. అచలంలో బయలు అనగా అర్థమేదో వేమన ప్రయోగంలోని బయలంటేకూడా అదే అర్థం.

ఇంత ప్రసిద్ధమైన వేమన అచల ప్రశస్తిని వేమన పూర్వప్రశస్తిలో ప్రస్తావించనేలేదు. వేమన తత్వమనే ప్రకరణంలోనైనా బయలుతత్వాన్ని చర్చించలేదు. బయలు ప్రసక్తిగల వేమన పద్యాలు డెబ్బదికిపైగా వున్నాయి. తెలివిమాయ, తన్ను దెలియమాయ యనే తత్వమేమిటోకూడా "వేమన తత్వము" అన్న శీర్షికలోనైనా చర్చించలేకపోయారు.

వేమన పూర్వ ప్రశస్తినిబట్టే వేమన తత్వాన్ని నాథ సంప్రదాయంగా నిరూపిస్తున్నట్టు ఒక ప్రణాళికను, ఒక చట్రాన్ని చూపటమేగాని అందులో విషయపుష్టి నష్టి; అది. ప్రాణంలేనికట్టె దూదీగడ్డికుక్కి కూరి కూర్చి నిలబెట్టిన బొమ్మ మెకం పరిశోధనా ధర్మబద్ధులై సకలమైన ప్రశస్తులను గైకొని నిష్పక్షపాతమైన నిర్ణయ నిగమనం లేకపోవడమే ఇందుగల లోపం.

## విశ్వదాభిరామకు నాథయోగీయార్థమట !

వేమన మకుటానికి త్రిపురనేని సాధించి చూపిన అర్థాన్ని ప్రశంసించిన ఆచార్య కొర్లపాటి తమ యావచ్ఛక్తినీ వెచ్చించి నాథయోగ విశిష్టార్థాన్ని వ్యాయామంచేసి సాధించిచూపబోయారు. అందుకుగాను తిక్కన తెనిగింపుతో తృప్తిచెందక వేమనగారు సంస్కృత మహాభారతాన్నే తీసి చదివారన్నారు. అందులో శివసహస్రనామావళి చదివారని, మననం చేశారని వ్రాశారు అందులో

> సర్వకాల ప్రసాదశ్చ సుబలో బలరూపభృత్
> సర్వకామవరశ్చైవ సర్వదస్సర్వతో ముఖః !!

అనే పంక్తులను పట్టి పరిశీలించాడన్నారు. ఆ సహస్రనామాలలో 999 నామాలను వదలివేసి, ఈ బంతిలోవున్న సర్వదః పదాన్ని పట్టుకొన్నాడట వేమన. వెనువెంటనే 'సర్వదాభిరామ చదువువేమ' అని వేశాడట! ఆశుకవిగావున అట్లనుటమానుకొని ఆశుకవితను వినిపించి వినుమనాలిగాని వ్రాసినట్టుగా చదువమనట వేమనుకొన్నాడట! వినురవేమయని వుంచాలని మళ్ళీ దానికను గుణముగా సర్వదుని విశ్వదునిగా మార్చి తన పద్యమకుటమును 'విశ్వదాభిరామ వినురవేమ'గా తీర్చి స్థిరపరచుకొన్నాడట, అని ఒక కాకమ్మ కతయల్లి మనకు చెప్పారు.

కాగా యిక వారిచ్చిన అర్థమేమనగా విశ్వదాభిరాముడు = విశ్వదా రాముడు అని. అభిరామ ఆరామశబ్దాలు సమానార్థకాలని. విశ్వదాభిరాముడనగా-విశ్వదుడంటే శివుడు, కావున శివారాముడు; శివునియందే రమించు వాడన్నారు. నాథయోగానికి శివునియందు రమించుమన్న అర్థముకన్న వేరేమి కావలెననుకొన్నారు.

వేమన మహాపండితుడని కొర్లపాటివారు నాకన్న ముదురుగా నిరూపించదలచారు. వేమన సంస్కృత మహాభారతాన్నే తిరగవేశారన్నారు. పైజూపించిన అనుష్టుప్పును పఠించారన్నారు, అందున్న సర్వదపదాన్ని విశేష్యంగా తీసుకొన్నారన్నారన్నారు. అలాతీసుకొంటే అది తప్పు. ఆ శ్లోకం మొత్తంగా విశేషణాలేగాని మచ్చుకొక్కగానొక్క విశేష్యంలేదని ఎవరైనా చెప్పగలరు. చిన్న విషయమిది. అంతసంస్కృత పాండిత్యం కలిగిన వేమన యిందులో వీరివలె పొరపడతాడా? మహాసంస్కృత పండితుడంటూ, యింత తప్పుడర్థంతో మకుట నిర్ణయానికి చేరుకొన్నాడనటం అసంగతం.

## సహస్ర నామావళి స్వభావం

అసలది సహస్రనామావళి - ఏ సహస్రనామావళిలోనైనా తొంభై అయిదుపాళ్ళు విశేషణాలే వుంటాయి. వానిలో ఎల్ల దేవతలందునా చెల్లే విశేషణాలేకదా! ఆయా దేవతల ప్రత్యేకతలను చెప్పే విశేష్యాలు, నామధేయాలు అత్యల్పం. కాకపోతే ఎంతపెద్ద దేవతలకైతేమాత్రం నిజంగా వెయ్యేసి పేర్లంటూ వుంటాయా? వున్నాయా??

సర్వకాల ప్రసాదుడనేమాట శివునియెడల సర్వేసర్వత్ర సర్వులూ వాడటం సర్వసామాన్యమా కానేకాదుకాని మహాభారతం వాడింది. శివుడు ఉగ్రుడు. లయకారుడన్నది ప్రసిద్ధం. శివుడు దక్షిణామూర్తి అనే మాటకూడా అంత వాడుకగల మాట కాదు.

సర్వకాలప్రసాదః, సుబలః, బలరూపభృత్, సర్వకామవరః, సర్వతోముఖః అంటూ అందున్న పదాలవలెనే సర్వదఃకూడా ఒక విశేషణమే. దీనితోపాటు ఆ పదాలన్నీ ఎందరెందరో దేవతలకు వర్తింపజేయవీలున్నవే గాని ఏ వొక్కరికోమాత్రమే ప్రత్యేకంగా ప్రయోగింపబడుతున్నవి, బడవలసినవీ గావు. సర్వతోముఖ పదముంది. ఇక్కడ శివనామావళిలో వచ్చిందికాబట్టి శివునికి చెందింది. శివుడని మనం చెప్పుకోవటం ప్రాకరణికం. అదే భగద్గీతలో

విశ్వరూప సందర్శన యోగంలోవుంటే విష్ణునకో, కృష్ణునికో చెందుతుంది. వేదంలో పురుషసూక్తంలోవస్తే విరాట్పురుషుని కన్వయిస్తుంది. అలాగే సర్వదపదంకూడా ప్రాకరణికార్థంలో పడుతుంది. ఇక్కడ శివనామావళీ సందర్భంలో శివపరమైంది. గోరక్ష సహస్రనామావళిలో గోరక్షపరమవుతుంది. ఇక్కడేకాదు.ఇంకెక్కడాకూడా సర్వదపదం కేవలం శివపర్యాయపదంగా వాడబడరేదు. అది కొర్లపాటికే తెలుసు. అయితేనేమి? వారి యిష్టాన్నిబట్టి అక్కరను బట్టివిశేష్యంగా వివర్తించెందింది. విశేషణంగా వాడినజాడ కొర్లపాటి మనకు చూపలేదు. చూపలేడు. సర్వమితి భ్రాంతిపర్వం.

విశ్వదాభిరాముడంటే శివారాముడనే మాటకు అవకాశం ఉన్నప్పటికీ, అది నాథయోగానికి మాత్రమే వర్తించే అర్థం ఎంతమాత్రం కాదు. పైగా, శివారామతలో నాథమత ప్రత్యేకత కూడా ఏమిన్నీలేదు.

నాథమతంలో శైవంవున్నది. కాని శైవమంటే నాథమతమొక్కటేకాదు. అలాగే నాథమతంలో వున్నది శైవమొక్కటేకాదు. వైష్ణవంకూడా వున్నది. ఆ మాట కొర్లపాటికీ డెలుసు. శివారామత నాథశాఖకే ప్రత్యేకంగా చెందిన ఆస్తి కాదు, నాథశైవం ప్రాచీన శైవమూకాదు. పాశుపత కాలాముఖ కాపాలిక సిద్ధరసేశ్వర శైవశాఖలు, తమిళుల, ఔత్తరాహుల భక్తిశైవసిద్ధాంతాలు, స్మార్తశైవము నాథశైవానికి ముందే ప్రవర్తిల్లినై. నాథమతం తర్వాత ప్రత్యభిజ్ఞాశైవం వీరశైవం వంటివీ వున్నాయి. వీరు చెప్పిన శివారాముడనే అర్థం శైవశాఖలన్నింటికీ సమంగా చక్కగా వర్తిస్తుంది. నాథులలో వైష్ణవ నాథులున్నారు గాని నాథేతరమైన యీ శైవశాఖలలో వైష్ణవ స్పర్శలేదు. అంతేకాదు, ఉగ్రశైవాలుగా అవి నాథశైవానికి తీసిపోయేవికావు. ఉగ్రతలో ఏకాగ్రతలో ఒకమెట్టు పైనే వుంటాయి. కాగా వేమన పద్యాలలో శివశీలత, శివయోగిత, శివతత్త్వము, శివాభిరతిగూర్చి చెప్పినదెంతోవుందని కొర్లపాటి ప్రోగుచేసి కుప్పవేసినదంతా నాథమతానికి నిరూపణ మాత్రం కాజాలదు.

అంతేకాదు భారతంలోని శివసహస్రనామం వేమన మకుటానికి జన్మస్థానమనటమే కొత్త(వింత)గావి, మకుటానికి శివపరమైన అర్థం చెప్పటం

కొత్తకానేకాదు. చాలాచాలా పాతసంగతి. వారూ నేనూ పుట్టక ముందటి సంగతి. దాదాపు డెబ్బై ఏళ్ళనాటి సంగతి. ద అనగా ఖండించుట అనికూడా కలదని, విశ్వదుడు = విశ్వసంహారకుడు శివుడని పానుగంటి లక్ష్మీ నరసింహంగారు చెప్పేవున్నారు. కాని విశ్వమును ఇచ్చువాడనడంలో శివుడొక్కడేకాదు-విష్ణుబ్రహ్మలుకూడా యిచ్చువారే. విశ్వలయ కర్తమాత్రం శివుడే. పానుగంటివారి యీ యర్ధంలో అతివ్యాప్తిలేదు. కాని ద శబ్దానికి అతివ్యాప్తి వుంది. విశ్వదుడు - విశ్వలయకారుడు - శివుడు అనటంలో అతివ్యాప్తిలేదు-అతి నిర్దిష్టతవుంది. కొర్లపాటివారింత వ్యాయామంచేసి మన కిచ్చింది ఏమిటి? పానుగంటివారి అర్థాన్నేనా? అదికూడా పరాస్తమైన యర్థం కదా!

అట్టి అర్థానికే రాళ్ళపల్లివారి అక్షేపణ గడవరాని గండంగా వుండిపో పోయింది. అందుచేత శివాభిరాముడు, శివారాముడు అనే అర్థంచెల్లని అర్థంగా చరిత్రలో మిగిలిపోతుంది. ఐనా కొర్లపాటివారు అదే అర్థాన్ని యింకో ద్వారంలోనుంచి తేవడానికి యత్నించారు; తీరా వారు ఘట్టకుటీ ప్రభాత న్యాయాన్ని నిరూపిస్తున్నారు.

వేమన తొలుత తిరుగుబోతు - సానివాడ సరదారు. పిదప సంసారి. అపైన సన్యాసి. అతడు తిరుగుబోతుగానే కవితను-బూతు కవితను చెప్పిన వాడు. సానివాడ సౌభాగ్యాన్ని సంకీర్తించినవాడు. ఆడుదాని సొడు అరచేతిలో పట్టుట....వంటి బూతు ఎంతో వ్రాసినవాడు, అట్టి ఇంద్రియారాముడు. అట్టి వేశ్యాభిరాముడు శివారాముణ్ణని విశ్వదాభిరాముణ్ణని తన్నుదా జెప్పుకోవటం పొసగదు. అదే రాళ్ళపల్లి అక్షేపణ. దాన్ని ముందుంచుకొని దాన్ని అధిగ మించే అర్థం చెప్పుకోవడం అనంతరులమైన మన కర్తవ్యం. కాని దానినావలకు నెట్టి అదొకటి అసలే లేనట్టుగా నటించి తమకు తోచిన అర్థం తాము చెప్పుకు పోయిన మహాత్ముల వొరవడినే వీరూ నడిచారు.

విశ్వదాభి రాముణ్ణి శివారామతా నిరూఢాత్మనిగా తిక్కన మాటల్లో బిగించినకొలదీ వేశ్యారమణ మగ్నుడుగా జెప్పిన పద్యాలు వేమనవి కాదంటు న్నామనో, అసలాదశ వేమనయందు లేదంటున్నామనో ఫలితార్థమవుతుంది. కొర్లపాటి వేమన తిరుగుబోతు దశను కాదనటంలేదు. వేమన మొదట రాగి,

పిదప విరాగి అనటమేగాని అర్థమందుకు తగినట్లు చెప్పుకోలేకపోయారు. అభ్యుపేతహాన దోషానికి, పూర్వాపర విరోధాలకు తావిచ్చారు. వేమన తన మకుటాన్ని నిర్ణయించుకొనే సరికే శివయోగియేగాక పూర్తిగా నాథయోగి హఠయోగి అయిపోయివున్నట్టు యీఅర్థం చెప్పారు !!

## కొండవీడు పద్యం : హఠయోగం

అలాగే వేమన కొండవీడులో భార్యతో కాపురం చేస్తూనే కాపురమున్న వీధిమొగినున్న యింకొక యింట్లో ముక్తిమార్గారూఢతవరకూ హఠసాధన పూర్తిచేశాడని అనుకోవలసినట్టుగా ఒక పద్యానికి అర్థం రాబట్టారు. "ఊరు కొండ వీడు — ఉనికి పశ్చిమవీధి - మూగసేతకెల్ల మొదటియిల్లు [మూకచింత కెల్ల మొదటి యిల్లు] - అరసి చూడజూడ నదిముక్తిమార్గమో" అన్న పాఠమే పాఠంగా ఎంచుకొని యిచ్చిన అర్థంయొక్క అర్థమే అది అర్థసేపథ్యమేయది. అతర్కితోపనతమేమో మనకు తెలియదు. వారే చెప్పాలి. సాంసారిక హఠ యోగగాంధికమయింది యీ పద్యం వీరి వివేచనలో!

## నాథులు సాంసారిక హఠయోగులా ?

ఉనికి పశ్చిమవీధి - పశ్చిమ వీధిలో కాపురం—కాగా, మూగసేతకంతా మొదటియిల్లు. ఎక్కడ మొదటియిల్లు? అదేవీధిలో మొదటియిల్లని వారనుకో మన్నట్టే అనుకొందాము. మూగసేతలో అదేపనిగా చూచినచో అది ముక్తి మార్గమగును. మూగసేత —ధ్యాన సమాధి, అనగా యోగ మార్గము. అది సహజ మార్గముకాదు. హఠయోగ ప్రదీపికా శ్లోకం చెప్పింది కాబట్టి ఆ శ్లోకం చదివిన వెంటనే యీపద్యం చదవగా కొర్లపాటికి వేమన వేరే యింట ధ్యానసాధన చేసినట్టు తటుకున తట్టింది.

'ధ్యాన సమాధి' అన్నది హఠయోగానికి నాథయోగానికి మాత్రమే సంబంధించినట్టిది కాదు. ధ్యానము హఠయోగ ప్రత్యేకతకాదు. ధ్యానం అన్ని యోగాలలోనూ వున్నది. సహజయోగంలోనూ వున్నది. తంత్రసాధనలలోనూ వున్నది. వైదిక యోగంలోనూ వున్నది. బౌద్ధులకు ధ్యాని బుద్ధులే ఉన్నారు. జైనుల ముని సంప్రదాయం చాల కఠినమైనది. అందుచేత మూగసేత, మూక

చింత అనగా ధ్యానం, అనగా హఠయోగం అనవలసిన ఆవశ్యకతలేదు; అగత్యంలేదు. ఈ ఒక్కపద్యంవల్ల అంతకన్నాలేదు. పండితుల ఏమరుపాటునీ, సాధారణ అజ్ఞానులనీ భావించుకొన్నవారి శోధన బోధన పాఠసాధన అంతా యిలా జరుగుతోంది!

ఇక మూక (గ) చింతమాట. చింతన మౌనంగా వుండటమంటే అదిచింత అనిపించుకోదు. జపమవుతుంది; మరొకటవుతుంది. చింత, చింతన సమాధి కాదు. కాగా వేమన మూక చింతనెందుకు ప్రయోగించాడన్నదే ప్రశ్న. మూక చింతన ఒప్పుకొని మూగచింతను ఒప్పుకోమనలేరు. ఈ రెండు మాటలు తెలుగు తత్వకవితలలోనే వస్తాయి. అదొక ప్రత్యేకత. దానికి కారణముంది. మూగ చింతలపాలెం, మూగ చింతని అన్న పేరున్న గ్రామాలు మనకు ఐదారు న్నాయి. అంతేగాక కాయలుకాయల చింతచెట్లను మూగ చింతలంటాము. ఆ వూళ్ళవల్ల ఆ తోపులున్న ప్రాంతాల తత్వకవులు ఆ తెలుగు మాటతో సంస్కృతపు చింతను చెప్పడానికి కుతూహలించారు.

ఆకపాస కోడికూసె చీకటింట్లో పొద్దు పొడిచె

మూకచింతల మధ్యామునను ఏగంటిలింగా ఏకమై వెన్నెలలుగాసెరా అని లక్ష్మయ్యగారు పాడారు. బ్రహ్మంగారూ ఒకచోట మూగచింతలన్నారు. వీరిద్దరికీ ఆ వూళ్ళు దగ్గర్లోవున్నవే. అందుకే వైరి సమాసమైనా శబ్దలయ కోసమని మూగ చింతలను మూక చింతలుగా మార్చుకొన్నారు. దానిని మూక చింతనగా పండితలేఖిని దిద్దితే ప్రతీక కవితా మాధుర్యం చచ్చిపోతుంది. మన తత్త్వ పదాలూ ప్రతీక కవితా నిధానాలే.

## మళ్ళీ బ్రౌనే శరణ్యం!

ఇక మూగచింతపల్లె మొదటియిల్లు అనే పాఠం ప్రాచీనమైనదైనా సమీచీనంకాదని, మూగ చింతపల్లె మొదటియూరు అనివుంటే సమీచీనంకాగలద దన్నారు కొర్లపాటి. కాగా, ఊరుకు బదులు వీడు అన్న పాఠముంటే ఒప్పుకోక తప్పేదిలేదు. నిజంగా అటువంటి పాఠం వుండనేవుంది. డాక్టర్ గోపీగారిచ్చే వున్నారు.

ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి, మూక చింతపల్లె మొదటివీడు
అరసి చూడ బయలు అది ము క్తి శివుడయా....

[డి-1723 వ ప్రతిలో 171 వ పద్యం]

మూగసేత కెల్ల మొదటివీడు అనే పాఠంకూడా వుంది. మూగ చింత కడకు ముందరిల్లు అనీవుంది. ఎటుదిరిగీ మూగసేత కెల్ల మొదటి యిల్లు అనే పాఠం వ్రాతప్రతుల పాఠం కాదు. మూక చింతకు, మూగ చింతకు బదులు మూగ సేత అనేమాటగల పాఠమూ ఒక్కటే ఒక్కటి. అదీ మూగసేత కెల్ల మొదటి వీడుగా వుంది గాని మొదటి యిల్లుగాలేదు. వీరు చూపినట్టు "మూగసేత కెల్ల మొదటియిల్లు" అని ఏ వ్రాత ప్రతిలోనూ లేదు. అది బ్రౌన్‌దొర పరిష్కృత పాఠం; అర్వాచీన పాఠంకూడాకాదు. వ్రాత ప్రతుల పాఠాలేవో కానివేమో అంతా అచ్చుకెక్కిన వేమన పరిశోధ నాగ్రంథాల్లోనే వుంది. కొర్లపాటి వారికిదంతా తెలియవలసిన సంగతే. బ్రౌను పరిష్కృత పాఠం వారు చెప్ప దలచిన సిద్ధాంతానికి అవకాశమిస్తుందనే ప్రలోభంతో దానినే స్వీకరించారు. బ్రౌనును తేలికజేసి వ్రాసి, కక్కుర్తికి బ్రౌను పాఠాన్నే వాడుకొంటున్నారు.

ఇప్పుడు మూగసేత సంగతి. మూక చింతకు ధ్యానమొక్కటే అర్థంగాని మూగసేతకు అసలు ధ్యానమొక్కటే అర్థంకాదు. నేనూ ధ్యానమనే అర్థం యివ్వకపోలేదు. కాని ధ్యానమన్నప్పటికీ హఠయోగంగా నేను చెప్పలేదు. గట్టిగా చెప్పుకుంటే ఆసనాలు, ప్రాణాయామం బంధముద్రలు చక్రికర్మ, వజ్రోళి, సహజోళీ, అమరోళి, కుండలినీయోగం, చక్రభేదనం... అన్నీ మూగ సేతలేగాని వాక్కుతోడి చేతలుకావు. తాంత్రిక సాధనకూడా మూగసేతే. ప్రత్యేకగృహం హఠసాధనకేకాదు; తాంత్రిక సాధనకూ కావలసిందే. దానికి మరింతగా కావాలి. ప్రత్యేక గృహం కావాలనటానికే అయితే, హఠయోగ ప్రదీపికా శ్లోకోల్లేఖనం శుద్ధ అనవసరం. అందులో చెప్పిన నిర్మాణమంతా గల యిల్లు వేమన పద్యంలో లేదు. దానిని ఉల్లేఖించడం అయోగ్యం. సదుద్దేశయుతం కాదు. ఐనప్పటికీ వేమన హఠయోగసాధన చేసినవాడేయని నేనే వెనుకటికాలంలో చెప్పివున్నాను కొండవీటి పద్యపాఠం ఏది తీసుకొన్న ప్పటికీ, అది వేమనను యోగిగా చెప్పుతుంది. అట్లనీ నేను చెప్పే వున్నాను,

కాకపోతే హఠయోగాన్ని వేమన కొండవీటిలోనే సాధించాడనిగాని, అది

ఆ వూరి పశ్చిమ వీధిల్లోని మొదటింట్లోనే సాధించాడనిగాని-అసలు వేమన హఠయోగియనిగాని కొండవీటి పద్యము నిశ్చయముగా చెప్పడానికి సరిపోదు.

వేమన నాథయోగి-అని చెప్పడానికి నాథయోగం వేమననాటికి ఉన్నదని వేమనలో నాథయోగంలోవున్న విషయాలే వున్నాయని. నాథయోగంలోలేని వేమీలేవని చెప్పడం చాలును; అసలంతేకావాలి. కాని కొర్లపాటివారు నాథ యోగం వేమనకు ముందు తొమ్మిది పది వందలేండ్లనుంచి. అనగా ఆరవ శతాబ్దినుంచీ వున్నదని చెప్పటానికి, అనగా యితర పరిశోధకులెవ్వరికన్నా రెండు శతాబ్దాలు ముందుకు జరపడానికి ప్రబలంగా యత్నించారు. అంత పరి శ్రమకు నేను కారణమైనందుకు వివేచించకుండా వదలివెయ్యరాదు.

## తిరుమంత్రమా? తిరుమందిరమా ?

తమిళ శైవములో తిరుమూలర్ వ్రాసిన తిరుమంత్రమొకటున్నది. కాని దానిని తిరుమందిరమని ఆచార్యులవారు పొరపాటు వ్రాతవ్రాశారు. కాని తిరు మందిరమన్న తర్వాత అది హఠమందిరమని వ్రాయక విడిచారు. అది మన అదృష్టం. ఆ రచనలో నాథమత విషయాలున్నవి. తిరుమూలర్ జీవిత పురా ణంలో గోరక్షుని చాయలు వున్నాయి. ఆచార్య కొర్లపాటి వాటిని పూసగుచ్చి నట్టు చెప్పారు. వాటినిబట్టి నాథమతం తిరుమూలర్‌కు ముందటిదని నిర్ణ యించారు.

కాని తిరుమంత్రము ప్రక్షిప్తాల పుట్టయని తమిళ పరిశోధకుల నిర్ణయం. తమిళ శైవశాస్త్రాలలో శివజ్ఞాన సిద్ధియర్ ఈ తిరు మంత్రాన్ని ప్రస్తావించకుండా వదిలేసిందట; హఠయోగ మార్గాన్ని చెప్పుతూకూడ వదిలే సిందట. సంబందారు అప్పారులకంటె తిరుమూలరు పూర్వుడు; ఇంచుమించుగా వారిద్దరి రచనలంత విస్తృతిగల రచన చేసినవాడు. ఆ రచనను ప్రబలమైన కారణం లేకుండా శివజ్ఞాన సిద్ధియార్ వదలివెయ్యలేదు. ఆయన నాటికి అందులో హఠ విషయాలు లేకపోవాలి. అంత విస్తృతి గలిగి అంత పురాతన రచన అప్పారు సంబందార్ల తేవారముల మాదిరిగా తమిళ జన జీవిత ప్రవాహములో నిత్యపారాయణాభాగ్యానికి నోచలేదు. కాని తమిళ భక్తి శైవ సాహిత్యంలోకెల్ల మణిపూస అనిపించుకొన్న పంక్తిమాత్రం తిరు మూలర్ తిరుమంత్రంలోనిది. అన్బెశివం - ప్రేమే శివుడు అన్న వాక్యం. కాని భక్తి ప్రవాహానికి యోగం - హఠయోగ సాధన ఒక విధంగా అడ్డుకట్ట; రెంటికీ

పొంతన యించుమించు సున్న. అదే తెలియవలసింది. అనేకములతోపాటు హఠాదియోగ భాగములన్న తిరు మంత్రములోని ప్రక్షేపములుగా తమిళ పరిశోధకులు చూస్తున్నారు.

"None of them (the sixty three Nayanars) ever performed any austerities of the Hatayogatype. Dont remind me of Thirumoolar. For all appearances, they were just ordinary house-holders.

జి. వాల్మీకనాథన్, ఆంగ్లీకృత పెరియపురాణ పీఠిక.

## హర్ష చరిత్రలో వున్నది నాథయోగంకాదు

బాణభట్టు హర్షచరిత్రలో విరూపాక్ష భైరవాచార్య వర్ణనలో కొర్లపాటి నాథసిద్ధుల ఆకార వేషభాషా విశేషాలున్నాయని చెప్పారు, చెప్పి ఆ రచన నాటికే, ఏడవ శతాబ్దినాటికే నాథ సంప్రదాయ భైరవతంత్ర సంసర్గము" జరిగినదంటున్నారు. అందులో—

1. కార్పటిక బృంద పరివేష్టనము. 2. ప్రలంబశ్రవణపాళీ ప్రేంఖిత కుండల ధారణ. 3. ధ్యానలబ్ధ జ్యోతిర్విశేషము. 4. పర్యంక బంధ మండలితామృత ఫేనశ్వేత యోగ పట్టము. 5. సర్వ నిమంత్రణము నాథ సంప్రదాయమునకు జ్ఞాపికలు" అన్నారు.

ఇక ఇందులో సర్వ నిమంత్రణము, ధ్యానలబ్ధ జ్యోతిర్విశేషము అన్నవి తాంత్రికులేగాక వైదిక యోగులుకూడా చెప్పే సర్వ సామాన్యాంశాలు. ధ్యానం సర్వ సాధనలలోను వుంది. ఆ నిష్ఠవల్ల దేహకాంతి, ముఖకాంతి మొదలైన ప్రకాశమానతలు వుంటవనేది అతి సాధారణ విషయం. తాంత్రికులు మాంత్రికులు యాంత్రికులు వైదిక యోగ సాధకులు అందరూ నిమంత్రణ మహిమలు కలవారే. ఈ విషయాలనుకూడా నేను చెప్పవలసి రావడం దురదృష్టం. ఇవి విశేష విషయాలుకావు.

పర్యంకబంధ.... యోగ పట్టము అనగా పర్యంకాసనమో, జాలంధర ఉడ్డి

యాన మూల బంధాలనే బంధత్రయంమీద మరో బంధమో కాదు. నడుమును మోకాళ్ళను కలిపి చుట్టగా కట్టుకొన్నట్టి తెల్లనిబట్ట (యోగ పట్టము). తెల్లనియోగ పట్టెతో నడుము మోకాళ్ళను కలిపి కట్టుకొని భైరవాచార్యుడు కూర్చున్నాడు. పల్లెటూరి రచ్చలో మన పెద్దలలా కూర్చుండటం యిప్పటికీ యింకావుంది. అదేయిది.

ప్రలంబ శ్రవణపాళీ ప్రేంఖిత కుండలుడు – అనగానే కాన్ఫటా నాథ యోగులు గుర్తురావచ్చు. కాని తాంత్రికులు కాపాలికులు నాథులకు పూర్వమే కుండలధారులు. మైత్రి ఉపనిషత్తులో "వృథా కషాయ కుండలినః కాపాలినో" అని వారి వేషవర్ణనవుంది. వ్రేలాడు చెవియంచులందు ఊగించబడిన కుండలాల కాపాలికులు ఎప్పుడో వున్నారు. భైరవార్చన, భైరవ నామధేయమే కాపాలికులది. భైరవాచార్యునిలో నాథయోగిని చూచేయత్నమే సాహసం.

కార్పటిక బృంద పరివేష్టితుడు– చినుగు పాతలు కట్టుకొనే పరివారం మధ్యనున్నవాడు. కార్పటికులంటే వ్రతినః వ్రతులన్నారు. ఏ వ్రతమువారో చెప్పలేదు. మహావ్రతులు కాపాలికులు. కంథ, కంథటిక కాపాలికులది.

ఈ వేష విశేషాలు, మంత్ర నిమంత్రణ, ధ్యానలబ్ధమైన తేజస్సు అనేవి నాథసిద్ధుల విశిష్టతకాదు. భైరవ తంత్రాచార్యులైన కాపాలికుల శుద్ధ ప్రసిద్ధ వర్ణన. నాథ, తంత్ర సంప్రదాయాల కలగలుపును హర్షచరిత్ర చూపడంలేదు.

ఆ హర్ష చరిత్రలోనే ఆ భైరవాచార్యుడే "మహా పశుమాంస విక్రయ ప్రాప్త వైద్యుత కపిల ప్రభాపుంజసదృశ నైజతేజం" కలవాడుగా చేసిన భట్టబాణుని వర్ణనను వీరు చూచి, చదివి ఎత్తివేశారుగాని అదే కాపాలికత! ఇదీ వీరి పరిశోధనలోని సత్యారాధన, ప్రామాణికత. 7వ శతాబ్దిలోనే కాపాలికులు నాథసిద్ధుల వేష విశేషాలను అలవరచుకోవలసిన అవసరం రాలేదు.

## భవభూతి కాపాలికం నాథయోగంకాదు

8వ శతాబ్ది మాలతీ మాధవంమాట– "ఇందు శక్తినాథుడు 'షడధిక దశనాడీ చక్రమధ్యస్థితుడు', 'షడంగ చక్రనిహితుడు' 'నాడీ' 'సాధనమున పంచామృతాకర్షణము చేయుటవలన ఆకాశ యానము" అనే మాటలవలన నాథ మత ప్రత్యేక స్వరూపము వున్నదన్నారు కొర్లపాటి. శక్తినాథుడనే పేరే శాక్తేయాన్ని కాపాలికాన్ని చెప్పును.

హర్ష చరిత్రలో బాహ్యారూప వేషభూషలను చెప్పగా, మాలతీ మాధవం లోని పదబంధాలలో దేహ అంతరిక నిర్మాణ విషయాలు, తంత్రంలోను యోగ తంత్రంలోను ప్రసక్తమైన నాడులు చక్రాలు అమృతాకర్షణం వున్నాయి. ఇందలి నాథయోగ విశేషాలు కపాలకుండలాతంత్ర సాధనలోనికి వేరగా అమె సాధన తంత్రయోగాల సంపర్కాన్ని నిరూపిస్తున్నదని కొర్లపాటి మాట. కాని ఇది చాలాపొరపాటు మాట.

షోడశనాడీ చక్రం గుద స్థానంలో మూలాధార చక్రంలో వుంటుందని, అదే కుండలినికి–శక్తికి–స్త్రీత్వానికి స్థానమని–శిరస్సులోని సహస్రారం శివ స్థానము పురుష స్థానమని ప్రసిద్ధి. నాథయోగంకూడా అదే చెప్తుంది. కాని మాలతీ మాధవ కథనం దీనికి శుద్ధవిరుద్ధంగా వుంది. తలక్రిందులుగా వుంది. కొర్లపాటి దీనిని కాదనలేదుగాని శివుడు- చక్రాలు- షోడశనాడులు- అమృతాకర్షణం– ఆకాశగమనం అందులోవున్నవి కదా. వారికి అంతేచాలు, గాన అదే నాథయోగమన్నారు. అది శుద్ధ తప్పు. నాథయోగంలో అలాలేదు. అలాగున్నది తొలుతటి బౌద్ధ తంత్రాలలో.

## ప్రాచీన బౌద్ధతంత్రం - చైనీయుల టావో

ప్రాచీన బౌద్ధతంత్రం పురుషస్థానాన్ని అధశ్చక్రంలోను, స్త్రీ స్థానాన్ని శిరశ్చక్రంలోనూ చెప్పింది. అందలి పురుషుడు ఉపాయం, స్త్రీ ప్రజ్ఞ కాగా ఉపాయ ప్రజ్ఞల సమావేశమే తంత్ర సాధనాలక్ష్యం. ఉపాయం వజ్రసత్త్వ బుద్ధుడు–ప్రజ్ఞ తారాదేవి, వజ్ర సత్వబుద్ధుని మేల్కొల్పగా చక్రభేదనం గావించిన వజ్ర సత్త్వుడు సహస్రారంలోని తారాదేవితో కలుస్తాడు. ఈ విధమైన తాంత్రిక స్త్రీ పురుష భావన చైనీయుల టావోలో బహుప్రాచీనంగా వున్నది. బౌద్ధ తంత్రంలో అనంతరకాలంలో యిదే తలక్రిందులై ప్రజ్ఞా శూన్యతలన్నవి స్త్రీ పురుషాంశములుగా, శూన్యత వజ్రమూ మణిగాను ప్రజ్ఞ పద్మముగాను బౌద్ధ పంచాక్షరి షడక్షరి డోంబి, సహజసుందరి.... పేర్లతో స్త్రీగాను భావితమై మణిపద్మేహుం అనే మంత్రంతో బౌద్ధ తంత్రం స్థిరపడింది. ప్రాచీన తంత్రము యిందుకు భిన్నంగా వుండేది. ఆ ప్రాచీన బౌద్ధ తంత్ర భావమే కాపాలికంలో

స్వీకృతమైె మాలతీ మాధవచిత్రణ అయింది. అంతేగాని మాలతీ మాధవ కాపాలిక తంత్రంలో వున్నవి నాథయోగీయాంశాలుకావు. అప్పటికి నాథయోగాంశాలు భవభూతికి అశ్రుత గోచరాలు.

ఈ విధమైన ప్రాచీన బౌద్ధ తాంత్రిక భావన కొర్లపాటివారు ఉదాహరించిన గ్రంథాలలోనే వున్నది. అదే తర్వాతి కాలంలో తలక్రిందులుగా మారిందని కూడా వున్నది. ఇవి వారి ఎరుకను మీరిపోనవి.

నాథ సంప్రదాయంలో షట్చక్రాలమాట విన్నాను గావి షడంగ చక్రాలను వినలేదు; అలాగే, శివుడు షడంగ చక్రనిహితుడు, షడధిక దశనాడీ చక్ర మధ్యస్థితుడు అనీ వినలేదు. అమృతాకర్షణం విన్నానుగాని, పంచామృతం సంగతి నాథయోగంలో విన్నానుగాను! ఇవేమైనా నాథయోగ సాహిత్యంలో వున్నట్టు కొర్లపాటివారి ఎరుకలోవుంటే మనకు వివరించినవారుకారు; ఆకరమిచ్చిన వారుగారు! మన దురదృష్టం!

## భర్తృహరిలోనూ నాథయోగంలేదు

భర్తృహరి వైరాగ్యశతకం నుంచి కొర్లపాటి వారు ఉదాహరించిన, ఉదాహరించని శ్లోకాలొక్కగానొక్క దానిలో నాథయోగ స్పర్శ అంటూలేదు. శివుడుబద్ధపద్మాసనం- యోగనిద్ర-కంథలు తప్ప గాఢమైన యోగ సంభారమే అందులో మృగ్యం. శివుడు-యోగం అన్నంత మాత్రానికే నాథయోగం కాదు సుమా! అంతమాత్రానికే అలా అంటే భ్రమ అవుతుంది.

భర్తృహరి శతకంలో స్త్రీ నిరసన వుంది కావున అతడు నాథ సంప్రదాయస్థుడనటానికి మంచిదాఖలా అన్నారు వీరు. కాని దానితోపాటు గొప్ప శృంగార సుభాషితాలు సంభోగ పార్యంతికంగా కూర్చి వున్న సంగతి అందుకు ప్రబలా క్షేపకంకదా! పోనీ స్త్రీనిందను స్త్రీ శృంగారానుభవాన్ని కలిపి చెప్పిన భర్తృహరిని నాథయోగిఅనడానికి ఆ మతం ఒప్పుతుందా అంటేలేదు! సాకల్యాన్ని తీసుకొని తీర్మానించాలిగాని, కావలసిన శకలాలెంచుకునితీర్మానిస్తే ఏమనం?

ఒక్క మరాటీ నవనాథ చరిత్రలో మాత్రమే వారు భర్తరీనాథనామం

చదివారట! భర్తరియే మనకవి భర్తృహరి, ఉజ్జయినీ విక్రమార్కుని తమ్ముడు; కాగా అతని కాలంబట్టి నాథమతకాలం ఆరవ శతాబ్దియని ఆచార్యుల నిర్ణయ మట! భర్తృనాధుడని ఒక పట్టికలోనూ, నిండుగా భర్తృహరీ నాధుడని మరొక పెద్ద పట్టికలోనూ వున్నది. ఇదంతా భర్తృహరీ నాథుని సంగతేననుకొందాము. కాని నాథ సిద్ధుడైన భర్తృహరి మాత్రం విక్రమార్కుని తమ్ముడుగాదు; భోజరాజు కుమారుడు అని ఆ పట్టికలలోనేవుంది. కొర్లపాటి చదివి ఉదాహరించిన పూర్వ పరిశోధన గ్రంథాలలోనేవుంది కాని వారది కానరో— ఎప్పటికీ కావాలనే వదలివేస్తారో వారికే తెలియవలసిన సంగతి భోజరాజులు 10వ శతాబ్దిలోగా లేరు- ఆరో శతాబ్దిలో మాత్రం అసలు లేరు. ఆ మతములో "చారిత్రక వ్యక్తులు"గా కొర్లపాటి పేర్కొన్న మైనామతీ గోపీచందులుకూడా పదవ శతాబ్దంవారే గాని ఆరవ శతాబ్దంలోని వారు కాదు.

నాథమతమనిగాని, మత్స్యేంద్ర గోరక్షులన్న పేర్లుగాని రానట్టి లేనట్టి ప్రాచీన నాథ సంప్రదాయమంటూ వొకటి ఆరో శతాబ్దినుంచి వున్నదని ఈ విధంగా చేసిన ప్రయత్నం నిష్ఫలమయింది. పైగా అది అనవసరం.

ఇంతకన్న స్పష్టాభివ్యక్తి పొందిన రూపంలోనే సహజయానం ఎనిమిదవ శతాబ్దికన్న ముందుకాలంలో వున్నది. ఆ సంగతి కొర్లపాటివారు ఆశ్రయించిన పరిశోధనా గంధ్రాలలోనే చెప్పబడివుంది.

## నాథభర్తృహరి సుభాషితకర్తకాడు

భర్తృహరి వైరాగ్య శతకంనుంచి కొర్లపాటి ఉదాహరించిన, ఉదాహరించని శ్లోకాలొక్కగానొక్క దానిలో నాథయోగ విశిష్టాంశం అంటూ ఏదీలేదు. ఉన్నదంతా యోగసాధారణమైన సగటు సమాచారము. శివుడు, శివార్చన, బద్ధపద్మాసనం, యోగనిద్ర, కంథ. కౌపీనం, దిగంబరత్వం వంటి సంగతులే. కాయసాధన, సూర్యచంద్ర సిద్ధాంతం, దేహవాదం, సుషుమ్న-చక్రాలు, శివశక్తుల సమరసవంటి నాథభావసరణే భర్తృహరి సుభాషితాలలో మృగ్యం. అవేవీలేకుండా శివుడు-యోగం అన్నంతమాత్రాన నాథయోగంకాదు. భర్తృహరి సుభాషితాలు నాథ సంప్రదాయ రచనకాదు.

స్త్రీ నిరసన భర్తృహరి శతకంలోవుంటే అంతేచాలని, అతడు నాథ సంప్రదాయస్థుడంటూనన్నారు ఆచార్య కొర్లపాటి. కాని భర్తృహరి శతకంలో స్త్రీనిందకన్నా అధికంగా స్త్రీ ప్రశంస. సంభోగ శృంగార సంకీర్తన, శృంగారోద్దీపకమైన ఋతు వర్ణన వున్న సంగతి మరుగుపరచి సిద్ధాంతించారు. అది పరిశోధన లక్షణంకాదు, సత్యాన్వేషణకాదు. స్త్రీనింద, స్త్రీ సౌందర్య సంస్తుతి– సంభోగ సుఖ సన్నుతి, వైరాగ్య సుఖ సంస్తవం– రెంటిని కలిపి చెప్పడంకూడా నాథ పద్ధతికాదు. సాకల్య సామస్త్య గ్రహణమీద తీర్మానం గాని, ఇష్టభావానురూపంగా సరిపడే కొన్ని శకలాలెంచుకొని అంతస్సాక్ష్యం యిదిగో అనటం అపమార్గం.

నాథ సాహిత్యంలో భర్తరి, భర్తృ, భర్తృహరి అనే పేర్లతో ఒకనాథుడున్నాడు; నిజమే. ఒక రచనలో అతడు ఉజ్జయినీ విక్రమార్కుడని వుంది. కొర్లపాటికి అదే చాటి తీసుకొన్నారు. కాని మరికొన్ని గ్రంథాలలో భోజరాజు కొడుకుగాను, వంగదేశంలో వొకరాజుగాను చెప్పిన సంగతి కాస్తా వదిలేశారు. అన్నిటికన్నా విక్రమార్కుని తమ్మునిగానూ భోజరాజు తమ్మునిగాను భర్తృహరిని చెప్పిన కథలు, అతడు గోరక్షా జాలంధరుల శిష్యుడని చెప్పిన కథలు ప్రధానంగదా! భర్తృహరి వంగరాణి మైనామతీదేవి సోదరుడని, వంగ రాజు గోపీచందు (గోవింద చంద్రుని) మేనమామ అనీ చెప్పిన సంగతిని దాచ గూడదు. కాల నిర్ణయంలో ఈ సంగతి ముఖ్యం. జాలంధరుని చేత నాథ మతస్థుల చెవులకు చిల్లులు, చెవి రింగులు నియమం చేయించినవాడు భర్తృహరే. సుభాషితాల్లో కంథలు కౌపీనాలేగాని ఛిన్న కర్ణాలు దర్శనాలు కానరావుసుమా. మైనామతీ గోపీచందుల కాలమే, భర్తృహరికాలం. అది పదకొండో శతాబ్ది. అందుకు రాజేంద్ర చోళుని శాసనంకూడా ధృవీకరణంగా వుంది.

నాథభర్తృహరివేరు, అతడు గోరక్షాజాలంధరుల శిష్యుడు సుభాషిత కర్త భర్తృహరివేరు–పూర్వుడు– అతడువిక్రమార్కుని సవతి తమ్ముడూ, ఆరో శతాబ్దియుడూను. అందుకే సుభాషితాలలో నాథయోగంలేదు. నాథ వేషంలేదు. ఉత్తరాదిలో భర్తృహరి కులమొకటుంది. భర్తృహరి పదాలున్నాయి. నాథ పదాలు. అవీ సుభాషితాలు పోలికా గలవికాదు.

# తమిళ సిద్ధులు నాథ సిద్ధులుకాదు

యోగులెల్ల నాథయోగులుకానట్టే సిద్ధులెల్ల నాథసిద్ధులుకాదు. సిద్ధులు పలుమతాలలోవున్నారు. జైనసిద్ధులు, బౌద్ధసిద్ధులు. రససిద్ధులు, యోగసిద్ధులు, తాంత్రిక సిద్ధులు వున్నారు. ఈ భేదజాతంలో చాలావరకు చాలా అంశాలు చైనాలో చరిత్రపూర్వయుగం నుంచీ వున్న టావో సంప్రదాయంలో వున్నవి. ఇది భారతీయుల ప్రత్యేకతకాదు. మనకన్న ఎంతో ముందుకాలాన చైనాలో క్రోడీకరించబడివున్నాయి; పుస్తకస్థమయివున్నవి. మన సిద్ధ సంప్రదాయంలోకి చైనానుంచి దిగుమతి అయిన దినుసు దండిగావుంది. మన సిద్ధసంప్రదాయంలో ప్రథమగణ్యం ప్రాచీనం అయిన తమిళుల అష్టాదశసిద్ధుల మార్గముంది. అందులో ఇద్దరు చైనీయులున్నారు. వారికన్న ముందు మన సిద్ధులవ్రాత దాదాపు లేదేమో. వారు మన తమిళంలో వ్రాశారు. అందులో ఒకరిక్కడే స్థిరపడినాడు. మరొకరు తిరిగి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ మనవారిని కొందరిని వెంటతీసుకు వెళ్ళి చాలా విషయాలు నేర్పి త్రిప్పి పంపించాడు. వెళ్ళిపోయినవాడు భోగరు; స్థిర పడినవాడు పులిపాణి.

ఆపద్దెనిమిది సిద్ధరులలో మంథాన భైరవుడొకడు. మానవల్లిరామకృష్ణకవి అతని గ్రంథంలోని అధ్యాయ శీర్షికలిచ్చి ఊరుకొన్నారు. అమృతీకరణ విశ్రాంతి, రసాయన విశ్రాంతి అనే పేర్లందులో వున్నాయి. అవే నాథుల అమృతసాధన రసాయన సాధన అనేశారు కొర్లపాటివారు. అందులో ఏమున్నదో మనకు మాన వల్లి వివరించలేదు. వీరా వానిని చదువలేదు. భైరవుని అమృతీకరణ నాథయో గుల అమృతసాధన అవునో కాదో పరిశీలించి తేల్చవలసిన సంగతి. కాని నామ సామ్యం చాలనుకొంటారు కొర్లపాటి. ఏం చేసేది? అమృతీకరణలు వేర్వేరుగా వున్నాయి. టావోలో అమృతీకరణకు ఆరు సాధనలున్నాయి.

మానవల్లి ఏవోకొన్ని ఆధారాలిచ్చి మంథాన భైరవుని కాలం రెండో శతాబ్దం అన్నారు. కొర్లపాటి దానిని కాదన్నారు; ఆరవ శతాబ్దమన్నారు. అన్నారంతే. కాని కారణాలివ్వలేదు. అతనిసంగతేకాదు, ఆ సిద్ధ సంప్రదాయా విర్భాతినీ, అందులో ప్రథములైన అగస్త్య, బోగరు కొంకణరులనుకూడా తెచ్చి

సుభాషితకర్త భర్తృహరి కాలమైన ఆరోశతాబ్దిలో పెట్టారు. పరిశోధన భ్రాంతిని దాటి కల్పనలోకి సృజనాత్మకతలోకి పురోగమించింది!

భోగరు పులిపాణుల కాలం మూడో శతాబ్దమని యిప్పటివరతకు మిళ పరిశోధనలో వున్నమాట. ఆపైన దేవీప్రసాద చట్టోపాధ్యాయ ప్రకారం వారిద్దరి రచనలు తాంత్రికదృష్టిలో నడచినవని! ఈ తమిళ సిద్ధరు సాహిత్యం యింకా సరిగా వెలుగులోకి రాలేదు. కొన్నింటిపేర్లు, విషయసూచికలుతప్ప అచ్చు కాలేదనుకొంటాను. అరవై అయిదు వ్రాతప్రతులు కనిపించాయన్నారు. ఇట్టిస్థితిలో వాటి విషయ సూచికలనుబట్టి నిర్ణయాలు చెయ్యటం తొందరపాటే కాదు, పరిశోధనతో చెలగాటమాడుకోవటం కూడాను.

బోగరు పులిపాణులకాలం క్రీస్తుకు పూర్వమని కొందరు క్రీస్తుపిదప మూడోశతాబ్దమని మరికొందరంటారు. ఆరోశతాబ్దమన్న తమిళ పరిశోధకులిప్ప టికిలేరు. అట్టిమాట ఉపత్తులులేని ఉత్తమాట, వీరిదే తమిళ సిద్ధ సంప్రదాయ ప్రవర్తకుడే చైనీయుడైన బోగరు అనే ప్రథప్రాచీనముగా వున్నదట. అది అలా వుండగా, కొంతకుకొంతైనా ఆవిషయాలువిన్న తెల్సుకొన్న దేవీప్రసాదచట్టోపా ధ్యాయులవారు ఆపైనీయుల తమిళరచనలు తాంత్రికదృష్టిలో నడచినవంటున్నా రు. ఇంకా ఈ తమిళసిద్ధ సారస్వతం పూర్తిగా వెలువడలేదు. ఆవి అరవై అయిదు వ్రాత ప్రతులట. అందులో యిరవై అయిదింటిపేర్లు, విషయసూచికలు వాని వివరణలుమాత్రమే అచ్చులో మచ్చుకిచ్చారు. ముప్పయి ఎనిమిది యింకా ముడి విప్పబడలేదు. ఇట్టి స్థితిలో ఆచార్యకొర్లపాటి బోగరు కొంకణరు అగస్త్యుల కాలం ఆరోశతాబ్ది అంటానంటారు. అదివారి యిష్టాపూర్తము.

## నాథనాగార్జునుడు : సిద్ధనాగార్జునుడు

నాథ సంప్రదాయం-స్వర్ణయోగం - నాగార్జునుడు అనే విషయం గూర్చి కొంత చెప్పటం అవసరం.

నాథ సంప్రదాయంలో స్వర్ణయోగం భాగంగాలేదు. ఆ మార్గప్రవర్తకులైన మత్స్యేంద్ర గోరక్షులు రసయోగులుగారు. ఆపైన జాలంధరమైనామతి గోపీ చంద్ర భర్తృహరుల గాథలలో స్వర్ణయోగవృత్తాంతంలేదు వంగీయ నాథ

సాహిత్యంలోనే అసలు రసయోగ ప్రసక్తి లేదని చెప్పొచ్చు.

స్వర్ణయోగం నాగార్జుననామంతో పెనుగొన్నట్టిది నాథ నాగార్జునుడు వేరు-సిద్ధనాగార్జునుడువేరు. సిద్ధనాగార్జునుడు నాథనాగార్జునుని శిష్యుడని ఆ శిష్యుని స్వర్ణయోగిగా ఆంధ్రనవనాథ చరిత్ర చెప్పింది బోధి సత్వనాగార్జునుని కథగా వున్నది.

మరాటీ నవనాథ చరిత్ర [మరొకభాషలో నవనాధచరిత్ర లేదు] గాని, యితర భాషలలోని నాథుల పట్టికలుగాని నాగార్జున నాథుణ్ణే పేర్కొనలేదు. తెలుగువారి నవనాథులలోని నాగార్జునుడనేసిద్ధుడే స్వర్ణయోగి. నాథుల సంఖ్య 8-35-84గానూ వుండి అందెందునా నాథనాగార్జునుడులేడు.

హఠయోగశాస్త్రాలలో కూడా నాగార్జునుని పేరులేదు. ముప్పయియిద్దరిని పేర్కొన్న ఆశాస్త్రాలు నాగార్జునుణ్ణి హఠయోగుల జాబితాలో చెప్పలేదు. ఆంధ్రహఠయోగులు ఆత్మారామ, శ్రీనివాసభట్టులు వ్రాసిన హఠరచనలలోనే నాగార్జునుని హఠయోగిగా వ్రాయలేదు. నాగార్జున నాథసిద్ధుడు గౌరవ కల్పన కావచ్చు.

చౌశీతిసిద్ధుల జాబితాయేగాని చౌశీతినాథుల జాబితాయని నాథసాహిత్య మట్టి దొకదాన్ని మనకివ్వలేదు. చౌశీతి సిద్ధులు బౌద్ధసిద్ధాచార్యులు. తాంత్రిక సిద్ధులు. నాథయోగులని ప్రసిద్ధులైనవారి కొన్ని పేర్లు ఆ బౌద్ధ సిద్ధాచార్యుల పట్టికల్లో చేరినై అంతే.

ఆచార్య కొర్లపాటివారి పరిశోధనా సరళిని నిర్ణయాలను పట్టిచూపించిన దేమో చూపించాము. సుదీర్ఘంగానే చూపించాము. గాఢ విషయాలనే చర్చించాము. సర్వసమగ్రంగా సమీక్షించాలంటే వారి గ్రంథానికి రెండింతలవు తుంది. ఆ గ్రంథం గత నిర్ణయాలను సత్యదూర విషయాలను పాఠ పరిష్కరణలను, కత్తిరింపులను, కామాపులను, మార్పుచేర్పులను, అర్థనిర్ణాయకశక్తి విన్యాసాన్ని కావలసినంత చూపించాము. పరిశోధనలో తూచాలుతప్పకుండా పాటించవలసిన ప్రమాణాలకు చెల్లుచీటీలివ్వడం చూచిన తర్వాత యికనింతటితో తద్గ్రంథ వివేచనను చాలించటానికి పాఠకులు

అనుమతిస్తారనుకొంటాను. ఈ విమర్శపై వారు, వారి పీఠికాకర్తలవంటి వారెవరుగాని సమాధానించనున్నట్లయితే అది అవకాశంగా గ్రంథాంతంగా సమీక్ష అప్పుడే వ్రాయవచ్చని యిప్పటికిఈ "ఖండన ఖండఖాద్యం ముగించి తంత్రాచార సాధనలకు, అవే ప్రాతిపదికలుగా రూపొందిన నాథయోగ సాధనలకు మూలమాతృకాప్రాయమైన టావో సాధనా వృత్తాంతాన్ని మన తంత్రంతో నాథయోగంతో పోల్చిముగించితే నిజంగా యోగవిజ్ఞాన భాండారానికి కొంత సేవచేసినవారమవుతాం.

## చైనీయుల టావో - భారతీయులయోగ తంత్రం

భారతీయ తంత్రశాస్త్రం ప్రకృతి పురుషులు, శక్తిశివులు అంటుంది. చైనీయ తంత్రమైన టావో (Taiolam) యిన్ – యాంగులంటుంది. యిన్– స్త్రీ, యాంగ్-పురుషుడు. స్త్రీ తత్వమైన యిన్ నిష్క్రియం, ఉదాసీనం అచలం. పురుషతత్వమైన యాంగు క్రియాశీలం. ప్రచురమైన భారతీయ తంత్ర సంప్రదాయానికిది పూర్తిగా భిన్న భావన. కాని చైనీయభావనవంటిదే భారతీయుల తొలితంత్రాలలో వుంది. సహజయాన పూర్వ బౌద్ధ తంత్రాలలోను, భవభూతి చెప్పిన కాపాలికతంత్రంలోను చూచే వున్నారు.

టావో తాంత్రికసాధన అష్టాంగసాధన. అందులో తొలిమూడు సాధనలు వీర్యరక్షా వీర్యవర్థన ప్రక్రియలకూ స్థూలవీర్యాన్ని సూక్ష్మబిందువుగా పరివర్తన చెందించే ప్రక్రియకూ చెందినవి. అందుకుగాను బ్రహ్మచర్యం పాటించి చేసే సాధన ఒకటి. స్త్రీపురుషమైథునరూప సాధన మరొకటి. మైథున చర్యలో ఒకరు స్ఖలనంకాకుండా నిరోధించుకొని రెండవవారి స్ఖలితద్రవాన్ని అవయవం ద్వారా నాభిదిగువనుండే రసక్షేత్రంలోకి పీల్చుకుని అక్కడ రెంటిని కలిపి ప్రాణవాయువుచేత పైకి వూదేసి, కొన్ని సాధనలచే రూపొందించుకొని ఒక సూక్ష్మబిందువుగా బ్రహ్మరంధ్రములోకి నడిపించి నిల్వచేసుకొంటారనుకొనే సాధన. అనగా భారతీయ హఠయోగుల వజ్రోళి చైనాలోక్రీస్తుకు ముందేవుందని గ్రహించవచ్చు. పరివర్తితమైన ఈ సూక్ష్మబిందు గుళికనే చైనీయులు స్వర్ణామృతం. బంగారుగుళికలంటారు. మూడవసాధనలో సూక్ష్మ వీర్యసాధనా

కాలంలో భ్రూమధ్యదృష్టి కూడా సాధన చేస్తారు. భారతీయసాధనలో భ్రూమధ్యదృష్టివుండి భ్రూమధ్యభాగానికి సరిగా వెనుకనున్న "విలువైన అంగుళంచదరం"లో జ్యోతి ప్రకాశిస్తుందంటారు కూడాను.

ఈ బిందురక్షాప్రక్రియాత్రయంలో ప్రసక్తించిన వీర్యాన్ని టావో తనుసారమంటుంది. శరీరసారమైన వీర్యం, ప్రాణం, మనస్సులన్నవానిని (చింగ్, చీ, షెన్) సంపత్త్రయమంటుంది. స్థూలదశనుంచి వీనిని అతీవసూక్ష్మదశకు పరివర్తనమొందించటమే టావో సాధనలో మొదటి మూడు అంశాలు. సూక్ష్మమైన బిందుసిద్ధి తరవాత సాధించవలసిన స్థూలప్రాణశక్తి యొక్క (4) పరిపుష్టికి, (5) దాని సూక్ష్మీకరణకుప్రాతిపదిక, ఆ సూక్ష్మప్రాణసిద్ధి (6) స్థూల మనఃపరిపుష్టికి, అవతల (7) దానిసూక్ష్మీకరణకు ప్రాతిపదిక. సూక్ష్మమనస్సులో ఒకవిస్ఫులింగంవలె అందరిలోనూ వుంటుంది. మొత్తం స్థూలమనస్సును ఆ అతీవసూక్ష్మ మనస్సుగా చేయటం అనగా ఆత్మీకరణ చేయటమనవచ్చు. సూక్ష్మీకృతమనస్సు శూన్యరూపమంటారు. ఇక అష్టమ సాధనలో వైయక్తికమైన శూన్యచిత్తాన్ని విశ్వశూన్యతత్వాన్ని టావోతో ఏకమాత్ర మొనరించటమంటుంది. క్లుప్తంగా షుమారుగా టావో అష్టాంగ సాధన ఇది.

మితమైన స్నానాన్న పానీయనిద్రామైథున నియమాలు, రాగద్వేష హర్షకోపాదులకులోనుగాకుండటం, భారతీయుల ఆసనాదివ్యవహారంగాకుండా జోడింపబడివుంది. మూడవసాధనలో భ్రూమధ్యదృష్టి, నాల్గవసాధనలో నాసాగ్రదృష్టిసాధనవుంటుంది. అందులోనే చిత్తవృత్తినిరోధం ప్రాణాయామం ఒకటివిడిచి ఒకటిగా వరుసగా సాధనచేయటముంటుంది. టావో ప్రాణాయామం రానురాను నోరుతోనుముక్కుతోను శ్వాసక్రియను తగ్గించమంటుంది. గర్భస్థశిశుశ్వాసక్రియకు నోరుముక్కులతోపనిలేదు గదా,అంతే. మూత్రపిండాలతో శ్వాసించటమని, మడమలతో శ్వాసించటమని, రోమకూపాలతో శ్వాసించటమని నాలవసాధనలో వుంటాయి. ఐదోసాధనలో శరీరంలో ఆంతరిక తాపాన్ని అనగా మానసికమైన వేడిని సృష్టించి స్థూలప్రాణసూక్ష్మీకరణను రసాయనపరివర్తనను సాధించాలంటారు. ఈదశలోనే నాథసంప్రదాయంలోవచ్చే చంద్ర సూర్యులప్రక్రియలను తలపించే ప్రసక్తివుంటుంది, సూర్యనాడి

ప్రచండంగామండే కొలిమి అనీ, దేహం ఒకమూస అనీ అందులో వీర్యంతది తరాలు కరిగే లోహాలనీ, కొలిమిని జ్వలింపజేసే ఊదు తిత్తులగాలి ప్రాణవా యువులనీ రసాయనసాధనలోని పరిభాషతో కూడిన రూపకాలంకారంతో వుంటుంది. రసేశ్వరసాధనలో వలె ఓషధులు ఖనిజాలు సేవించటం వుండేది. పాదరసం-అభ్రకం- రససిందూరం- భాస్వరం- ఉల్లిపాషాణం- సీసంవంటి ఖనిజ రసాయనసేవనం భారతీయ రససిద్ధుల ప్రక్రియలవంటివున్నాయి. ఆరవసాధన నుంచి వ్యాయామాన్ని తగ్గించటం నిరసించటంవుంది. హఠయోగానంతర రాజ యోగంలో హఠసాధన విసర్జించమనటం, హఠసాధనే అసలులేకుండా రాజయో గమే ఏకైకసాధన అనటంవంటి భిన్నాభిప్రాయాలు టావో సాధనలో కూడా వున్నాయి. ఊరకుంట తెలియ ఉత్తమయోగంబు అన్నట్టిధోరణి ప్రస్ఫుటంగా వినవస్తుంది.

టావో చిరాయుపు, చిరయౌవనం, సిద్ధదేహంలేక దివ్యదేహంసాధించటం దివ్యదేహంతో Dragon ఎక్కి నక్షత్రమండలంలోకి ఎగిరిపోవటం వంటి వేమేమోవున్నాయి.

ఈచైనీయ టావోతాంత్రికసాధన దాదాపు ఐదువేలేళ్ళనాటిదిగా చెప్తు తారు. క్రీ.పూ 2852 నాటినుండి 2255 వరకుగల ఆరువందలేండ్ల కాలాన్ని చైనావారి చరిత్రలో తొలిస్వర్ణయుగమంటారు. ఆయుగంలో విలసిల్లిన రాజర్షి పంచకం, (Five Emperor Sages) యీ టావోను ప్రవర్తింప జేశారంటారు. క్రీ. పూ. 6,7 శతాబ్దాలలోనే యీసంప్రదాయం లిఖితమైంది. ఐచింగ్ అనే గ్రంథం ఆదిమరచన. ఆతర్వతనే లావోత్సేరచనలు. క్రీ. త 3వశతాబ్ది సరికీ టావో సిద్ధాంతసాధనల్లో అభివృద్ధి సర్వం సంపూర్ణమయిందంటారు.

చైనీయ సిద్ధులైన బోగరు పులిపాణులు క్రీ. త. మూడో శతాబ్దంలో దక్షిణభారతం చేరుకొన్నారు. వారివల్ల తమిళ సిద్ధరు సంప్రదాయం తలెత్తిం దంటారు.

కాని అంతకముందే నాగార్జునుని ప్రజ్ఞాపారమితా శాస్త్రంలోని రసవాద సంవిధానాలు ప్రసక్తమయ్యాయంటారు. నాగార్జునుని అమితాభ బుద్ధోపాసన

అమితాయుస్సు కొరకేర్పడినది. అమితాయుర్భావన నాగార్జునునిలోవుంది. మంజుశ్రీ మరికొందరు బోధిసత్త్వులు కుమార భూతులుగా, నిత్యకుమారులుగా వున్నారు. నాగార్జునాచార్యుడు తాత్వికుడేగాక రసాయన విద్యామూర్తి. సిద్ధ నాగార్జునుడు వేరు ఆర్యనాగార్జునుడువేరు అంటారు. తత్వవిద్య, వైద్యం, రసయోగం మూడూ శాతవాహన సమకాలికుడైన మహాయానాచార్యనాగార్జునుని యందున్నవని సర్వగాథలు తెలుపుతున్నాయి. నాథయోగ ప్రక్రియలు పరిభాషా మహాయానాచార్యులవద్ద మాత్రంలేవు. స్త్రీనింద అంతకన్నాలేదు.

# ఫలితార్థం

వేమన అనేకమైన తత్వసంప్రదాయాలను, యోగసాధనా సంప్రదాయాలను అవలంబించుతూ సుదీర్ఘమైన పరిణామయాత్ర చేశాడు. [అదంతా నా "విశ్వదాభిరామ వినురవేమ", తదితర ప్రచురిత రచనలలోను, ప్రకటించనున్న రచనలలోను వివరంగా చెప్పాను. ఇక్కడ పునశ్చరణ అవుతుంది.] కడకు వేమనకు స్థిరపడిన జీవత్ప్రశస్తి అచల సంప్రదాయ ప్రశస్తి. తాను చెప్పియున్న పేరది. ఆ సంప్రదాయం చెప్పుతున్నదది. పాశుపతప్రశస్తి వ్రాత ప్రతులకే పరిమితమైనమృతప్రశస్తి, అర్థంకాకుండాపోయిన మృతప్రశస్తి.

మత సంప్రదాయాన్ని పేర్కొనకుండా వేమన ప్రవర్తనా సరళిని పూర్వం యితరులు వర్ణించిన పద్యాలు కొన్నివున్నాయి. వానిని వేమన ప్రశస్తి పద్యాలుగా ప్రథమ గణ్యాలుగా ఆచార్య కొర్లపాటివారు గ్రహించి, అందు వర్ణించిన వేమన వేషభాషలు చేష్టలు చర్యలు సర్వం నాథయోగ సంప్రదాయాన్ని నిరూపించుతవని, అందుచే వేమన నాథయోగిగా పూర్వమే ప్రసిద్ధుడయ్యాడని సిద్ధాంతం చేశారు. ఆ పద్యాల్లో నాథయోగి నడవడి వేషభాషా భూషలేవీ లేవని, అది భ్రమయని, అందు వర్ణితమైన వేమన వర్తన పాశుపత సంప్రదాయ పరాకాష్ఠయని యీ వ్యాసంలో చెప్పాను.

కాని వేమన పాశుపత తత్త్వదశను దాటి అచలదశను చేరుకొన్నాడని, అందుచే అతనికా అచల ప్రశస్తి యేర్పడి, స్థిరపడి సజీవంగా వుందని, పాశుపతాది శైవదశలలో అలవడిన దిగంబరత్వం అలవాటుగా మిగిలిపోయిందని,

వేమన నాథయోగంతోసహా శైవసంప్రదాయాలన్నింటిని ఆపోశనంపట్టి, అవలంబించి ప్రయోగం చేసుకొంటూ శివుని శూన్య స్వరూపునిగా చెప్పిన కర్నాట వీరశైవవీధికి చేరి శూన్యతత్వాన్ని బయలు తత్వంగా గానంచేసి అచల శూన్య సంప్రదాయానికి ప్రారంభకుడయ్యాడని, వేమన ఆర్థిక సామాజికదృష్టి సర్వం శైవశూన్యత్వతానికి ప్రాతిపదిక అయిన బౌద్ధమాధ్యమక శూన్యతత్వ వేత్త అయిన నాగార్జున దృష్టికి చేరుతుందని, చెందుతుందని, ఇంత బహు ముఖమైన పోలికలేని ప్రజ్ఞ ప్రపంచ చరిత్రలో మరొకరిలో కానరాదని మా పరమాభిప్రాయం.

—:o:—

నేను బహుశః ఆగస్టునెల మొదటి వారంలో బెజవాడ రావచ్చు వస్తే మీరు బెజవాడలో వుంటే అవశ్యం కలుస్తాను. ఈ లోపున మీరు విశాఖపట్టణం వస్తే తప్పక మా ఇంటికి వస్తారుకదా.

నెం. 1, సీసేండ్స్ క్వార్టర్స్
ఆం. యూ., వాల్తేరు.

ఇట్లు
కొర్లపాటి శ్రీరామమూర్తి

శ్రీయుత కొర్లపాటి శ్రీరామ్మూర్తిగారికి, 13-7-85

నమస్కారము. మీకు వ్రాశాను నా విశాఖ ప్రయాణంగూర్చి. వచ్చాను-తిరిగి వెళ్ళాను-అది వచ్చిన దాకందుకు-జరిగినదొకటి. స్టేషనులో దిగటంతోనే విషాదవార్త. తిన్నగా స్మశాన వాటికకు వెళ్ళవలసి వచ్చింది. మా స్నేహితుని కోడలు శుక్రవారం సాయంత్రం విశాఖలో రోడ్డు ప్రమాదంలో మరణించింది. A.U. ఇంజనీరింగు కళాశాలలో ఎలక్ట్రానిక్సు లెక్చరర్ సతి మరణించింది. ఆ విషయం ముగించుకొని తిరిగి వెళ్ళిపోయాను. అందుచే మీ యింటికి రాలేకపోయాను.

శ్రీనాథుని దండకంలో సోమ సిద్ధాంత ప్రసక్తి వున్నది. అదికూడా శైవంలోనే వుందనగలమా? అని మీరు ప్రశ్నించారు. దానికి నేనేకాదు-దర్శనాలతో గాఢపరిచయంగల వారెవరైనా సోమసిద్ధాంతం శైవంలో వున్నదనే మీకు చెప్పవలసిన వారవుతారు. అందులో సందేహం లేదు. 1959 నుంచి మీరు నైషధం పాఠం చెప్పతున్నామన్నారు. మీరేకాదు, మల్లినాథసూరి సైతం నైషధంలో శైవంలోని రహస్యాలను చెప్పకుండా వుండిపోయాడు. శూన్యవాదం కర్నాటక వీరశైవంలోనే కాదు, ఉత్తర భారత శైవ దర్శనాల్లో కూడా వున్నవి. గోపీనాథ కవిరాజు వ్రాసిన ఆది శంకరులనే గ్రంథావలోకనం ఈ విషయంలో ఎంతో సహాయకారి అవుతుంది. హరవిలాసంలోని శివునిదారుకావన విహారంలోవున్న శివస్తోత్రం సంగతి మాత్రమే నేను నా వేమనలో వ్రాశాను. అది శ్రీనాథుని స్వతంత్ర రచనగదా. సోమ సిద్ధాంతంలోనూ శూన్యవాదమున్నది. కనుగొనగలరు. మామిడి సింగామాత్యుడే సోమసిద్ధాంతాలికి వ్యాఖ్యాత అంటారు. అదీ మీకు తెలిసి వుండాలి.

నేను బహు వ్యాసక్తుణ్ణి. వ్యాపారపు వత్తిడిలో ఏదోవొక పట్నంనుంచి నా పుస్తకాగార సహాయం లేకుండా-జ్ఞాపకాన్నిబట్టి ఈ వుత్తరాలు వ్రాస్తుంటానని కాస్త గమనించగోరుతాను. శైవంలో శూన్యవాదం చొచ్చివున్న సంగతి శ్రీనాధుని ఎరుకలోగల సంగతి యన్నంత వరకే నేను వ్రాశాననుకొంటాను. పాశుపత శైవంలో శూన్యవాదంలేదు. దర్శనరీత్యా పాశుపతం నామ వైశేషికాలని అవలంభించినది. శ్రీనాధుడు పాశుపతంలో దర్శనార్ధ గాఢత్వం చూపలేదు. పాశుపతమత విధులలోని గాఢాంశాలను తడపలేదు. శూన్యవాద విషయమూ అంతే. నేను నిదానించే వ్రాశాను. మీరుకూడా మరొకసారి సింహావలోకనం చేసుకోవడం బాగుంటుంది. స్తిమితంగా మరొకసారి వ్రాస్తాను కూడా.

శ్రీనాథుని దండకంయొక్క అంతర్యం మీరేమ వ్రాశారో నేనెరుగను. ఆ వ్యాసాలుంటే పంపగోరుతాను. వేమన Project ను గూర్చి UGC శాంక్షన్‌మాట తెలుపగోరుతాను.

ఇట్లు

12-7-85 త్రిపురనేని వేంకటేశ్వరావు

ప్రొఫెసర్ కొర్లపాటి శ్రీరామమూర్తి 18-7-85

ప్రియ మహోదయులు

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి

నమస్కారములు

ఉభయకుశలోపరి. 13, 14 తేదీలలో మీ రాకకోసం ఎక్కడికీ వెళ్ళకుండా ఎదురుచూచి నిరాశచెందాను. మీరు 13వ తేదీనే వ్రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది. సంగతి తెలిసి సంతాపం కలిగింది. ఆ ప్రమాదం సంగతి నాకు ఆలస్యంగా తెలిసింది. ఈ ప్రమాదాలు ఇటీవల మరీ ఎక్కువైపోతున్నాయి. జీవితంలోని వేగమే ఇందుకు హేతువేమో అనుకొంటాను.

8-7-85 తేదీని నేను వ్రాసిన ఉత్తరంలో సోమసిద్ధాంతం శ్రీనాథుని శైవంలో వుందనగలమా? అని వ్రాసినట్టు గుర్తు. అసలే శైవంలో లేదని వ్రాసి వుంటానని నాకు అనిపించడంలేదు. అలా వ్రాసివుంటే అదో ప్రమాదం.

సోమసిద్ధాంతం పాశుపత, శాక్తేయశైవాలకి వారధి అనీ; ఆగమిక, తాంత్రిక శైవాలకి వారధి అనీ పెద్దల అభిప్రాయాలు. కొద్దిగా చదివాను. నాస్తిక దర్శనాల్లో సోమ దర్శనం వున్నది. అది జంతు బలితోకూడిన భైరవ పూజనీ, మద్యమాంస సేవనాన్నీ బోధిస్తున్నదని ఒక షడ్దర్శన పండితుని వివరణ.

హర్షనైషధానికి మల్లినాధసూరి వ్యాఖ్యానంకంటె నారాయణ పండితుని వ్యాఖ్యానం ప్రామాణికం. అందులో "సోమసిద్ధాన్తః కాపాలిక దర్శనం, అని వున్నది. శక్తిపూజ, క్రపూజ, పంచమకారాలు కాపాలికుల పద్ధతులే" ఏవం విధమైన సోమసిద్ధాంతం శ్రీనాధుని శైవంలో వుందనగలమా? అవి నా సందేహం. ప్రశ్నకాదు.

సోమసిద్ధాంతంలో శూన్యవాదం లేదని నేను వ్రాయలేదుకదా.

"మామిడి సింగనామాత్యుడే సోమసిద్ధాంతానికి వ్యాఖ్యాత అంటారు, అదీ మీకు తెలిసే వుండాలి" అని వ్రాశారు. ప్రబోధ చంద్రోదయంలో పరామృష్టమైన సోమ సిద్ధాంతానికి మామిడిసింగన వ్యాఖ్యానం వ్రాసినట్టు ఆరుద్ర వ్రాయడం, అది మీరు అచ్చువేయడంతోపాటు మామిడి సింగన వ్యాఖ్యానం వ్రాసిన సోమ సిద్ధాంతం ఏమిటో కూడా నాకు తెలిసే వున్నది.

"హరవిలాసంలోని శివుని దారుకావన విహారంలోవున్న శివస్తోత్రం సంగతి మాత్రమే నేను వ్రాశాను. అది శ్రీనాథుని స్వతంత్ర రచనగదా!" అని వ్రాశారు.

నిజమే. అది శ్రీనాథుని స్వతంత్ర రచనే కాని మీ వేమనలో మీరు ఇలా వ్రాశారు.

పుట 23—శివస్తోత్రములో

"శూన్యస్వరూపాభిధాలింగ ఖట్వాంగలింగా హి లింగా భగంగా సరిల్లింగ.." అనుచు శివుని శూన్యస్వరూపమును దెలిసి సంబోధన కూర్చినాడు."

"శ్రీనాథుని శివస్తోత్రము"నుంచి మీరు గైకొన్న పంక్తి సరిగాలేదు. ఒక సుదీర్ఘ సమాసంలో— "స్పందితానంద లింగాది మధ్యాంత శూన్య స్వరూపాభిధాలింగ" అని శ్రీనాథుని దండకంలోని పంక్తి.

—స్పందితానందలింగా! ఆదిమధ్యాంత శూన్యస్వరూపాభిధాలింగ!" అనికదా పదచ్ఛేదం. ఆదిమధ్యాంత శూన్యస్వరూప సమాసంలో శూన్యశబ్దానికి అర్థం రాహిత్యం. ఆదిమధ్యాంత రహితుడు శివుడని అర్థం. రాహిత్యార్థకమైన శూన్యశబ్దం అభావార్థకం కాని మాధ్యమిక శూన్యవాద విషయమా? భగవంతుడు ఆదిమధ్యాంత రహితుడు అనే భావం బౌద్ధమతంలోనే పుట్టివుంటే అభిప్రాయ భేదానికి అవకాశంలేదు.

ఇంతమాత్రాన శైవంలో శూన్యవాదంలేదని నా అభిప్రాయం కానేకాదు పై శివ స్తోత్రం మరోసారి నిదానంగా పరిశీలించండి. అందులో అభావార్థక శూన్యమేకాని ప్రతీత్యముత్పాదసదార్థక శూన్యం లేదని నా అభిప్రాయం.

మాధ్యామిక శూన్యవాదం ప్రభావం మీరు వ్రాసినట్టు "కర్ణాటక వీరశైవంలోనే కాదు; ఉత్తర భారత శైవదర్శనాల్లోకూడా "నె" కాదు కర్ణాటక వీరశైవంకంటె చారిత్రికంగా గౌరవ కాలికమైన తమిళ శైవంలోకూడా వున్నది. ప్రభావంతోపాటు పరిణామంకూడా వున్నది.

ఇక శ్రీనాధుని సరస్వతీ దండకం గురించి ఒక మాట వ్రాసి ఉత్తరం ముగిస్తాను.

"యా సోమసిద్ధాన్త మయాననేవ శూన్యాత్మతా వాదమయోదరేవ

విజ్ఞాన సామస్త్యమయా న్తరేవ సాకారతాసిద్ధిమయాభిరేవ"

అనే శ్రీహర్షుని శ్లోకానికి "నమస్సోమ సిద్ధాన్త కాన్తాననాయై, నమశ్శూన్య వాదాత్మ మధ్యాన్వితాయై, సువిజ్ఞాన సామస్త్య హృత్పఙ్కజాయై నమస్తేఽస్తు సాకారతాసిద్ధిభూమ్నే"— అనే శ్రీనాధుని దండక పంక్తులు రూపాంతరాలు మాత్రమే. కనుక ఇందులోని విశేషాలు శ్రీహర్షునివి కాని శ్రీనాధునివి కావని నా అభిప్రాయం–

ఇదంతా జిజ్ఞాస కాని జిగీష కాదని మనవి

తా. క.: మొదటి ఉత్తరంలోనూ, ఈ ఉత్తరంలోనూ నేను మరిచిపోయిన, మీరు అడిగిన విషయం వేమన పరిశోధిత ముద్రణం గురించి యు. జి. సి. నుంచి ఏమీరాలేదు. రాకపోవచ్చు.

ఇట్లు

కొర్లపాటి శ్రీరామమూర్తి

ప్రొఫెసర్ కొర్లపాటి శ్రీరామమూర్తి 1-8-85

ప్రియమహోదయులు

శ్రీ త్రిపురనేని వేంకటేశ్వరరావుగారికి

నమస్కారములు

ఉభయకుశలోపరి. 8-7-85 తేదీ నా ఉత్తరం నకలుతోపాటు 29-7-85 తేదీని వ్రాసిన ఉత్తరమందినది. 'అదికూడా శైవంలో వుందని అనగలమా?' అని వ్రాయడం ప్రమాదమే. 'అదికూడా శ్రీనాథుని శైవంలో వుందని అనగలమా?' అని సవరణ అవసరమే. హరవిలాసంలోని దండకం ఈపాటికి 'Check' చేసి వుంటారు. శృంగార నైషధంలోని దండకంలోనూ, తన్మూలంలోనూ 1. వేదాలు 2. నిరుక్తం 3. వ్యాకరణం 4. జ్యోతిశ్శాస్త్రము, పూర్వమీమాంస 5. ఉత్తరమీమాంస 6. తర్కశాస్త్రము 7. పురాణము 8. ధర్మశాస్త్రము 9. ప్రణవము 10. సోమసిద్ధాంతము 11. శూన్యవాదము 12. విజ్ఞానవాదము సరస్వతీదేవిపరంగా సమన్వయించడం జరిగింది. ఇక గ్రహించడానికి హేతువు శ్లేషానుకూల్యం వగైరా. ఇందులో వ్యాకరణం, పూర్వోత్తర మీమాంసలు ఆస్తిక దర్శనాలు. సోమసిద్ధాంత, శూన్యవాద, విజ్ఞానవాదాలు నాస్తిక దర్శనాలు. అయితే ఆస్తిక దర్శనాలు ఆరు–నాస్తిక దర్శనాలు ఆరుకదా. అన్నీ చెప్పకపోయినా ఉపలక్షణంచేత చెప్పినట్టు గ్రహించాలి. అదొక సంప్రదాయం. సరస్వతి=వాక్కు, సరస్వతీదేవి– వాక్కు ఆస్తిక గ్రంథాల్లోనూ వున్నది నాస్తిక గ్రంథాల్లోనూ వున్నది. కనుక వాక్యసమగ్రతనీ సరస్వతీదేవి స్వరూపాన్నీ కలిపి చెప్పడం జరిగింది. సరస్వతీ వర్ణనలో ప్రతిపాదించిన నాస్తికవాద విషయాలన్నీ శ్రీహర్షుడు విపులంగానూ, శ్రీనాథుడు సంగ్రహంగానూ తర్వాత ఖండించడం జరిగింది. కనుక అని కవులికి అభిమతాలు కావని అర్థం. శ్రీహర్షుని నైషధీయ చరిత్రకు ఆయన ఖండన ఖర్చు భాద్యనికి లక్ష్య ఆనందం అనే పండితాభిప్రాయం. ఇదీ ఆ దండకంలోని అంతర్యం. ఇక మీ వేమనలో "శ్రీనాథునకు మాత్రమా విషయము తెలియును" అనే మీ ప్రతిపాదనకు నా అభిప్రాయభేదం లేదు. కాని అందుకు ఉదహరించిన హరవిలాస దండకపంక్తి తత్యమర్థంకాదు.

సౌమదర్శనం నా_స్తిక దర్శనంగా పేర్కొన్న షడ్దర్శన పండితుడు కొల్లూరు సోమశేఖరశాస్త్రిగారు మాత్రమేగాక పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు కూడా వున్నారు. 1. వై శేషికము (కాణాదము) 2. న్యాయము (గౌతమము) 3. సాంఖ్యము (కాపిలము) 4. యోగము (పాతంజలము) 5. పూర్వ మీమాంంస (జైమినీయము) 6. ఉత్తరమీమాంస (బాదరాయణీయము) ఆ_స్తిక దర్శనాలు అనీ, 1. చార్వాకదర్శనము 2. బౌద్ధ ధర్శనము 3, జైన దర్శనము 4. అర్హత దర్శనము 5. దిగంబర దర్శనము 6. సౌమదర్శనము నా_స్తిక దర్శనాలు అనీ వ్రాశారు. (షడ్దర్శనములు పుటలు 7-8) వ్యాకరణము కూడ దర్శనమని వ్యవహృతమని కూడా చెప్పారు. పై వర్గీకరణానికి "నా_స్తికో వేద విన్దకః" అను మను వచనం ప్రమాణీకరించారు (పుట 6)

మరి "శ్రీనాథుడు పాశుపత శైవంలో గాఢమైన, సూక్ష్మమైన అంశా లను రచనలో చూపలేదనే నా మాటతో ఏకీభవిస్తున్నారో లేదో తెలుపలేదు" అని వ్రాశారు. ఏకీభవించకపోతే తెలిపేవుందును గదా !

ఇట్లు
కొర్లపాటి శ్రీరామమూ_ర్తి

ఆచార్య శ్రీరామమూ_ర్తిగారికి, 3-8-85

ఇంకా తిరుపతికి బయల్దేరలేదు. మీ ఉత్తరం (1-8-85) అందినది. హరవిలాసం చెక్ చేయలేదు. ఇంతలో చేయలేనుకూడ. నేనలా తీసుకోవ డానికి నేను కారణం కాదనుకొంటున్నాను. తర్వాత చెప్తాను.

పేరి సూర్యనారాయణశాస్త్రిగారు కానీండి, కొల్లూరివారు కానీండిగాని జైన, అర్హత, దిగంబర దర్శనములని జైనదర్శనాన్నే మూడు పేర్లుచెప్పి, మూడుగా సంఖ్యపెంచి నా_స్తిక దర్శనాలు ఆరని, ఆ_స్తిక దర్శనాల సంఖ్యకు సరిపడా పెంచడం సరికాదు. జైనములోగల భేదాలంటే అవి భేదాలు కావు భేదాలు చాల వున్నై. ప్రచురమైనవి రెండుగాని మూడుగావు. జైనములో భేదాలు లెక్కించి బౌద్ధములోని భేదాలను లెక్కించకపోవడం సరికాదు. ఆ_స్తిక నా_స్తిక దర్శనాలు ఆరనే లెక్కమీద నాకెప్పుడూ సదభిప్రాయంలేదు. పేరి వారుగాని జైన, అర్హత, దిగంబర దర్శనాలంటూ విడివిడిగా వానివాని

స్వరూపాలను నిర్వచనంచేస్తూ యిచ్చివుంటే చూడాలని వుంది. వీరు సామ దర్శన స్వరూపాలు చెప్పి వుంటే కూడా చూడాలని కుతూహలంగా వున్నాను. వారి గ్రంథం పంపితే XEROX చేసి తిరిగి పంపించగలను.

ఖండన ఖండఖాద్యం నేనింతవరకు చూడలేదు—విన్నాను. అందులో సోమసిద్ధాంత ఖండనంకూడా వున్నట్టయితే, దాని స్వరూపం మరింత ప్రామాణికంగా తెలుసుకోడానికి వీలుంటుంది. అదేమైనా మీ యూనివర్సిటీలోవుంటే, ఖండన ఖాద్యంలో కనిపించే సోమసిద్ధాంత స్వరూపమని ఒక వ్యాసం మీరు ప్రచురించటం మంచిది. వ్యాకరణము దర్శనమనే వ్యవహారం వుందిగాని షడ్దర్శనాల లెక్కలోకి ఎవ్వరూ చెప్పడం ఎరుగను. నైషధ దండకంలో వేదాల తర్వాత వేదాంగాలుగా నిరుక్త వ్యాకరణ జ్యోతిశ్శాస్త్రాలు చెప్పాడు. అందులోని వ్యాకరణం దర్శనంగా గణ్యం కారాదని అభిప్రాయం. పూర్వోత్తర మీమాంసలు, తర్కం అనగా న్యాయం-ఆస్తిక దర్శనాలు మూడు-సోమ శూన్య విజ్ఞాన వాదాలు మూడు నాస్తికాలు. అటు సాంఖ్యాన్ని చెప్పకుండా, మీమాంసలు రెంటిని-బౌద్ధ దర్శనాలు రెంటిని చెప్పటంలో విశేషంలేదాయని ఆశంక. ఇప్పటికి సెలవు.

ఇట్లు
మీ త్రిపురనేని...

P. S. : అసలుమాట మరచాను. వ్యాకరణం నాస్తిక దర్శనంగా లెక్క. శబ్దాద్వైతం, స్ఫోటవాదం—శబ్దనిత్యత్వం—సాగలాగితే నిరీశ్వరం కావాల్సి వుంటుంది. అదొక రగడ-నారగడ.

ఆచార్య శ్రీరామమూర్తిగారికి, 8-8-85

నమస్కృతులు. ఆగస్టు ఒకటో తేదీన వ్రాసిన మీ వుత్తరం చదవటం తోటే ఒక జాబు వ్రాశానుగాని మీ వుత్తరం ఫైల్లోపడి తిరుపతికి వచ్చింది. మళ్ళీ చదివాను. మళ్ళీ వ్రాయాలన్పించింది-సరస్వతీస్తవం గూర్చే.

హర్షుని సరస్వతీదేవిని ఆస్తిక నాస్తికోభయ విజ్ఞాన సర్వస్వరూపిణిగా చెప్పుతున్నది మీరొక్కరే ననుకొంటాను. ఇలాగే మీరు పూర్వంనుంచి పాఠం

చెప్పుతున్నారంటే ఆశ్చర్యమే. ఎందుకంటే కొత్తదారిగదాయని. మీరందుకు చూపిన కారణం సోమసిద్ధాంతం, శూన్యవాదం (ఇంకా విజ్ఞానవాదంకూడా నన్నారు) నాస్తికాలని, ఆ మాటలు నాస్తిక దర్శనషట్కాన్ని సూచిస్తున్నాయని అంతేగదా! వ్యాకరణంకూడా దర్శనమన్నారు ఇందులో మీరు. వ్యాకరణాన్ని నాస్తిక దర్శనంగా చెప్పటముండదన్నాను. ఈ స్తవంలో వ్యాకరణం దర్శన మైతే మట్టుకు మీకు నామాట ఉపోద్బలకం గదా! ఐతే ఈ స్తవంలో వ్యాక రణం దర్శనంగా చెప్పినట్టు కాదంటున్నాను. అలాగే విజ్ఞాన సామాస్త్య మయాంతరేవ....లో విజ్ఞానవాదముందనేందుకు వీల్లేదు. సామాస్త్యమెందుకు మరి? పైగా, అక్కడ విజ్ఞానం జ్ఞానభిన్నమైన విశిష్టార్థకం కూడాను.

కాగా, సోమ శూన్యం మీగతిన అవి నాస్తికాలని చెప్పుతారంటున్నారు. శైవులకు శూన్యంకూడా నాస్తికమేనా? ఒక్క బౌద్ధులదేనా? శ్రీనాథుని పాశు పతం అవైదికమా అనగా వైదికముకాదా. సోమసిద్ధాంతంలాగా పాశుపతంలాగు డంకాపాలికంవంటి శైవభేదాలు నాస్తికంగా చెప్పుతున్నారుకదా! అదేవరసలో శ్రీనాథుని పాశుపత శైవం అవైదికమనాలి. వీరశైవమూ అవైదికమనపేరే అదిలోమోసంధి. రాగారాగా అది వైదికమయి వూరుకొంది. శంకరాచార్యుల వారికి సాంఖ్యం అవైదికం. వైశేషికాన్ని అవైదికమన్నవారులేరా? కొత్తగా తలెత్తినవన్ని మొదట నాస్తికాలనిపించుకొని, పిదప ఆస్తికముగా పరిగణన పొందటం ఆచారమే. అలాగే సోమసిద్ధాంతం. శైవులవలంబించిన శూన్య వాదము ఆస్తికాలనిపించుకొన కాలంవచ్చి, హర్షునిద్వారా ప్రకీర్తితమైనాయి అనుకోవాలి. పేరి, కొల్లూరివారలు మరొకరు నాస్తిక దర్శనాలు ఆరు అంకెకు దెబ్బి ఒక్క జైనాన్నే మూడు పేర్లతో మూడింటిగా లెక్క అప్పగిస్తే సరిపో తుందా? ప్రామాణికమవుతుందా? వీరి వాక్యాలనుబట్టి మనం అర్థాలను సరి చేసుకోలేము. శంకరునికి పూర్వం షడ్దర్శనాలతో ఉత్తరమీమాంసలెదు. హరి భద్రసూరి షడ్దర్శన సముచయం వుందిగదా! ఖండన ఖండకావ్యం నైయాయిక వాద ఖండనమని-శూన్యవాదయ ప్రాసంగక పద్ధతిని కాస్తా ఉదయనాదుల మీద ప్రయోగించినదని, అద్వైతులు శూన్యవాదాన్ని వాడుకోటానికి ఇదొక మంచి ఉదాహరణలనీ చదువుకొన్నాను మునుపు. అందుకని హర్షుడు శూన్య వాదాన్ని, దాన్ని కలిగిన సోమాన్నీ ఆస్తికంచేసి వ్రాసిన శైవుడు. అందుచేత అతని సరస్వతి శైవ సరస్వతి హర్షుడు ఆస్తిక శాఖీయుడు కాదంటేనే నాస్తి

కంగా సోమాన్ని అనసంచేసి, ఉత్తర మీమాంసనుకూడా ఒక తోడనుమాత్రం చేశాడు. ఉత్తర మీమాంస అన్నంతమాత్రాన అద్వైతమే కాదుగదా శూన్య వాదాన్ని గదకరించుకొన్న అద్వైతాన్ని అద్వయమతంగా తీర్చుకొన్న శైవుడు హర్షుడు అతని సరస్వతియొక్క అందుకే సోమసిద్ధాంతం. శ్రీనాథుని వ్యాస పరాక్రాలను తెల్పాడు. ఉగ్ర వీరశైవము. అంతేకాదు. బాలా వ్రాశాను. వుంటాను-

మీ, త్రిపురనేని

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి 17-8-85

ప్రియమహోదయులు
శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి
నమస్కారములు

ఉభయకుశలోపరి. ఉత్తరాలు రెండూ అందాయి. మొదటి ఉత్తరంలో పేరివారి పుస్తకం, ఖండన ఖాద్యం గుర్తువున్నాయి. ఇటీవల ముద్రణ కార్య క్రమంలో మునిగి, ప్రయాణాలు తగిలి అవి పంపడం చేయలేదు. ఇప్పుడూ అదే పరిస్థితి. అవి సావకాశంగా పంపిస్తాను. ఇక రెండో ఉత్తరానికి సంబం ధించి రెండు, మూడు మాటలు వ్రాస్తున్నాను.

1. శ్రీహర్షుడు వర్ణించిన, శ్రీనాథుడు స్తోత్రం చేసిన సరస్వతి శైవ సర స్వతి అని మీరు అంటే, వైష్ణవ సరస్వతి అని మరొకరు అనవచ్చు. సంస్కృ తాంధ్ర నైషధాలనుంచి సాక్ష్యాధారాలూ చూపించవచ్చు. నా దృష్టిలో సర స్వతి సరస్వతే.

"విజ్ఞాన సామస్త్యమయాన్తరేవ సాకారతాసిద్ధి మయాభిలేన"

అనే పంక్తికి "సాకార విజ్ఞానవాదీ సౌత్రాన్తికః, విజ్ఞానస్య సాకారతా సిద్ధిస్త ద్దర్శనమ్" అని నారాయణీయం.

2. "పాణినేర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్య చ
కణాదస్యాక్షపాదస్య దర్శనాని షడేవహి"

పాణిని దర్శనం అంటే వ్యాకరణమేకదా. పతంజలి యోగశాస్త్రం బదులు పాణిని వ్యాకరణం ఆరు దర్శనాల్లో ఒకటని కొందరి పరిగణన.

3. తొమ్మిదవ శతాబ్దిన్ని హరిభద్రుడు బౌద్ధ న్యాయ సాంఖ్య జైన వైశేషిక మీమాంసలు షడ్దర్శనాలు అన్నా, పదవ శతాబ్ది జయంతుడు మీమాంసా, న్యాయ, సాంఖ్య, జైన, బౌద్ధ, చార్వాకములు షడ్దర్శనాలు అన్నా పదకొండు లేక పంద్రెండవ శతాబ్దినుండీ న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా వేదాంతము షడ్దర్శనాలుగా (ఆస్తిక) ప్రసిద్ధం. శ్రీహర్షుడు పంద్రెండవ శతాబ్దివాడు. శ్రీనాథుడు పధ్నాలుగు పదునైదు శతాబ్దములవాడు (హరిభద్రుడు వైశేషికం న్యాయంకంటె భిన్నమైన ప్రత్యేకత దర్శనంగా పరిగణించకపోతే ఆరవ దర్శనం లోకాయతం అనడం సరే.)

ఇట్లు
కొర్లపాటి శ్రీరామమూర్తి

ఆచార్య కొర్లపాటి శ్రీరామమ్మూర్తిగారికి, 28-9-85

నమస్కారములు. ఆగస్టు 17, 1985 నాటి మీ లేఖ విషయం విజయవాడకు దూరంగా వుండినందున, తీరికలేనందున ఆలస్యంగా రాస్తున్నాను. మీరు బాగున్నారని తలంచుతున్నాను.

1. సరస్వతీ స్తవంలో వ్యాకరణం దర్శన స్థానంలో శ్రీహర్షుడు పెట్టి చెప్పాడా అన్న విషయంలోనుంచి అది షడ్దర్శనాల్లో పరిగణితమైనదా అనే మీమాంసలోకి ఉరికినట్టుంది. స్తవంలో దర్శన పంక్తికి వెలిగా, వేరుగా, మున్నుగానే వేదాలవెంటవచ్చే వేదాలుగా అయిన నిరుక్త జ్యోతిషచ్ఛందో శిక్షా వ్యాకరణాల వంతున ఎంతిన వ్యాకరణం కూర్చుండబెట్టబడిందని, అందుచే దాన్ని దర్శనంగా అసందర్భంవల్ల తీసుకోరాదని కదా వ్రాశాను. ఆ విషయంగా మీరేమీ వ్రాయలేదు.

కాగా, వ్యాకరణాన్ని షడ్దర్శనాల్లో పేర్కొనటం నేనెరగనన్నందుకు అట్టిదొక కేవిన్మత మొకటున్నదని చూపించారు. సంతోషం. ఇప్పటికీ ప్రసిద్ధం

కాకపోయిన కేచిన్మతం అది. పైగా నాస్తిక దర్శనంగానే యిప్పటికీ తత్వ చరిత్రలో దానికి పరిగణన వుంటున్నది. ఆస్తిక దర్శనంగా దాన్ని ఎన్నికచేసే యత్నం జరిగిందని ఆశ్లోకం తెలుపుతున్నది. కాని అది ప్రాచుర్యం పొందలేదని తెలుస్తున్నది. అంతేకాదు, అది హర్షపూర్వమందే అవి షడ్దర్శన గణన పొందిన దాఖలా లేదనిపించుతున్నది. హర్షునికిముందే ఆస్తిక-నాస్తిక దర్శన షట్క వ్యవస్థీకరణ కనిపించటంలేదు. ఆస్తిక నాస్తికోభయ దర్శనాలను ఆరుగా చెప్పటం అతనిదాకా-అనగా, 12వ శతాబ్దిదాకా వుంది. అప్పుడే న్యాయవైశేషిక సాంఖ్యయోగ పూర్వోత్తర మీమాంసలను దర్శనిష్కటంగా-ఆస్తికషట్కంగా వేరుగా చెప్పటం ఆరంభమయింది. అలాగని మీరు వ్రాసిన మాటలే చెప్పుతున్నవి కూడాను. ఈ కేచిన్మతమే ప్రసిద్ధమైన ఆస్తిక దర్శనిషట్కముకన్న ముందటిదని మీరు భావించితే అందుకు నిరూపణ కావాలి. అందులోకూడా హర్షునికిముందే యీ కేచిన్మతం వుందని చెప్పాలి. అంత చేసినా, సరస్వతీ స్తవంలో దానిస్థానం దర్శనాల వరుసలో లేకపోవడాన, ఈ శ్రమ ఫలించని శ్రమ అవుతున్నవి

2. ఇక వైష్ణవ సరస్వతినికూడా చేయవచ్చనేమాట: చేస్తే ఆపగలదే మున్నది. కాని అందుకు సాక్ష్యాధారాలను యివ్వవచ్చు అంటే అవెలాంటివో మీరు ఊహించివుంటే-ప్రతిపక్షాన్ని ఊహించగలగాలి నిజంగా-అది వ్రాయగలరు. శైవవైష్ణవాలు సాగించిన సంకులసవారం యింతింతకాదుగదా !

అసలు సరస్వతి అంగాంగాలతో రూపకం వేసిన అంశాలన్ని వైదిక విషయాలు-శూన్యవాద, సోమసిద్ధాంతాలు, ప్రశ్నార్థకం పెట్టిన విజ్ఞానవాదం తప్ప. అందులో జైన సంబంధమైన అంశంగాని లోకామతంగాని లేనేలేదు అర్థసాధనవేళ లోకామతం, కామసాధనవేళ కాపాలికం ఆచరణీయాలని కౌటిలీయ వాక్కనుకొంటాను. ఇప్పటికీ అవైదికంగా మిగిలిపోయింది కాపాలికం. కలిపురుషలీలలో సోమసిద్ధాంతాలను ముద్దు చేసినట్లులేదు. సింగన్న సోమసిద్ధాంతాన్ని అవైదికంగానే గ్రహించాడనగలమా? అవైదికమైన సోమసిద్ధాంతాన్ని ముఖ్యమైన ముఖంగా సరస్వతికి చేస్తాడా హర్షుడు? బౌద్ధాన్ని కలిపురుషునికి యిష్టమతాల్లో పెట్టి చెప్పినవాడు హర్షుడు మరి. దశావతారాల్లో బుద్ధస్తుతి చేశాడనవచ్చు. అయితే అక్కడ విష్ణుని అవతారంగా ఆస్తికమైపోయి

వుంది అని సమాధానపరచుకోవాలి. హర్షుని దృష్టిలో సోమ సిద్ధాంతానికి వైదిక ప్రతిపత్తి వుందా? లేమోకదా! పాశుపతానికి ఎలాగూ ఆస్తిక(వైదిక) ప్రతిపత్తి యిచ్చేవున్నాడుకదా! శూన్యవాదం శైవాంతర్భాగమై అద్వయమై శూన్యవాదంకాదు. శూన్యాత్మతావాదం హర్షపుస్తకమయింది. హర్షునికి ఆస్తికా దర్శనంగా దర్శనమిచ్చి సరస్వతీ దేహాంగకంగా వర్ణితమయింది అనాలి. మీరు చెప్పేట్టు విజ్ఞానవాదంగా భావించాలంటే యోగవాసిష్ఠయమైన విజ్ఞానవాదంగా గ్రహించాల్సి వుంటుంది. అంతేగాని యథాతథంగా బౌద్ధ విజ్ఞానవాదం కారాదనుకోవటం ఔచిత్యం. కాని మీరు ఉదాహరించిన నారాయణీయ వివరణ ప్రకారం సౌత్రాంతిక శాఖ అవుతుంది గాని, విజ్ఞానవాదం కారాదు. అసలు అ విధంగా చూడకుండా జ్ఞానభిన్నమైన విజ్ఞాన సామస్త్యంగానే చెప్పుకొందా మంటే, అలా వీల్లేదని నిషేధించేందుకు ఏ శబ్దమూ ఆ పాదంలో లేదని తోస్తున్నది. మరొకసారి ఆలోచించి చూడండి. మళ్ళీ వ్రాయండి.

ఇట్లు
త్రిపురనేని వెంకటేశ్వరరావు

శ్రీయుత ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి,

19-10-85
విజయవాడ-10

నమస్కారములు. ఈనెల ఒకటవ తేదీన మీరు వ్రాసిన ఉత్తరం అందినది.

1. మామిడి సింగని, సోమ సిద్ధాంతాన్ని నేను చూచి ఎరుగను. ఆరుద్రాదులు రాసిందే నా ముందున్నది. అది జ్యోతిష్యమేనన్నారు మీరు. సరే. కాని హర్షుడు సోమ సిద్ధాంతాన్ని చూడకపోతే దాన్ని సరస్వతీ ముఖం చేయడన్నది గదా నా మాట. శూన్యవాదం కానీయండి (విజ్ఞానవాదం కానీయండి) అవి ఆస్తిక పరిణామం చెందించబడిన రూపంతోనే సరస్వతీ రూపాంతర్భాగాలైనవని నా అభిప్రాయం. వ్యాకరణం దర్శనంగా గణనం పొందినదనీ— నాస్తిక దర్శనంగా కూడాననీ—ఏమైనప్పటికీ హర్షుడు దానికి సరస్వతీ స్తవ సందర్భంలో దర్శన ప్రతిపత్తిని ఇచ్చి చెప్పలేదని కదా నా అభిప్రాయం! అందుకు మీరిప్పుడు భేదించరనుకొంటాను.

2. శ్రీనాథ నైషధంలో వాణి నలువ రాణే గావున మీరన్నట్టు ఆమె వైష్ణవ సరస్వతి అవుతుందనే సమస్య తెలుగులో లేదు రాదు. అయితే సమస్య సంస్కృత నైషధానికి చెందినట్టిది. అంతేగదా! కాని, సమస్య సమస్యే. బౌద్ధుల తారాదేవే మనకు సరస్వతి అయింది. అక్కడే ఆమె వీణా పాణి, పుస్తక పాణి-విద్యాధి దేవత, విశేషించి బుద్ధుని దేవి. శక్తి-బుద్ధులనేకులు- తారలనేకులు- అందులో ఒక్క తార సరస్వతీసమ. ఆ వివరాలు మరొకసారి ఇవ్వగలను. హర్షునికి బౌద్ధం బాగా తెలుసుగదా! అందుకే అలా సృష్టించ గలిగాడు. హయగ్రీవుడు కూడా ఒకానొక బుద్ధుడు—తారక బ్రహ్మంలోని సీతారామ నామము సీతా ప్రాథమ్యంతో ప్రాధాన్యంతో జపిస్తే అది మహాదేవి తారను జపించినట్లేయని-అందుచే అది తారకబ్రహ్మం-అంటారు. వైష్ణవ తంత్రాలుకూడా చూస్తే బాగుంటుంది. ఈ విషయంలో బెంగాలును పట్టుకోవాలి.

శూన్య వాదాన్ని శైవం ఇముడ్చుకోగా, బౌద్ధుల తాంత్రిక శక్తి దేవతలను వైష్ణవం ఇముడ్చుకొన్నదన్న మాట- హర్ష సరస్వతీ, బుద్ధ వైష్ణవ సరస్వతిగానూ- మళ్ళీ ఆ వైష్ణవి (బౌద్ధ) శూన్య వాదం ముఖం కలది గానూ చెప్పడం నిజంగా హర్షుని ప్రతిభ. నిజంగా నాకు ఖండనఖండఖాద్యం కావాలి- మీరే ఇప్పిస్తే ఎంతో కృతజ్ఞుణ్ణి-హరవిలాస దండకం పూర్తి పాఠం కల ప్రతి నా వద్ద లేదు- అదీ కావలసిందే. అదీ కాక విష్ణువు భార్య సరస్వతి అని హర్షుడు చెప్పితే నారాయణీయాది వ్యాఖ్యాకారులేమి చెప్పారో కాస్త వ్రాయ గోరుతాను- చాలా కుతూహల కరమైన విషయం అవుతుందని అంటాను. చూడాలని ఉంది.

మీ 'పల్నాటి యుద్ధం' పంపండి.

ఇట్లు
మీ త్రిపురనేని...

ఇంతటితో ఉభయకుశలోపరి తంతువు తెగిపోయింది. తరువాత ఎప్పటికో "నాధయోగి, మన వేమన" త్రిశూలధారియై విభూతిరేఖలతో రుద్రాక్షమాలతో, కౌపీన, అంచల వస్త్ర సహిత దై[illegible]కాశగమనాది అద్భుత మహిమాచర్యధుర్యుడై చరించిన వేమన విచిత్రచిత్ర లేఖా ముద్రాపకులుగా వెలువడ్డారు.

